# గురజాడ రచనలు

# జాబులు - జవాబులు, దినచర్యలు

రచయిత : గురజాడ అప్పారావు

సంపాదకుడు : సెట్టి ఈశ్వరరావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్ భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Letters & Diaries - By: Gurajada Appa Rao
Edited By: Setty Eswara Rao

ప్రచురణ నెం. : 2153

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మార్చి, 2000



ముఖచిత్రం: చంద్ర

వెల: రూ.60-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు-29. ఫోన్: 3229831

# పీఠిక

ఈ పుస్తకంలో ఇంచు మించు అంతా గురజాడ రాసినవి ఇంగ్లీషులోనే. అక్కడక్కడ తెలుగులో మాటలు, కొద్దిగా వాక్యాలు తగులుతాయి. మొత్తంమీద ఇంగ్లీషు నుండి తెలుగు అనువాదమే ఉంది. దీంట్లో మనకు తటస్థించేవారు కొండా వెంకటప్పయ్య పంతులు, కాశీనాథుని నాగేశ్వరరావు, వేదం వెంకటరాయశాస్త్రి, గిడుగు రామమూర్తి పంతులు, కొందరు దొరలు మొదలైనవారు. అందరి కంటే ముఖ్యమైన వ్యక్తి ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం.

గురజాడ అప్పుడప్పుడు తట్టిన భావాల్ని, మాటల్ని రాసుకోవడం అలవాటు. వాటికి సందర్భం ఏమిటో మనకు తెలియదు. తాను రాయబోయే ఏదో ఒక రచనలో ఆ భావాల్ని, మాటల్ని అందులో చెప్పాలన్నది ఆయన భావన.

గిరీశం ఆయనను వదలిపెట్టినట్టులేదు. విడివిడిగా రాసుకున్న మ్యూజింగ్స్‌లో గిరీశం మళ్ళీ అవతరించాడు. కన్యాశుల్కాన్ని మూడు భాగాలుగా రాయాలన్న ఉద్దేశం ఆయన కుండేదని అంటాం. ఈ విషయాన్ని మనం ఖచ్చితంగా చెప్పలేము, సారంగధర తెలుగు నాటకాన్ని రాసే ఆలోచన ఆయనకు వచ్చినట్టుంది. దానిలోని ఉదంతాన్ని కొద్దికొద్దిగా సంభాషణ రూపంలో రాశారు.

ఇంకో ముచ్చట. విజయనగరం సంస్థానంలో గురజాడ స్థానం ఎటువంటిదంటే – మాస్టర్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్ (సకల విద్యాపారంగతుడు) ఆయనకు అప్పజెప్పిన పనులలో 'హస్తబల్' వేలుకాదుగాని కొన్ని డజన్ల గుఱ్ఱాలకు ఉడకబెట్టిన ఉలవలు బాల్చీల్లో పెట్టి సైసులు (గుఱ్ఱాలను సంరక్షించేవారు) తినిపించేవారు. ఇంకా కొన్ని ఏమిటంటే ఏనుగులు, లొట్టిపిటలు కూడ ఉండేవి. చిన్న పిల్లలు స్కూలు నుండి ఇంటికి పోతూ పోతూ అక్కడకు వచ్చి చూస్తూ ఆనందించేవారు.

గురజాడకు 'దినచర్యల'ను రాయడం ఓ పెద్ద అలవాటు. 1895లో దినచర్యలు రాయడం మొదలుపెట్టారు. మధ్యలో కొంతకాలం ఆయన రాయలేదు. రాయకపోవటానికి గల కారణాలు మనకు తెలియదు. దినచర్యలు పూర్తిగా ఇంగ్లీషు భాషలోనే రాశారు. అరుదుగా కొన్ని తెలుగు పదాలను, వాక్యాలను రాశారు. చివరి దశలో తన ఆరోగ్య పరిస్థితులను గురించి చాల వివరంగా రాశారు. అంతటి అనారోగ్యంతోను ఓపికగా రాయడం మెచ్చుకోతగ్గ

విషయం. ఆయన పరిశీలనా దృష్టికి దినచర్యలు అద్దం పడతాయి. పాఠకులకు విసుగు చెందకుండా ఉండటం కోసం చాలవరకు రాయడం తగ్గించాము.

ఈ దినచర్యలలో ఆయన ప్రస్తావించని భోగట్టా ఉండదు. తన మనసుకు తట్టిన విషయాలు, తాను చేద్దామనుకున్న పనులు ఇటువంటివి ఎన్నో రాసి పెట్టారు.

దినచర్యల రాతకు అలవాటుపడ్డ ఆయన కొన్ని సంవత్సరాలు, కొన్ని రోజులు రాసినవి మనకు కనిపించవు. ఆయన రాయలేదని అనుకోవడానికి ఆస్కారం లేదు. ఆయన ఎవరి గురించో రాసినవి వారికి తెలిస్తే నొప్పించడమవుతుందని రాయలేదేమో! ఆయన చనిపోయిన తరువాత దాచివేయడం జరిగియుండవచ్చును. గురజాడ తాను చూసిన నాటకాల గురించి అనేకచోట్ల విమర్శిస్తూ అనేక విషయాలను రాశారు.

మద్రాసులో ఎగ్జిబిషన్ జరుగుతున్న సమయంలో అది తగలబడింది. ఆ వివరాలు తాను రాద్దామని యూరేషియన్‌లను, ఇంగ్లీషువాళ్ళు చిన్న చూపు చూడడం గురించి చాల చక్కగా రాశారు.

గురజాడ విదేశాలకు వెళ్ళలేదుగాని, తెలుగుదేశంలో, భారతదేశంలో కొన్ని వందల స్థలాలకు వెళ్ళినట్లు దినచర్యల ద్వారా తెలుస్తుంది.

విజయనగర సంస్థానంలో ఆయనకు అప్పగింపబడని పని అంటూ లేదు. కోట ఆవరణను శుభ్రపరిపించడం దగ్గర నుండి కాశీలో గంగానది ఒడ్డున ఘాట్‌లు కట్టడం, విజయనగరం సంస్థానం తరపున సంవత్సరాల తరబడి వారసత్వం దావా నడిపించారు. ఇటువంటివి ఎన్నో చేశారు.

'జాబులు–జవాబులు' 'దినచర్యల'లో ఉన్న విషయాలు ఇంచుమించు ఒక్కటే కాబట్టి వాటిలోని సమాచారాన్ని ఒకే పీఠికలో చెప్పడం జరిగింది. హైకోర్టుకు ఎదురుగా మద్రాసు క్రిస్టియన్ కేలేజీ గురజాడ కాలంలో ఉండేది. హైకోర్టు ఆవరణలో ఇంగ్లీషు ప్రొఫెసర్ల విగ్రహాలు ఇప్పుడు మనం చూడవచ్చును.

"జాబులు–జవాబులు", "దినచర్యలు" ఈ రెండు సంపుటాలను నేను చెప్పగా తన శక్తిని, సమయాన్ని వెచ్చించి శుద్ధ ప్రతుల్ని తయారు చేసినది మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో పిహెచ్.డి. పట్టాకు పరిశోధన చేస్తున్న కుమారి ఎన్. మేరీ సుజాత. ఆమెకు ధన్యవాదాలు.

సంపాదకుడు

# ఇందులో...



గురజాడ అప్పారావు



కన్యాశుల్కం నాటకంలో ప్రారంభ సన్నివేశం జరిగిన బొంకుల దిబ్బ



విజయనగరంలో వున్న ప్రస్తుత బొంకుల దిబ్బ



గురజాడ శిష్యుడు ఒంగోలుముని సుబ్రమణ్యం



గురజాడ అప్పారావుగారి కుమారుడు శ్రీ గురజాడ రామదాసు
18–20 మధ్య వయస్సులో వున్నపుడు



గురజాడ తన యింటిలో అలంకరించిన పాశ్చాత్య చిత్రం



గురజాడ తన యింటిలో అలంకరించిన పాశ్చాత్య చిత్రం



గురజాడ స్వంత గ్రంథాలయంలో పోయినవి పోగా గురజాడ పుస్తకాలు



గురజాడ అప్పారావు గారి కళ్ళజోడు



రవివర్మ చిత్రం – "రాధ"



కన్యాశుల్కంలో గురజాడ ప్రస్తావించిన అయ్యకోనేరు, గట్టు దృశ్యం



గురజాడ అప్పారావు గారు వ్రాసుకునే టేబిలు (ఇది ప్రస్తుతం లేటు వసంతరావు బ్రహ్మాజీరావుగారి ఇంట్లో వుంది)



మద్రాసు విశ్వవిద్యాలయం సెనేట్ భవనం



విజయనగరం మహారాజుల రాజభవనం



చక్రవర్తుల తాతాచార్యులు

# జాబులు - జవాబులు

గుంటూరు,
తేది: *3.11.1914.*

ప్రియమిత్రమా,

మీ ఉత్తరానికి కొంచెం ఆలస్యంగా సమాధాన మిస్తున్నందుకు మన్నింప కోరుతున్నాను. ది ఇంటర్మీడియటు తెలుగు కాంపోజిషన్ కమిటీ రిపోర్టు ది తెలుగు కాంపోజిషన్ కాంట్రవర్సీ రెండూ నాకు అందాయి. మీరు కోరినట్లుగా నేను వాటిని 'ఇండియన్ క్లబ్'కు అందజేస్తాను.

ఇక్కడ 'ఇండియన్ క్లబ్' కాక ది యంగ్మన్స్ లైబ్రరీ అసోసియేషను అనే పేరిట ఇంకొక సంఘం వుంది ఈ సంఘానికి నగరంలోని యువకులు ముఖ్యంగా జూనియరు లాయర్లు హాజరవుతూ వుంటారు. మీకు ఇంకొక సెట్టు పుస్తకాలను పంపించడానికి అవకాశం వుంటే, అలా పంపించడం వృధాకాదనుకుంటే తప్పక నాకు అందజేయండి. వాటిని నేను ది యంగ్మన్స్ లైబ్రరీ అసోసియేషనుకు ఇస్తాను.

కొండా వెంకటప్పయ్య పంతులు

☆ ☆ ☆

రెంటాల హౌస్,
మైలాపూరు, మద్రాసు,
తేది: *7 జూలై, 1909.*

ప్రియమైన అప్పారావు పంతులుగారూ,

మీరు పంపిన కన్యాశుల్కము, నీలగిరి పాటల ప్రతులు అందాయి. మీరు దయతో వాటిని బహూకరించినందుకు నేను మిక్కిలి కృతజ్ఞుణ్ణి. నాటకమును చదివి పట్టరాని ఆనందమును పొందాను. ఇది వరకే మీ నాటకం పలువురి ప్రశంసలను

**గమనిక:** 'జాబులు, జవాబులు' పుస్తకంలో ఎక్కువ భాగం ఇంగ్లీషుకు అనువాదాలనో, ఎక్కడో కొద్ది చోట్ల తెలుగులో పదాలు, వాక్యాలు వస్తాయని రాశాము. అలాగనే చాలా కొద్ది చోట్ల మాత్రమే ఒకరు రాసిన జాబుకు యింకొకరి జవాబు వుండడమూ జరిగింది.

పొంది ప్రసిద్ధి కెక్కింది. ఇంత ఉత్తమ నాటకాన్ని ఆంధ్రులకు ప్రసాదించినందుకు మీకు నా అభివందనాలు. మీరు ఏ భాషను పవిత్రమైనదిగా భావిస్తున్నారో ఆ వాడుక భాష నాటకంలో ముద్దుల మూట కడుతున్నది. మొదటి నుంచి చివరి వరకు హాస్యరసము పాఠకుణ్ణి పరవశుణ్ణి చేస్తుంది. నాటక ఇతివృత్తం అతి గంభీరం, నిరంతర ఆసక్తి జనకం. కథా సంవిధానం చక్కగా అమరింది. నాటకం పెద్దదయినా సన్నివేశ చమత్కారంవల్ల సంభాషణల మాధుర్యం వల్ల పాత్రల అమోఘ చిత్రణ వల్ల పాఠకుడు రచయితను తప్పుపట్టలేడు. మీ నాటకం జీవితాన్ని అతి సహజంగా చిత్రిస్తున్నది. ఛాందస శ్రోత్రియుడు, 'సంస్కర్త', దుర్మార్గుడు, మూర్ఖుడు, నేర్పులేని ఆడది తమ తమ మనః ప్రవృత్తులతో, మీ పాత్రలు సజీవమైనవి. ఇక అవి చెక్కు చెదరవు.

మీరు ప్రేమికులు, మీరు ప్రేమించడం ఎరుగుదురు. మీ నాటకంలో కొన్ని చోట్ల షాక్‌లు వున్నా, అవి చురకలు మాత్రమే. నాటక మంతటా విద్యుచ్ఛక్తి ప్రసరించినా, ఎన్నో వింత వింత మెరుపులు మెరిసినా, అందులోని విద్యుత్ప్రవాహం నిరంతరం ప్రవహిస్తూనే వుంటుంది. ఎంత వెలుతురు నింపినా అది తరగదు, చెదరదు.

(రెంటాల వెంకట సుబ్బారావుగారి లేఖ). గిరీశం వెంకటేశం పుస్తకాల జాబితాలో రెంటాల వెంకట సుబ్బారావుగారి పుస్తకం మేడీజీ ఒకటి, వీరు కాశీనాథుని నాగేశ్వరరావు గారి మేనమామ, ఇంకోటి కుప్పుస్వామి, అయ్యార్ మేడ్, డిస్కవర్డ్.

శంభుచంద్ర ముఖర్జీ కలకత్తాలోను, బెంగాల్‌లోను సుప్రసిద్ధ మేధావి. 'రీస్ అండ్ రయ్యత్' (రాజు రైతు) అన్న పత్రికకు సంపాదకుడు. ఆ పత్రికలో ఆయన చేసే విమర్శలకు గవర్నరులు, ఉన్నత ప్రభుత్వాధికారులు కూడ భయపడేవారట.

అంతటి ప్రసిద్ధుడు తన పత్రికలో గురజాడ ఆంగ్ల రచన 'సారంగధర' అన్న దానిని ప్రచురించారు. మొదట 'సారంగధర' విజయనగరంలోని ఆంగ్ల – ఆంధ్రపత్రిక 'ఇండియన్ లీజర్ అవర్'లో ప్రచురింపబడింది. దాని సంపాదకుడు గుండుకుర్తి వెంకట రమణయ్య గారు. శంభుచంద్ర ముఖర్జీ 'సారంగధర'ను చదివి మెచ్చుకొన్నారు. దానిని తన పత్రికలో పునర్ముద్రించారు.

అప్పటివరకు గురజాడ ఇంగ్లీషు కవి మాత్రమే. తన మాతృభాష తెలుగు అయినా, ఆ భాషలో రచనలు చేయడం మొదలు పెట్టలేదు.

శంభుచంద్ర ముఖర్జీ తన పత్రికలో ప్రచురించడమేకాక, ఇండియన్ లీజర్ అవర్ సంపాదకుని ద్వారా 'సారంగధర' రచయిత అయిన గురజాడ గురించి మొత్తం సమాచారాన్ని సేకరించారు. గురజాడ కవిత్వాన్ని, ఆయన రచనల్ని మెచ్చుకుంటూ ఆయనకు చాల ఉత్తరాలు రాసారు. అవి కొన్ని సేకరించడం జరిగింది.

ముఖర్జీ ఈ యువ కవిని ప్రోత్సహిస్తూ వాత్సల్యంతో అనేక సంగతుల్ని రాసారు. ఆ సంగతులలో ముఖ్యంగా మనకు కావలసినవి రెండు విషయాలు. ఒకటి ప్రకృతిని నిశిత దృష్టితో పరిశీలించమని, రెండవది మాతృభాషలో రచనలు

చేయమని ఇదే విధంగా గురజాడ అభ్యున్నతిని ఆకాంక్షిస్తూ అనేక విషయాల్ని ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా తెలియ జేయడం జరిగింది.

ఈ దిగువ ఇస్తున్న రెండు ఉత్తరాలు ఓలేటి వెంకట సుబ్బారావుగారికి మహారాణి లలిత కుమారిదేవి రాసినవి.

ఆనందగజపతి తనకు సంతానం లేని కారణంగా తన తల్లికి దత్తత తీసుకోమని కోరారు. ఆ దత్త పుత్రుడు అలకనారాయణ గజపతి. ఈయన భార్య లలిత కుమారిదేవి.

ఉత్తరాల్లో లలితకుమారిదేవి గురజాడ పట్ల ఎంతో గౌరవం, భక్తి వ్యక్తం చేసారు. ఆమె తనకు అప్పారావుగారు 'టెన్నిసన్' కవిత్వం గురించి బోధించినట్లుగా తెలిపారు.

లలితకుమారిదేవి ఉత్తరాల్లో – 'ఈ అమరకవి ఆంధ్రులకు, విజయనగరానికి శాశ్వత కీర్తిని తెచ్చినవారు. గురజాడ వారి గురించి ప్రత్యేక సంచికను మీరు పంపినందుకు ధన్యవాదాలు. మీరు ముత్యాల సరాల ప్రతినొకటి నాకు పంపితే సంతోషిస్తాను'.

"గురజాడ ముత్యాల సరాలు వ్రాయడమే కాదు. ఆయన ఆ ముత్యాల సరాలను ఆంధ్రమాత మెడలో వేసి అలంకరించారు. ఆయనే ఒక మణిపూస".

పై ఉత్తరాల సారాంశ మూల ప్రతుల్ని ఇక్కడ ప్రచురిస్తున్నాము.

☆ ☆ ☆

గురజాడ అప్పారావుగారి మనుమలు పెద్ద కుమార్తె, కుమారుడు ఓలేటి వేంకట సుబ్బారావు, కొడుకు రామదాసు, ఆయన కుమారుడు డాక్టర్ గురజాడ వెంకట అప్పారావు మొదలైనవారు గురజాడ అప్పారావు గారి గ్రంథాలు ప్రచురిస్తూ చేసిన కృషిని గురించి వారు రాసిన ఉత్తరాల సారాంశాన్ని ఇక్కడ సంక్షిప్తంగా ప్రచురిస్తున్నాము.

గురజాడ రెండవ కుమార్తె కొడుకు పాట్నాలో ఉన్నతోద్యోగిగా ఉన్నప్పుడు మాకోరిక ననుసరించి తన తల్లి రాసిన ఉత్తరాలను, ఆమె ఫోటోను పంపించారు. ఇవన్నీ మొత్తంగా ప్రచురించడం సాధ్యం కాదు కాబట్టి సంక్షిప్తంగా ప్రచురిస్తున్నాము.

ఓలేటి వెంకట సుబ్బారావుగారు ప్రత్యేకంగా మాకెంతో ప్రోత్సాహాన్నిచ్చారు. వెంకట సుబ్బారావుగారి కుమారుడు తన ముత్తాతగారి రచనలు ఇంగ్లీషులో ప్రచురించమని కోరుతున్నారట. వారికి తెలుగు రాయడం, చదవడం రాదు కాబట్టి ఇది సహజమే కాని మాకు సాధ్యమయ్యే పనికాదు. అంచేత వీటన్నిటిని సంగ్రహంగ ఈ సంపుటంలో ప్రచురిస్తున్నాము.

ఛాయా చిత్రాలలో గురజాడ వారి సమీప బంధువులవి, సన్నిహితులవి సేకరించి అచ్చువేస్తున్నాము.

లలితకుమారిదేవిగారు వెంకట సుబ్బారావుగారికి రాసిన రెండు ఉత్తరాల సారాంశము, మూలప్రతులు ఇక్కడ ప్రచురిస్తున్నాము.

ఒలేటి వెంకట సుబ్బారావుగారు గురజాడ వారి రచనలను గురించి, ఇతరత్రా విషయాలగురించి ప్రస్తావిస్తూ లెక్కకు మించిన ఉత్తరాలు మాకు రాసాను.

అనేక ఇతర సంబంధిత పత్రాల వలనే ముఖర్జీగారి లేఖలు కూడ విశాలాంధ్ర ప్రచురణాలయం ద్వారా హైదరాబాదులోని పురాపత్ర భాండాగారంలో చేర్చబడుతాయి.

☆ ☆ ☆

గురజాడ అప్పారావుగారి రెండవ కుమార్తె పులిగెడ్డ కొండయమ్మ 87 ఏళ్ళ వయసప్పుడు మాకు రెండు పెద్ద ఉత్తరాలు రాసారు. (మరుసటి సంవత్సరం చనిపోయారు.)

వాటిలో తన తండ్రి పోయేసరికి ఆమెకు 15 సంవత్సరాలని, తన తల్లి అప్పల నరసమ్మ పెట్టుకొనే నగలు, కట్టుకునే పట్టుచీరల గురించి రాసారు. అప్పారావు గారు రోజూ సంధ్యావందనం చేసేవారని, దేవతార్చనలు చేయటానికి ఒక బ్రాహ్మణుడు వస్తుండేవాడని మొదలైన విషయాల్ని తెలియ చేశారు.

☆ ☆ ☆

కోట, విజయనగరం,
తేది: *14* మార్చి, *1909.*

*ఒంగోలుముని సుబ్రహ్మణ్యం గారికి గురజాడ జాబు,*

నువ్వు పరీక్ష పాసయ్యావని నేనెంతో సంతోషించాను. మద్రాసులో నీకు జబ్బు చేసినందుకు చాలా భయపడ్డాను. పరీక్షల మూలంగా వచ్చిన శ్రమ అంతా ఇంతా కాదు. పాసయ్యాక కుర్రవాడికి పెద్ద బరువు దించుకున్నట్టుగా ఉంటుంది. పరీక్షలంటే నాకు పరమ అసహ్యం. అభిమానంతో నువ్వు వ్రాసినందుకు చాలా ధన్యవాదాలు. నాతో నీకున్న అనుబంధం సారస్వతం గురించి నీకు ఉత్తేజం కలిగిస్తే, నీతో నా పరిచయం వల్ల ఈతరం గురించి నాకు అభిమానం కలిగిస్తూ ఉంది. వారిపట్ల ఆసక్తిని కూడా కలిగిస్తూంది. నీ ద్వారా నేను నా యోగ్యతను తెలుసుకన్నాను. నా ఆరోగ్యం బాగుందని తెలుసుకొని నువ్వు సంతోషిస్తావు. దర్బారు రాజకీయాలకు నేను దూరంగా ఉండటం కూడా. 'కన్యాశుల్కం' చాల మార్పు చేసాను. దానిలో హాస్యరసం బాగా పెరిగింది. మూడు అంకాలు అచ్చుకు పంపాక పాత్రల భావాల్ని మార్చుకోవలసి వచ్చింది. నువ్వు మద్రాసు వెళ్ళినప్పుడు దయచేసి జి. రామస్వామి చెట్టిని చూడు. పని తొందరగా జరిపించమని చెప్పు. అచ్చుపని చాలా ఆలస్యం అవుతోంది. మా మేనల్లుడు పోతరాజు నరసింహంని ఈ పనిపట్ల శ్రద్ధ తీసుకోవలసిందిగా కోరాను. కాని, అతని నుండి ఏ జవాబు రాలేదు. తెలుగు వ్యాకరణం వ్రాతపని మొదలుపెట్టాను. నెల్లూరు వాడుక భాష గురించి వ్యాకరణం నాకు కావాలి. నా కోసం సంగ్రహంగా దాన్ని తయారు చేయగలవా? ముఖ్యంగా క్రియాపదాలు, విశేష్యములు. "అముద్రిత గ్రంథ చింతామణి" ప్రతులు

నాకు కావాలి. ఇది తిక్కన సోమయాజి రచన గురించి మహాభారతంలోని వ్యాకరణ దోషాల్ని గురించి తెలుపుతోంది.

ప్రేమాభిమానాలతో...
జి.వి. అప్పారావు

అలా కీర్తిశేషులు పూండ్ల రామకృష్ణయ్యగారు నాకు స్నేహితులు. ఆయన తిక్కన వారసులు గురించి కొట్టరవు గ్రామం గురించి వ్రాసారు. నా తరువాత జాబులో వివరంగా వ్రాస్తాను.

☆ ☆ ☆

ఎక్కుహిల్ హౌస్,
ఉదక మండలం,
తేది: 7 మే, 1909.

ప్రియమైనముని సుబ్రహ్మణ్యం,

నీ భోగట్టాలేవీ నాకు తెలియడం లేదు. ఇన్నాళ్ళూ ఎక్కడవున్నట్టూ, నువ్వు ఏం చేస్తున్నట్టు? తరచు నేను నీకు ఉత్తరాలు రాయడం లేదంటే కారణం నాకు రాయాలని లేక కాదు; బొత్తిగా వోపిక లేక.

"కన్యాశుల్కం" యిప్పటికి నూటయాభై రెండు పేజీలు అచ్చయింది. చిన్నక్షరాలతో ముద్రించినా రెండు వందల పేజీలు దాటేటట్టు వుంది. బిడియమనేది అడ్డు వస్తున్నమాట నిజమే. అయినా, కన్యాశుల్కం గొప్ప రచనగా రూపొందించానని నేను అనుకుంటున్నాను. నాటకం చదివి నాకు నేనే ముగ్ధుణ్ణయాను. అదే దీనికున్న గీటురాయి. మొదటి కూర్పు కంటే రెండవ కూర్పు నా మనోభావాలను ఆలోచనలను సమగ్రంగా వ్యక్తం చేస్తున్నది. తొలికూర్పు అలాగకాక, పై మెరుగులనే ప్రతిబింబించింది.

ఇంతవరకూ అచ్చయిన ఫారాలను నీకు పంపమని నాటక ముద్రాపకులకు వ్రాశాను. దయవుంచి జాగ్రత్తగా వాటిని చదువు, నీ స్నేహితులకు చదివి వినిపించు. నాటకంలో ఒకదానికొకటి అతకని విషయాలు అసంగతాలు ఏవైనా వున్నట్లు నీకు తోస్తే, వాటిని వెంటనే నా దృష్టికి తీసుకురా. అందులో ఏయే మాండలిక పదాలు నెల్లూరు జిల్లా ప్రజలకు అర్థం కావో ఆ పదాల దిగువను గీతగీసి గుర్తుపెట్టతివా, నాటకం చివర వాటి అర్థాలను వివరిస్తూ వొకపట్టిక చేరుస్తాను.

శ్రీ వేంకటరాయ శాస్త్రిగారి "ప్రతాపరుద్రీయము" వంటి కొన్ని నాటకాలలో కవితా ప్రౌఢిమా కల్పనా చాతుర్యమూ లోపించకపోయినా, ప్రస్తుతం తెలుగున వెలువడుతున్న నాటకాలన్నీ వొట్టి డొళ్ళ సరుకులు. చివరకు ప్రతాపరుద్రీయంలో సైతం పేజీలకు పేజీలు ఎన్ని తిప్పినా, అవి నాటక కథా విస్తరణకు పాత్రల పెరుగుదలకు ఉపకరించవు. అయితే యీ నాటకంలో నాకు బాగా నచ్చిన వొక లక్షణం మాత్రం వుంది. మనదేశ చరిత్రలో గుండెలను కదలించే వృత్తాంతాన్నొక

దాన్ని తీసుకొని దానిని నాటకంగా వెలయించేటపుడు, యీ కవి సాహిత్యాత్మక దేశభక్తి పూరిత కాల్పనిక వాతావరణాన్ని సృష్టించుకొని దానిని నేర్పుతో జయప్రదం చేశారు. కాని నాటకంలోని చారిత్రక చిత్రీకరణమటుకు కేవలం అభూత కల్పన. అసంభావిత విషయాలు సారస్వత కట్టుబాట్లను లైసెన్సు అతిక్రమిస్తున్నాయి. నువ్వు 'ప్రతాపరుద్రీయం' చదివే వుంటావు. కనుక దానిని గురించి ప్రస్తావించాను.

శ్రీ వీరేశలింగం, చిలకమర్తి రచించిన నాటకాలు నువ్వు చదివి వున్నట్లయితే, వాటిమీదనో, లేక నాకు తెలిసి తదితర నాటకాల గురించో కాదా నువ్వు చదివే నాటకాలను నాకొక్కొక్క ప్రతి చొప్పున పంపినట్లయితే వాటినో పరామర్శిస్తూ నీకు నాటక రచనాశిల్పం అవగతమయ్యేందుకు చిన్న చిన్న సమీక్షలు వ్రాసి పంపిస్తూవుంటాను.

షరా: నాన్నగారెలా వున్నారు? ఆయనకు నా ప్రణామాలు.

☆ ☆ ☆

ఎక్కహిల్ హౌస్,
ఉదక మండలం,
తేది: *17 మే, 1909.*

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం పంతులు,

మీ ఉత్తరం చేరింది. సంతోషం. చక్కని ఇంగ్లీషు భాషలో వ్రాసిన ఉత్తరం చూసి ఆనందించాను. నీ విమర్శనాత్మక.... పారిభాషిక పదాల అనువాదము ఇంపుగా ఉంది. నేను నీకు భోదపర్చవలసింది అట్టే ఉందనుకోను. నా నాటకానికి సమీక్ష వ్రాయి. ఏదైన మద్రాసు దినపత్రికల్లో ప్రచురణ జరిగేందుకు ప్రయత్నిస్తాను. పుస్తకం అచ్చు అయ్యాక, నా పుస్తక విక్రేతలు వావిళ్ల రామస్వామి శాస్త్రి అండ్ కో, ఎస్ప్లనేడ్ (ప్రొ. వావిళ్ల వెంకటరామశాస్త్రి సాహిత్య ప్రియుడు) ఆయనను పరిచయం చేసుకో. కొన్ని ప్రతులు ఆయన నీకు పంపేటట్లు చేస్తాను. స్థానిక పుస్తక విక్రేతల ద్వారా అమ్మకం చేయిద్దాం. కొన్ని ప్రతులు బహుమతిగా యిద్దాము. నిన్న నేను నా 'నీలగిరి పాటలు', కన్యాశుల్కానికి పీఠిక నీకు పంపించాను. వాటిని కూడ నువ్వు సమీక్షించు. నేను....రాయగలిగితే.... తెలుగు వ్యాకరణము.... చెయ్యవలసిన పని ఎంతో వుంది. నా ఆరోగ్యం బాగోలేదు. నీవు నాతో సహకరిస్తే బాగుంటుంది.

వృత్తిని ఎంచుకునే విషయం, ఏమి చెప్పేది? ఈ దేశంలో తెలివైన కుర్రవాళ్ళకు ఉద్యోగావకాశాలు లేవు. సారస్వత కృషి చేయమని సలహో యివ్వగలను. నా సాహిత్య కృషి ఎలా సాగుతుందో చూద్దాం. ఆ ప్రయత్నాలు వ్యాపార రిత్యా చక్కగా సాగినట్లయితే, నా సహకారిగా నిన్ను తీసుకుంటాను. ఇలోగా ఇప్పటిలాగే ఉండు. ఆ హిందూ ఉన్నత పాఠశాలలో (రిప్పన్)... ఆయన తల్చుకుంటే అక్కడ నీకు పనిలో పెట్టగలడు. ఈ పాఠశాల ఆధునిక పద్ధతులలో ఒక ప్రయోగంగా నడపబడుతూ ఉంది. నువ్వు విజయనగరంలో ఉన్నట్టయితే, నువ్వు చెయ్యలేనిది

ఏమిటో నాకు తెలియదు. నీకు స్కూల్ ఇన్స్పెక్టర్ సాయపడగలడు. సిండికేట్ కార్యకర్తలు కూడా సాయపడగలరు. మనం కలిసే ముందుకు పోదాం.

ఉంటాను.

ప్రేమాభిమానాలతో...
జి.వి. అప్పారావు

☆ ☆ ☆

ఎక్కాహిల్ హౌస్,
ఉదక మండలం,
తేది: *21 మే, 1909.*

ప్రియమైన సుబ్రహ్మణ్యం పంతులు,

గౌరవనీయులైన మీ తండ్రిగారు, అమ్మగారు క్షేమంగా ఉన్నారని తెలిసింది. సంతోషం. మీ నాన్నగారికి నా ప్రణామాలు తెలియజేయి. నీ అభిప్రాయానికి నేను విలువనిస్తాను. నువ్వు పంపించిన ఫారాలు చూశాను. నాకు నచ్చింది. నేను సంతోషించాను. పుస్తకం చదవడం బాగా సాగుతుందని దీని అర్థం. గ్రంథ కర్తకు అబ్బురం కలిగించడం అవసరం. గ్రంథ కర్తకు ఆసక్తి కలిగించినట్లయితే, అది నిజంగా ఆసక్తిదాయకమైనదే. మీనాక్షి వచ్చే రంగాలు చాలా మనోరంజకంగా లేవన్నది నిజమే. ప్రతి ఒక్కదానికి దాఖలాలు చూపగలను. షేక్స్పియర్ రచనలలో డాల్ టియర్ షీట్, మైన్ హోస్టెస్ డేమ్ క్విక్లీ నాలుగు అయిదు హెన్రీ నాటకాలలోనిది. ఇవి అన్నీ సర్ జాన్ ఫాల్ స్టాఫ్ బృందంలో చాలా ఆసక్తికరమైనవి. వీళ్ళెవరూ మనోరంజకమైన వారు కారు. షేక్స్పియర్ హాస్యానికి ఫాల్ స్టాఫ్ పెద్ద తరగతి గుర్తువంటివాడు. మధుర వాణి హోస్టెస్ కన్నా డాల్ కన్నా చాలా చక్కని పాత్రలు. సరే, నాకు సరిగ్గా గుర్తుందో లేదో గాని, "కాపాడబడిన వెన్నిస్ నగరం" అన్న రచనలో చాలా జుగుప్స పుట్టించే రంగం వొకటుంది. ఒక పెద్ద ప్రభుత్వోద్యోగి రాజాస్థానం వేశ్య ఎదుట నీచంగా ప్రవర్తిస్తాడు.

కళాత్మకమైన ఆదర్శ రచన ఎలా వున్నప్పటికీ, వాస్తవికతతో వున్న రచన పాఠకుని నైతిక భావనకు చికాకు పుట్టించే అంశాలను తప్పక పుట్టిస్తాయి. కొంత వరకు నైతిక నిషేధం నైతిక దృష్టికి సంబంధించిన విషయం. వేలు విడిచిన మీ అన్నదమ్ముడు ఒంగోలు పట్టాభి రామయ్యగారి సాంగత్యంలో పెరిగి పెద్దవడం వల్ల నువ్వు అవినీతివి అసహ్యించుకుంటావు. వేశ్య నీకు గుండెల్లో గుబులు పుట్టిస్తుంది. చక్కని నైతిక దృష్టి వున్నందుకు నేను నిన్ను అభినందిస్తున్నాను. అందుచేత నేను నీతో సంపూర్ణంగా చర్చించబోవడం లేదు. వయసుకు మించిన తెలివి తేటలు నీకు అబ్బాయి, అనుకుంటున్నాను. ఇంకా నేను చెప్పేదేమిటంటే –

కవితా న్యాయం ఒకప్పుడున్నట్టుగా యిప్పుడు లేదు. నేను జీవితాన్ని చిత్రిస్తాను.

కళాత్మకంగా, ఆదర్శవంతంగానే అనుకో. కళ నాకు అధికారి అయినప్పటికీ, సమాజం పట్ల నాకు ఒక కర్తవ్యం ఉంది. అంచేత పాఠకుడు ఒక సంగతిని

అడగవచ్చును. నేను చెడును ఆదర్శణీయంగా చేశానా? లేదనుకుంటాను. మొదటి ముద్రణలో మధురవాణి అందచందాలు లేనిది. ఇప్పుడామెకు చిత్రణ పూర్తిగా జరిగింది. కాని, నేను ఒక సంగతి ఒప్పుకోవాలి. గ్రంధ రచన సాగుతున్న కొద్దీ ఈ పాత్రపట్ల నా దృక్పధం మారిపోయింది. అందువల్ల ఒడిదుడుకుల్ని సృష్టించిందేమో నాకు తెలియదు. ఒడిదుడుకులన్న విషయం ఎందుకు గణనలోనికి తీసుకోవాలి? మానవ స్వభావంలో ఉన్నదే ఇది. మధురవాణి విషయమై నాకు నేనే ముగ్దుణ్ణవుతున్నాను. అంచేత చివరి అంకంలో ఆమెను సంస్కరించాను. ఇప్పుడు నాతో తగదా పెట్టుకోవాలి.

గ్రంధరచన బాగా మెరుగయింది. నైతిక ప్రయోజనం దృఢపడింది. జీవితాన్ని అల్ప విషయంగా తీసుకోనని నీకు తెలుస్తుంది. దాన్ని నేను మనఃపూర్వకంగా భావిస్తాను. కష్టమైన విషయం ఏమిటంటే, హాస్యంతో పొంగిపొర్లే గ్రంథంలో ఇది చాల కష్టమైన పని. ఒక వేశ్యలో మానవత్వం ఉంటుందన్న సంగతి మర్చిపోవద్దు. ఆమె కష్ట సుఖాలు, నీ కష్టసుఖాలు, నా కష్టసుఖాలు వల్లనే తీవ్ర విషయాలు. ఈ విషయంలో ఆమె దగాకోరు కాదు. ఆమె పైన పడ్డ ముద్ర సరియైనది కాదా! వివాహ బంధాన్ని చెడగొట్టడం లేదు.

జపాన్‌లోని గైషాల గురించి ఏం చెబుతావు? పై అంతస్థుల పెద్ద మనుషుల వారినే వివాహం చేసుకుంటారు. గ్రీకు దేశపు అస్పేషియాల గురించి నీకు బాగా తెలుసు. చదువు... ఈ రెండు దేశాలు – విషయం ఏమిటంటే, మనుష్య విజ్ఞాన శాస్త్రాధ్యయనం కోసం సాంఘిక భావాలను మళ్ళీ అమరిక చేసుకోవలసిన అవసరం వచ్చింది. వాస్తవ విషయాల్ని గమనించకుండా ఉండడం వల్ల ఉపయోగం ఏమీలేదు. లైంగిక బంధం గురించి పెద్దగా రగడ చేస్తే ప్రయోజనం ఏమిటి? సాంఘిక పరిణామ చరిత్రలో వివాహం అనే కర్మకాండ ప్రాముఖ్యాన్ని తక్కువ చేస్తున్నానని అనుకోవద్దు.

గడచిన రెండు శతాబ్దాలలో మానవ జాతి జ్ఞానం చాలా వృద్ధి చెందింది. పాత భావాల్ని ఆదర్శాల్ని యోచనాపరులు పరిశీలించడం మొదలు పెట్టారు. వివాహ కర్మకాండ హెచ్చినట్లయితే వివాహబంధం విడరాదన్న భావన చెప్పరానంత విషాదాలకు దారి తీసింది.

ఈ కధ యింకా ముగియలేదు. ఇంగ్లీషు వాళ్ళతో పెళ్ళి పౌరుల ఒప్పందం అవలేదు. షెల్లీ, జార్జి యిలియటు దానిని కోరలేదు. ఆధునిక మహిళ మానవ చరిత్రను తిరగరాస్తుంది. ప్రేమకు సంబంధించిన కథా వస్తువు అదృశ్యమవుతుంది. లేదా ఉన్నతమైన కల్పనా సాహిత్యంలో చిన్న స్థానం ఉంది. లైంగిక ప్రేమ కథా వస్తువును అంతులేని మార్పులను అంతులేకుండా ఎందుకు చెబుతూ పోతూ వుంది. లైంగిక అన్న పదాన్ని గమనించు. శారీరక ప్రాతిపదిక అనవసరంగా వచ్చింది. దానికి, యువకుడొకడు అందచందాలు అంతరిస్తున్న ఏభై ఏళ్ళ ఆవిడ, ఆవిడ ప్రేమలో ఎందుకు పడతాడు? కుతకుతలాడే భోజన పదార్థాలను లేదా వికసిస్తున్న గులాబీ పువ్వు వలెనో యువతి శారీరక వాంఛలకు ప్రేరేపిస్తుంది. చల్లారిపోయిన భోజనానికి నువ్వు ఖాతరు చెయ్యవు. వాడిపోతున్న గులాబీని పట్టించుకోవు. అందచందాలు

తరుగుతున్న స్త్రీ విషయమూ అంతే. రొట్టె నిలువ చేస్తే చెడుతుంది. గులాబీ మట్టిపాలవుతుంది. అవి తాజాగా ఉన్నప్పుడు కలిగించే సంతోషాన్ని చెడగొట్టి ఆనందానికి భంగకాలు కావు. వేదాంతుల జీవితం క్షణభంగురమని లేదా అందచందాలు, జీవితమూ, సౌందర్యము అశాశ్వతమైనవని చెప్పే సిద్ధాంతాలు, యింద్రియ సుఖాలు పరిత్యజింప తగినవనే వాదానికి బలాన్నీయవు.

ఇందుకు భిన్నంగా ఆనందం పొందాలన్న గట్టి వాదాన్ని కల్పిస్తుంది. అమితంగా అదే పనిగా మితిమీరి చేస్తూ పోవడంలో దోషం ఉంది.

జీవితంలోను, సారస్వతంలోను లైంగి కానందం తన పరిమితుల్లో ఉండాలి. కాని ఇప్పుడు మరీ అమితంగా జరుగుతూ వుంది.

కేటో తన భార్యను వేరొకరికి అప్పగించాడు. అది ఎవరో నేను మర్చిపోయాను. చంద్రవంశపు రాజులు తమ రాణులను దుష్టులైన బ్రాహ్మణులకు తార్చినట్లు కనిపిస్తుంది. అయితే ఈ హాస్యపు చెడుగు సంగతేమిటి? మీ ప్రాచీన గ్రంథాలు, పురాణాలు చదువు. వాస్తవ విషయాలను, విస్మరించవద్దు. కత్తి తీసుకొని లోతుగా కోసి విశ్లేషణ చెయ్యి. ఆదర్శపూరితం చెయ్యడానికి అర్హత ఉన్న నిజమైన ప్రేమ మానవుల పట్ల ప్రేమ. ఏసుక్రీస్తు ఉపదేశించినదీ లేదా తన కాలపు పరిమితులలో ఉపదేశించినట్టుగా కానవచ్చినదీ, షెల్లీ కవితా విహారంగా ఉపదేశించినదీ, సజీవమైన విశ్వాసంగా బుద్ధుడు ఉపదేశించినదీ నిజమైన ప్రేమ, మానవుని పట్ల ప్రేమ బౌద్ధం అణగ దొక్కబడినప్పుడు, భారతదేశం మతపరంగా ఆత్మహత్య చేసుకొంది.

ప్రేమాభిమానాలతో...
జి.వి. అప్పారావు

☆ ☆ ☆

ఎక్కహిల్ హౌస్,
ఉదక మండలం,
*తేది: 24 మే, 1909.*

*ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం పంతులికి,*

నీ కార్డు అందింది, ధన్యవాదాలు. నువ్వు పంపిన పదాల పట్టిక అందుకున్నాను. వాటిలో కొన్ని నిఘంటువులలో దొరుకుతాయి. పుస్తకం చివరన చాలా పెద్ద పట్టికను ఇస్తాను. ఎనమండ్ర నారాయణమూర్తి గారు నా నాటకాన్ని ఆయన 'మంచి కళారచన'ని అన్నారు. పేజీ 120వ పుటలో ముఖ్యంగా ఆసక్తి పుట్టించే ఘట్టానికి ప్రారంభంలో మాత్రమే నీవు వుంటావు. తరువాత వున్న కథాక్రమం పుస్తకంలోని ఉత్తమోత్తమమైనవి. వెంకటరాయశాస్త్రిగారి 'ఉషా' నాటకం ప్రతిని ఒకటి వెంకటేశ్వరులు నాకు పంపారు. పాపం వెంకటరాయశాస్త్రి గారికి 'కళ' అంటే ఏమిటో తెలియదు గ్రీకు బృందగానాలలాగ, ఇంగ్లీషు తొలిపలుకుల్లాగా (Prologue) కథను నడిపించటానికి పూనుకుంటాడు. దేవతలందర్ని పిరికి పందల్ని చేశారు. బాణుని పాత్రను పొగరుబోతుగాను, అహంభావునిగా, అల్ప బుద్ధులుగాను

చిత్రించారు. 'ఉష' తండ్రి గురించి – తాను గర్వించ తగ్గట్టుగా ఏ మాత్రం లేదు. దిక్పాలకుర్ని 'ఒరే' అంటుంది.

ఇంకో నాటకానికి నేను పథకం వేస్తున్నాను. మూడోది ఇప్పటికే రాత ప్రతి దశకు వచ్చిందని నీకు తెలుసును. అయితే అచ్చు విషయం – అసలు చిక్కుల్లా అదే!

ఉంటాను.

ప్రేమాభిమానాలతో...
జి.వి. అప్పారావు

☆ ☆ ☆

ఎక్కుహిల్ హౌస్,
ఉదక మండలం,
తేది: 2 జూన్, 1909.

ప్రియమైన సుబ్రహ్మణ్యం,

నాకు నీ ఉత్తరం (అందింది) నచ్చింది. నేను అపార్థం చేసుకోలేదు. వేశ్య పాత్ర వచ్చిన రంగాలు గొప్ప నైతిక బోధలతో వ్యాఖ్యానంతో మొదలుపెట్టాను. నా సారస్వతాభిరుచి ఇటువంటిదా అని ఆశ్యర్యపడ్డాను. నైతిక దృష్టి పాఠకుని మనసుని బట్టి ఉంటుందని నేను ఎప్పుడూ అనలేదు. దానిలో కొంత భాగం తప్పకుండా అయినప్పటికీ నైతిక నిషేధం మనసుని బట్టి ఉంటుందని అన్నాను. సాహిత్య నిర్ణయాల్ని నేను ప్రస్తావించాను. యదార్థాన్ని నేను మనస్ఫూర్తిగా చెప్తున్నాను. సారస్వత చరిత్ర విమర్శ నేను చెప్పిన దానిని అంగీకరిస్తుందని మనఃపూర్వకంగా చెప్తున్నాను. ఆధ్యాత్మికమైన నైతిక విషయాల వద్దకు నీవు వెళ్ళినట్లయితే, ఏ వాదనలకు ముగింపు వుండదు. ఆ లైంగిక సంబంధాలు క్షుణ్ణంగా విశ్లేషించాలి. సాంప్రదాయకమైన దృష్టిని నిశితంగా పరీక్ష చేయాలి. వాటిని శారీరకంగాను, చారిత్రకంగాను తెలుసుకొని వాటిని విలువ కట్టాలి. జీవిత సత్యం పట్ల శ్రద్ధ తీసుకో. మనో దృష్టిలో సత్యాన్వేషణ చేయరాదు. స్త్రీకి పురుషాధిక్యత క్రింద ఎటువంటి కష్టాలున్నవో నేను ఊహించుకోగలను. నువ్వు కూడ ప్రయత్నించి చూడు. నీ చుట్టు ప్రక్కల నున్న వివాహితులను బాగా పరిశీలించి చూడు. పేద భర్తల గురించి కురూపులైన భర్తల గురించి, చెడ్డ భర్తల గురించి, బలహీనులైన భర్తల గురించి, భార్యలేమనుకుంటారో ఆలోచించటానికి ప్రయత్నించు. చెడ్డ భార్యలు, అందవికారులైన భార్యలు మాటేమిటని బహుశా నువ్వు అడగవచ్చు. కాని, వారు బానిసలు. వారు మన నుండి కోరేదానికంటే అధిక ప్రమాణాన్ని మనం ఆశిస్తాం. తేడా అంతా ఇదే పరిశుద్ధంగా లేని పురుషులందర్ని ఎక్కువగా అసహ్యహించుకుంటావని అనుకుంటాను. అటువంటప్పుడు నీకు మిగిలే స్నేహితులెంత మంది? స్త్రీ పురుషునికి ఇవ్వగలిగిన దానికంటే ఎక్కువగా పురుషుడు ఆశిస్తాడు. తాను కోరుకున్న దానికంటే ఎక్కువగా ఆశించడం వల్ల స్త్రీకి సుఖం ఉండదు. పురుషుడు కోరుకున్నదాని కంటే అతన్ని స్త్రీ ఎక్కువగా ఆరాధించకపోతే, పురుషునికి సుఖం కలగదు. అసూయ అంటే ఏమిటి? ఒక భర్త అందంగా

లేదు. ఒక స్త్రీ వ్యక్తిగా తనిని మెచ్చుకోదు. అందమైన ఒకర్తెను ఎవ్వరినో తాను మెచ్చుకోకుండా ఉండలేదు.

ఎటువంటి అసాధ్యమైన పరిస్థితి. ఒక భర్త దద్దమ్మ, కాని, భార్య అతని తెలివి తేటల్ని మెచ్చుకోవాలి. ఇలాగే చెప్పుకుపోవచ్చు. నువ్వు గైషాల గురించి నిస్సందేహంగా తప్పక చదివే వుంటావు. జపాన్‌లో లైంగిక రీతి కట్టుదిట్టంగా ఉండదు. ఇంకో పక్క అక్కడి జాతీయ జీవితం, సిరి సంపదలు అధికంగా ఉంటాయి కూడా. ఆశ్చర్యపడవలసిన సంగతి ఏమిటంటే, అక్కడ ఉన్నతమైన రాజకీయ ఆదర్శాలు ఉంటున్నాయి. ఇష్టా అయిష్టాల మాటకేమి? లైంగిక విషయ సమస్యల్ని ఈ విధంగా చూస్తాను. సమాజం విధించిన నియమాలున్నాయి. వాటిని గౌరవించడం మన విధి. లైంగిక సంబంధాలను క్రమబద్ధం చేసే నియమం ఒకటుంది. దాన్ని పాటించకపోవడం నేరం. సాంఘిక నియమం తప్పుగా ఉన్నదని నువ్వు అనుకున్నప్పుడు తప్ప దాన్ని నువ్వు సంస్కరించాలని (బహిరంగంగానే) తప్ప నువ్వు ఈ నియమాన్ని పాటించినట్టయితే, దాని మంచి చెడ్డలను పరిశీలించడం వీలుకాదు. దాన్ని సంస్కరించడం కూడా వీలుకాదు. పరిశుద్ధతను నేను మెచ్చుకుంటాను. సరిగ్గా దాని స్వభావం ఏమిటి? దాని పుట్టు పూర్వోత్తరాలేమిటి? ఆ పరిశుద్ధత వుండేది ఎక్కడ? లైంగిక సంబంధాలు సాధించగలిగినవి కావు. ఇక లోటు పాట్లు ఎన్నో? ఈ సత్యాన్ని మనకి మనం తెల్సుకునే సమయం ఆసన్నమయింది. నీతిపరులు కాని వివాహితులైన స్త్రీ పురుషులందు వేశ్యల వలనే సమానంగా అసహ్యించుకునే వాళ్ళు. నువ్వు ఆలోచించి వారి మంచి చెడ్డల గురించి ఆలోచించటానికి ప్రయత్నించవద్దు. నీవు తెలివిగా అన్వేషిస్తే తేడాలు తెలుసుకోగలుగుతావు. వేశ్య తన వృత్తిని అనుసరిస్తూ వుంటుంది. తప్పదు. ఇది ఒప్పుకోక తప్పదని నేను అనుకుంటున్నాను.

నేను ఇంకో సంగతి తెలియ చేస్తాను. ఎందువల్లనంటే నా రాబోయే నాటకంలో ఈ సమస్య ప్రస్తావింపబడుతుంది. అవును 'కామ్టే' అను పాజిటవిస్టు తత్వవేత్త మానవతను ఒక మతంగా విపులీకరించారు. సరిగ్గా ఆయన చేసినట్టుగా నేను పరిగణించటం లేదు. విశ్వాసాలు ఆచరణాత్మకంగా ఉండవు. ఆనందింపచేస్తుంది. ప్రేమను కలిగిస్తుంది.... స్వర్గలోకాన్ని భూలోకాన్ని ఆధునిక యూరోపియన్ తత్వజ్ఞానం విపరీతమైన స్వార్థాన్ని, కొంత మానవతను ఒక వింత కలిగేటట్టుగా కలగాబులగం చేస్తుంది. జయించేది ఏది? బహుశా స్వార్థం.

ఇక ఉషా పరిణయం గురించి ఇటీవలె చదివాను. నా వ్యాఖ్యలు ఆ పుస్తకం వెనకాతలే రాసాను. దాన్ని నారాయణమూర్తిగారికి ఎరువిచ్చాను. అది పూర్తిగా పనికిరాని పుస్తకం. వెంకటరాయశాస్త్రిగారు చక్కని ఊహా చాతుర్యం లేనివారని నేను ఎన్నడూ అనుకోలేదు. ఒక అంకంలో విరహం ఇంకోదానిలో ప్రద్యుమ్నుని విరహం. రచన జుగుప్సాకరం. సాంప్రదాయక పద్ధతి. తామర తూండ్లు, చంద్రకిరణాలు ఇక లేనివి ఏమిటి? నటన లేదు. పాత్రపోషణ లేదు. బాణుని మేనల్లుడు ఉషాదాదికి మధ్య ప్రేమ ముందు పూర్తిగా జుగుప్సాకరం. వేదంవారు విదూషకత్వాన్ని అపహాస్యం అనుకుంటున్నారు.

కన్యాశుల్కం చివరి రంగాలు అచ్చవుతున్నాయి. నీకు పుస్తకం త్వరగానే అందుతుంది. ఎనమండ్ర నారాయణమూర్తి గారు నా పుస్తకాన్ని గొప్ప కళాఖండమన్నారు. 'పెద్ద' పుస్తక విక్రేతలు ప్రతులు త్వరగా అమ్ముడు పోతున్నాయని జోస్యం చెబుతున్నారు. నా పీఠికను మెచ్చుకుంటూ ఏట్సు గారు రాసారు. మనం మెప్పుకోలుతోనే బ్రతుకుతున్నాం.

నేను (ఉదక మండలం) ఇక్కడకు వచ్చీరాగానే చాల నీరసపడిపోయాను. ఇప్పుడు నా ఆరోగ్యం మెరుగయిందని చెప్పడానికి సంతోషిస్తున్నాను.

నీ తప్పొప్పుల పట్టికలో కొంత భాగం పుస్తకం చివర అచ్చువేస్తాను. మీ నాన్నగారికి నా ప్రణామాలు. నెల్లూరు ఎప్పుడు తిరిగి వెళతావు. మెయిలు ఎన్ని గంటలకు నెల్లూరు చేరుతుంది. అంటే మద్రాసు నుంచి.

ప్రేమానురాగాలతో...
జి.వి. అప్పారావు

☆ ☆ ☆

థాకర్సు గార్డెన్సు,
రాయపేట,
మదరాసు,
తేది: 24 జూన్, 1909.

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యాం,

నిన్నటి పోస్టుద్వారా కన్యాశుల్కం ప్రతివొకటి నీకు పంపించాను. దయచేసి సమీక్ష వ్రాయి. నీలగిరి పాటల ప్రతి ఒకటి నీ దగ్గర ఉందనుకుంటాను. ఉన్నట్టయితే, నా నాటకంతో పాటు దానినీ సమీక్షించు.

"ఈ మనిషి వాడుక భాషలో వ్రాశాడెందుకంటే, గ్రాంధిక భాషలో తిన్నగా వ్రాయలేడు. ద్రాక్షపళ్లు పులుపు" అని గ్రాంధిక వాదులు అనకుండా నీ సమీక్ష నాకు పంపించు. స్త్రీల పత్రికలో (బహూశా రఘుపతి వెంకటరత్నం గారిది) ప్రచురింపచేస్తాను. తూర్పుతీర మార్గంలో ఎంత దారుణం జరిగింది. మీ జిల్లా అన్నిటికంటే నష్టపోయిందనుకుంటాను. మూడు రైలు పెట్టెలలో ఉన్నది ముప్పై మందేనా? వృద్ధుడు రంగయ్య చెట్టిగారు వెళ్ళిపోయారు. తన తీరులో ఆయన ఒక ఉత్తముడనుకుంటాను. నా పీఠికలో ఆయన్ని నిందించాను. "బోర్డాఫ్ స్టడీస్"లో ఆయన మరణం వల్ల ఒక ఖాళీ ఏర్పడింది. ఆయన స్థానంలో ఒక పిచ్చివాడ్ని వెయ్యవద్దని కృష్ణస్వామి అయ్యర్‌తో చెప్పాను. రామానుజాచారి గురించి నా సూచన అదే. కృష్ణస్వామి అయ్యర్ గారు మీ రెండుకు కాకూడదు అన్నారు. చీటికి మాటికీ మద్రాసు ప్రయాణాలు తప్పితే నాకు అభ్యంతరం లేదు.

ప్రేమాభిమానాలతో,
జి.వి. అప్పారావు

కొందరు దొంగల సంస్థ జనరంజకమైన ప్రచురణలు చేస్తున్నారని నాకు తెలిసింది. క్యూరేటర్ నమోదు చేసిన పుస్తకాలలో ఇటీవల నాపేరు పడిందని ఎవరో చెప్పారు. కాని, నేను ఏ పుస్తకం నమోదు చేయలేదు.

☆ ☆ ☆

థాకర్సు గార్డెన్సు,
రాయపేట,
*తేది: 7 జూలై, 1909*

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం,

నీ మూడో తేది ఉత్తరం అందింది. విజయనగరంలో నీకు స్థానం సంపాదించలేక పోయినందుకు విచారిస్తున్నాను. రిప్పన్ హైస్కూల్ పథకం విఫలమయింది. నువ్వు విజయనగరంలో స్థిరపడాలని నా గట్టి కోరిక. అవకాశాలు కలగగలవని ఆశిద్దాం. కాకినాడలో ట్యూటరు ఉద్యోగం చెడ్డదేమి కాదు. కాని, రెండేళ్ళు ఉంటానన్నది రాత పూర్వకంగా ఇవ్వటం సదుపాయం కాదు. దీన్ని స్వీకరించడం మంచిదేననుకుంటాను. ఇంతకంటే మంచి స్థానం దొరికినట్లయితే, రాసిచ్చిన హామినుండి నిన్ను విడుదల చేయవలసిందిగా కాలేజి కమిటీని మనం సులభంగా ఒప్పించగలం. ఇక సమీక్ష విషయం వెంకన్నగారు 'హిందూ'లో వ్రాసిన సమీక్ష ఊకదంపుడు నువ్వు చూసే వుంటావు. 'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రిక నుండి మొదటి కాపీని ఆయన కాపీ చేశాడు. కనీసం 15వ తేదీ వరకు నేను ఇక్కడే వుంటాను.

ప్రేమాభిమానాలతో,
జి.వి. అప్పారావు.

☆ ☆ ☆

విజయనగరం, కోట,
*తేది: 4 డిసెంబరు, 1910.*

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యంకు,

చాలకాలంబట్టి నీ వర్తమానం అందటం లేదు. ఏమిటి సంగతి? 'ఆంధ్రభారతి'లో ఇటీవలపడిన కవితలు చదివావా! 'డామన్, పితియన్' పాతరకపు పత్రికల వాళ్ళు సహితం వెంటనే పొగిడారు. కాకినాడలో బ్రహ్మయ్య శాస్త్రిగారి విమర్శనను మెచ్చుకుంటారని గత సంవత్సరం ఎప్పుడో నువ్వు అన్నమాట జ్ఞాపకం తెచ్చుకో. 'శశిలేఖ' పత్రిక ఇటీవల సంచికలో నా మొదటి దెబ్బకొట్టాను. 'ఆంధ్రకేసరి'లో కూడా నీకు కన్పిస్తుంది. దయచేసి వాటి గురించి నీ అభిప్రాయం వ్రాయి. ఇంకొన్ని రచనలు రాబోతున్నాయి. పిల్లలమఱ్ఱి పినవీరన 'శకుంతలా పరిణయం' సంపాదించి ఒక ప్రతి నాకు పంపించు. 'కవిస్తుతి' 'కుకవినింద' కూడ చూడు. నువ్వు

మద్రాసు వెళ్ళినపుడు .జి. రామనాధసెట్టి గారు దగ్గరకు వెళ్ళి పని తొందరగా కానివ్వండని ఒత్తిడి చెయ్యి. అచ్చు పని చాలా ఆలస్యంగా జరుగుతోంది. నా మేనల్లుడు నరసింహాన్ని శ్రమపడి పని చెయ్యమని చెప్పాను. అతని గురించి ఏమీ తెలియడం లేదు. తెలుగు వ్యాకరణం వ్రాయడం మొదలు పెట్టాను. నెల్లూరు వాడుక భాష వ్యాకరణం కావాలి. ప్రధానంగా 'వెర్బల్ ఆఫ్ సబ్ స్టైన్‌సియెటివ్ అండ్ ఇన్‌ఫ్లెక్షన్స్' గురించి కొద్దిగా రాసి పంపగలవా? తిక్కన సోమయాజి గురించి మహాభారతంలోని వ్యాకరణ విరుద్ధాల గురించి ఉన్న 'అముద్రిత గ్రంధ చింతామణి' సంచికలు దయచేసి నాకు పంపించు.

భవదీయుడు,
జి.వి. .అప్పారావు.

షరా. కీర్తిశేషుడు పూండ్ల రామకృష్ణయ్యగారు నాకు స్నేహితులు. తిక్కన వారసులు గురించి, కొత్తూర ఊరు గ్రామం గురించి ఆయన రాశారు. తరువాతి ఉత్తరంలో విపులంగా వ్రాస్తాను.

☆ ☆ ☆

కోట, విజయనగరం,
*తేది: 2 ఆగస్టు, 1911.*

ప్రియమైనముని సుబ్రహ్మణ్యం,

నేను వెంకటాచల పంతులుగారికి ఉత్తరం వ్రాశాను. మా అమ్మగారికి, నా మేనల్లుడు వెంకటేశ్వర్లుకు సుస్తీ చేయడంవల్ల, కొత్త పద్ధతి కార్యనిర్వాహణ ఒత్తిడి వల్ల వెంటనే జవాబు వ్రాయలేక పోయాను. ఈ ఏడాది నీవు డబ్బు చిక్కులో వున్నందుకు చింతిస్తున్నాను. న్యాయవాదిగా నువ్వు రాణించగలవని, త్వరలోనే నీ డబ్బు చిక్కులు తీరగలవని ఆశిస్తున్నాను. నీ మీద నువ్వే ఆధారపడగలిగినట్లయితే, నువ్వు తప్పక జయించి తీరుతావు. తెలివితేటలు, కష్టపడి పని చేయడం ఈ గుణాలు నీకు ఎక్కువగా ఉన్నాయి.

'లవణరాజు కల' నా పూర్వపు రచనల కంటే ఎక్కువ రాగయుక్తంగా ఉందనుకోను. కొత్త శైలికి పాఠకులు అలవాటు పడతారు. సారస్వతాభిరుచి ఉన్నవారు గణనలోకి తీసుకోవలసిన వారు కొద్దిమందే ఉన్నారు. నీ వంటి సంస్కారుల అభిప్రాయాలకు విలువనిస్తాను. మీ నాన్నగారికి నా నమస్సులు.

ప్రేమాభిమానాలతో,
జి.వి. అప్పారావు.

☆ ☆ ☆

# గురజాడ జాబుల చిత్తుప్రతులు

*గౌరవనీయులైన జి.స్టోక్స్, బి.ఏ., (ఐ.సి.ఎస్.),*
*మద్రాసు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి,*

పత్రికల జాబితాలు చూడటానికి నన్ను అనుమతించినందుకు, ఉత్తర సర్కార్లు ఫ్రెంచి వారు చరిత్ర ఉన్న రికార్డులు చూసేందుకు అనుమతించినందుకు నా ధన్యవాదాలు. ఉత్తర సర్కార్లులోని ఫ్రెంచి వారి చరిత్ర గురించి ఒక జాబితాను ఈ లేఖతో పంపుతున్నాను. వెంట వెంటనే చూసుకునేందుకు, నీలపు పెన్సిల్‌తో ఈ రికార్డు సంఖ్యకు గుర్తు పెట్టాను. నా నాలుగు పుస్తకాలను దీనితో మీకు నివేదిస్తున్నాను. చరిత్ర కోసం ఈ రికార్డు కావల్సినందువలన, చాల పెద్ద పట్టికను నేను తయారు చేయవలసి వచ్చింది. నా నిజాయితీని మద్రాసు లార్డ్ బిషప్ నుండి ఒక ఉత్తరం జతచేస్తున్నాను. 1899 నవంబరు 16వ తేదిని హెచ్.ఎన్. గిల్మన్, నేను వ్రాసిన ఉత్తరాన్ని కూడ జతపరుస్తున్నాను.... కనీసపు మార్కుల కంటే ఒక మార్కు తక్కువ అయి వుంటుంది. వాటిని మీరు తీయవచ్చును. ఒక మార్కు యివ్వడం మీకు సాధ్యం కాకపోతే 181 నెంబరు, రెండోది ఉత్తమమైనదిగా భావించినది. వ్యాఖ్యానం 181 కి చేసినది అద్భుతంగా ఉంది. 176 కు చేసిన వ్యాఖ్యానం నేను చూడ లేదు. అంచేత మా అభిప్రాయం ఏమిటో చెప్పలేను.

వెంకట్రాయ శాస్త్రిగారు, మీరు నాతో ఏకీభవించినట్లయితే, ఇంకా ఇద్దరు అభ్యర్థులు ఉత్తీర్ణులవుతారు. ఇది మొత్తం సంఖ్యను 6 సంఖ్యను పెంచుతుంది. ఫెయిల్ అయిన వారు ముగ్గురవుతారు.

ఒకళ్ళు మాత్రమే ఉత్తీర్ణుడు కానట్టు నా అభిప్రాయం మీకు చెప్పాను. ఆ సంఖ్య 182 అతనికి 394 మాత్రమే వచ్చాయి. మిగతా వాళ్ళందరికి 500 ల మార్కులు వచ్చాయి. కానీ, కనీస సంఖ్య నుండి 50 కి పైగా తక్కువగా మార్కులున్న వాటిని నేను వదలి పెడుతున్నాను. ఈ అభ్యర్థుల్లో ఒక్కరు కూడ ప్రవీణుడు కాడని మీరన్నారు. కానీ, సగటు సంఖ్య నాకు నచ్చింది.

భాష గురించి, సారస్వతం గురించి పుస్తకాలేవి లేవని మీరు ఒప్పుకోవాలి. ఉపాధ్యాయులు కూడ లేరని మీరు ఒప్పుకోవాలి. సారస్వత సేవకుడు రాబోయే సంవత్సరాలలో తప్పక తటస్థిస్తాడు. వారు పడిన శ్రమకు వారిని ప్రోత్సహించాలి. తెలుగులో ఎమ్.ఎ. పట్టం పుచ్చుకున్నవారు మీకు కొన్నేళ్ళ వరకు దొరకరు.

174 వ సంఖ్య పరీక్ష పేపరుకు ఇంగ్లీషు జవాబు వ్రాయడం జరిగింది. దాన్నించి మార్కులేవీ తగ్గించలేదు. పదిశాతం ఇప్పుడు తగ్గిస్తున్నాను. అతనికి సంస్కృతం వచ్చును. చాల ప్రవీణుడు.

☆ ☆ ☆

*విజయరామ గజపతికి జాబు,*

వాస్తవ జీవితంలో భాష్యం చెప్పినపుడు వ్యాకరణ బద్ధమైన తెలుగు అవాస్తవం

అనిపిస్తుంది. గ్రంథకర్తలు ఎందువలనో కాని తమ నాటక ఇతివృత్తాలను తప్పనిసరిగా పాత ప్రపంచపు కల్పనా గాథలపైన రాస్తారు. వర్తమాన కాలం ఎన్నో విధాలైన గాథలతో నిండి ఉన్నప్పుడు, ఇలా ఎందుకు చేస్తారో మరి? అందుచేత నేను వాడుకలోని తెలుగు భాషలో వ్రాసాను. జరగని ఇతి వృత్తం దీనికి కల్పించాను. న్యాయస్థానంలో జరిగిన లేఖాచిత్రాలపై ఆధారపడినట్లుగా చేశాను (?) ఈ పుస్తకం నేను ఊహించనంతగా జయప్రదం అయింది. దీనితో నా లక్ష్యం నెరవేరింది.

నేను పండితుడ్ని అయినందుచేత కవి నయ్యాననుకోకూడదు. ఏ ఒక్కరైనా పాండిత్యం సంపాదించడానికి ఆశించవచ్చును. ప్రకృతి మాత్రమే కవిని చేయగలదు. తెలుగు భాషా ప్రపంచంలో ప్రతి పండితుడు కవి అని అనుకోవడం జరుగుతూంది.

గమనిక: కన్యాశుల్కం కోర్టులో న్యాయాధికారి ఇంగ్లీషువాడు. అతగానిచేత మామూలు తెలుగు మాటాడించడం బాగాలేదు. Note 'తెల్లకుక్కలు, నల్లకుక్కలు' మధురవాణి మాటల్లో – సం.

☆ ☆ ☆

ఉన్నత పాఠశాలల పండితులు ప్రపంచాన్ని తమ అలంకారాలతో, తమ రచనల్ని లోకంలో నింపివేస్తారు. వారికి ఉన్న పలుకుబడి వల్ల వారి పుస్తకాలను విద్యార్థుల నెత్తిని రుద్దడం జరుగుతుంది. చెప్పుకోదగ్గ విమర్శ అంటూలేదు. చెప్పుకోదగ్గ పాఠకలోకమూలేదు. వారి జాడల్లో అడుగుపెట్టడం నాకిష్టం లేదు. సమర్థులైన రచయితలు, సమర్థులైన కవులు నన్ను అనుసరించాలని మాత్రమే నేను ఆశించాను. ప్రతిభావంతులైన రచయితలు నేటి జీవితాన్ని ఇతి వృత్తంగా తీసుకొని వచన నాటకాలు రాయాలని నా కోరిక. కాని, వ్యావహారిక తెలుగులో తప్పక రాయాలి. వచన నాటకం నటించడం కష్టం. తక్కువ రకం సారస్వతం, తక్కువ రకం నటన నుండి సంగీతం, ఛందస్సు దృష్టిని మళ్ళిస్తాయి. సంగీత నాటకాలు బోలెడన్ని ఉన్నాయి. శ్రోతల అజ్ఞానం ప్రధానంగా ఇందుకు కారణం. నాటక వేదిక వచ్చే సంగీతం విని ప్రేక్షకులు తృప్తి పడతారు. పాడుగా ఉంటే సంగీతం భరించరానిది. మన నటులలో పాడే ప్రజ్ఞ అరుదు. అంతేగాక ఓపికగా శిక్షణ యిచ్చినట్టయితే ఓ మాదిరిగా నటించగలడు. గత శతాబ్దం 70వ పడి, 80వ పడిలో విజయనగరంలో చురుకైన వ్యాపారులు బాంక్‌లు మొదలుపెట్టారు. బాంక్ వ్యాపారం చేయడానికి శిక్షణ అక్కర లేదని వాళ్ళనుకున్నారు. ప్రతి ఒక బాంక్ దివాళపడింది. ఇది మంచి గుణపాఠం. భారతదేశపు నటుల గురించి దురదృష్టవశాత్తు దగాకోరుతనం ఫలితాలు ఇంత స్పష్టంగా చెప్పవు (?) ఔత్సాహిక నటునికి ఎక్కువ సమయం ఉండదు. వచన నాటకంలో వృత్తినటుడు తన పాత్రను క్షుణ్ణంగా తెలుసుకోవడానికి తీరుబడిలేదు. ఆ పాత్రను క్షుణ్ణంగా అభ్యసించే విషయం రెండింటిలోను లేదు. ఇది నా అనుభవం. జగన్నాథ విలాసిని నాటక సమాజం పేరు ప్రఖ్యాతులున్న నాటక సమాజం. మీరు దాని పోషకులు. ఉన్నతాదర్శాలు కలవారు. ఈ ఉత్తరంలో చాల ఎక్కువగా వ్రాసాననుకుంటున్నాను. క్షమించండి. ఈ విషయం గురించి నాకున్న ఉత్సాహం వల్ల దీర్ఘంగా రాసాను. జగన్నాథ విలాసిని నాటక సమాజ

ప్రదర్శన చూడగలనని ఆశిస్తున్నాను. 1906 వేసవిలో ఉదక మండలంలో నేను ఇంకో నాటకం రాసాను. దాని రాత ప్రతి దురదృష్టవశాత్తు కనిపించడం లేదు.

(పై ఉత్తరం ఆనందగజపతికి దత్తత తమ్ముడైన విజయరామ గజపతికి రాసినది. విషయం కన్యాశుల్క నాటక ప్రదర్శన గురించి అన్నది స్పష్టమే. ఇప్పుడు బజారుగా మారిపోయిన డాబా తోట అన్నచోట జగన్నాథ విలాసినీ నాటక సమాజం వుండేది – సంపాదకుడు.)

☆ ☆ ☆

*బుర్రా శేషగిరిరావు గారికి,*

రామానుజాచారి గారికి రాసిన ఉత్తరంలో నా కార్యకలాపాల గురించి మీకు చెప్పవలసినదంతా చెప్పాను. నా ఆరోగ్యం ఏమంత బాగా లేదు. అది ఎప్పుడూ బాగుండడం లేదు. ఆ పత్రిక గురించి నేను మీతో ఏకీభవిస్తున్నాను. హడావిడిగా నున్న పద్యాల పుస్తకం అది. పత్రికల గురించి ఎన్. సుబ్బారావుగారి ఆలోచన ప్రకారం ఉంది. సంఘాల పునః నిర్మాణము గురించి బుర్రా చేస్తున్నది సరియైన పని. ప్రారంభంలోనే అచ్చుల గురించి, అర్ధాచ్చుల గురించి మీరు దారిలో ఉన్నారు. ఆచరణలోని తేడా గురించి మనపైన కొందరు గట్టిగా దాడిచేస్తున్నారు. స్థానిక కైఫీయతులు, లిఖిత పత్రాలు, ప్రభాకర శాస్త్రి, వెంకటసుబ్బయ్య ఇంకే రచయిత అయినా, ఉపయోగిస్తాడు. అర్ధాచ్చును ఉపయోగిస్తే చాలును. మొత్తం పుస్తకంలో ఎక్కడో ఒక చోట బడి కుర్రవాడును రాయడం ఎలాగా? మీ తరహా ఒక చివరను, ప్రభాకరశాస్త్రి, వీరేశలింగం, నేను? మధ్యలోను? సరే బాగుంది. మీకు నచ్చినట్లుగా చేయండి. నాకు కోపం వచ్చిందనుకుంటున్నారు. నాకు ఎందుకు కోపం రావాలి. తీవ్రమైన బాగా సబబైన దారినుండి నీ ఆశయాన్ని రక్షించుకోకపోతే, నేను సబబుగానే ఆందోళన పడతాను. నా ఆలోచనను ముందుంచాలనే దర్పం అని మీరు అనుకోవచ్చును. ఆధునిక తెలుగు భాష గురించి అనేక సార్లు నా దృక్పథాలు మార్చుకున్నానని దేవుడు ఎరుగును. పదాల విభజన గురించి మీ వాదనలు నాకు నచ్చలేదు. ఎదేశీయుల కోసం రాసేటప్పుడు ఇది సబబే. పిల్లల విషయం అంతర్భాగాల కన్నా తేలికైన రాతలు వారు తరచూ వింటున్నప్పటికీ, పెద్దవారికోసం వచన రచనలు రాసేటప్పుడు అలా చేయడానికి మీకు హక్కు లేదు. వాడుక వచనంలో సంధిని సాధ్యమైనంత చేరువగా మీరు రాయాలి. ప్రాకృతంలో పోలిక నాకు నవ్వు తెప్పిస్తుంది. అది ఎంతవరకు సబబో నాకు తెలియడం లేదు. కనీసం నాలుగు తరాల వారు ఈ అచ్చునే రాసారు. అచ్చుకు చేరువుగా శబ్దం ఉన్నప్పుడు సయితం పండితుల దృష్టికి ఈ శబ్దాలను తీసుకురావడం ఎలాగా? మీ చిత్తం వచ్చినట్లు చేయండి.

బుర్రా శేషగిరిరావు గురించి బహు వచనంతో మొదలై ఉత్తరంలోపల ఏకవచనంలో వుంది. ఆయన గురజాడ శిష్యుడు. కరటక శాస్త్రి వేషం వేశాడు. గిడుగు సీతాపతి వెంకటేశం వేషం వేశారు. (బహుశ పద్దెనిమిది – సంపాదకుడు).

☆ ☆ ☆

దీ హైలాండ్స్,
(ఉదక మండలం)

వేదం వెంకటరాయ శాస్త్రి గారికి,
ప్రియమైన మిత్రమా,

మీ 16 వ తేదీ ఉత్తరం అందింది. చాల ధన్యవాదాలు. 21 వ తేది సమావేశం మీ నెల్లూరు మకాంకు అడ్డంకి అవుతున్నందుకు విచారిస్తున్నాను. ఈ సమావేశానికి నేను రాలేనందుకు మీరు నన్ను క్షమిస్తారనుకుంటాను. నీలగిరులకు వచ్చాక గడిచిన కొద్ది రోజుల్లో నాకు వాతావరణం అలవాటవుతుంది. కొద్ది రోజులు మద్రాసులో ఉన్నట్లయితే నీలగిరులలో పక్షం రోజులున్నందు వల్ల కలిగిన లాభం తుడుచు పెట్టుకుపోతుంది. నేను సమావేశానికి హాజరైనా ఒక అర్హతగల విషయానికి సహాయపడటానికి మాత్రమే. దీనిని మీ చేతులో ఉంచడానికి నాకు పూర్తిగా సమ్మతమే. మలయాళం ఎమ్.ఏ. క్లాసులో రెండో తరగతిలో ఏడుగురు అభ్యర్థులు పాసయ్యారని తెలుసుకున్నాను. బహుశా పరీక్ష తప్పినవారు చాల తక్కువ మందో లేక ఒక్కరూ తప్పలేదో ఎమ్.ఏ. పరీక్షకు బహుశా చివరి సంవత్సరం కాబట్టి, మనకు తోచినట్టుగా పరీక్షాధికారులకు తోచివుండవచ్చు.

ఫలితాలు పొందడమని అని నేను అన్నప్పుడు, వాస్తవంగా ఫలితాలు పొందడం అని నేను అనడం లేదు. ఫలితాలను తెలుపడానికి సూచనలు కోసం అని నా ఉద్దేశం మాత్రమే. మీరు, రామయ్య గారు తరువాత (జయంతి) నేను వేసిన ఏదో ఒక విషయంలో నేను చేసిన మార్పులు మార్చాలని అనుకుంటే, అలాగే జరపండి. నేను సమావేశానికి హాజరుకాకపోవడం వల్ల ఉత్తర ప్రత్యుత్తరాల వల్లనే ఇది జరగగలదు. సూచనలు చేయడం ద్వారానే చేయడానికి నాకు అవకాశం కలిగించాలని నా కోరిక. ఎమ్.ఏ., విద్యార్థులకు బాగా వ్యాకరణ పరిజ్ఞానం అవసరం అనడానికి ఏమీ సందేహం లేదు. భాషను చదవడం వల్ల కాక, వ్యాకరణ సూత్రాల్ని బట్టీపట్టడం వల్ల వ్యాకరణాన్ని చదవడం జరుగుతుందని మర్చిపోకూడదు. బాలల తరగతిపైని వ్యాకరణ విరుద్ధమైన వచనం నేర్చుకునే విద్యార్థుల నుండి వ్యాకరణ పరిజ్ఞానం మనమెలా ఆశించగలం? ఈ దోషం నిజానికి గ్రంథకర్తది. వీరిని దురదృష్టవశాత్తు పరీక్షకులు శిక్షించలేరు. విశ్వవిద్యాలయ పరీక్షల కొరకు ప్రత్యేకంగా ఇంటర్మీడియట్ తరగతి నాన్ డిటెయిల్డ్ అధ్యయనానికి, పాండిత్యంతో కూడిన వచనం నిర్ణయించడం అవసరమని నాకనిపిస్తుంది. మీ వచన రచన ఒకదానిని, ప్రత్యేకంగా ఇంటర్మీడియట్ విద్యార్థుల నాన్ డిటెయిల్డ్ అధ్యయనం కొరకు నిర్ణయించాలని నాకుంది. దురదృష్టవశాత్తు మీ వచన రచనలు దేనిని నాతో తీసుకురాలేదు. బోర్డ్ ఆఫ్ స్టడీస్ సమావేశం సాధారణంగా సెలవుల మధ్యకాలంలో పాఠ్యగ్రంథాల నిర్ణయానికి జరుగుతుంది. రామకృష్ణ పిళ్ళైగారు 20వ తేదీన జరగాలని కోరారు. నేను వాయిదా వెయ్యమని కోరాను. బహుశా ఆయన వాయిదా వేస్తారు. అలా జరిగినట్టయితే మీ వచన గ్రంథాలను పంపమని నా ప్రార్థన. సంధి నియమాన్ని కోరే ఉత్తమ ప్రతినిధిగా మీ వచన గ్రంథాల నన్నింటిని

నేను ఆమోదిస్తాను. మేము ఎంపిక చేసే వాటిలో ఎటువంటి దోషం లేదని హామీని కోరుతుంది. అవసరమైన తొలగింపులు చేయగలమనుకుంటాను. దశకుమార చరిత్ర ఇంటర్‌మీడియట్ విద్యార్థులకు ఉత్తమంగా సరిపోతుంది. రామకృష్ణ పిళ్లైగారి నుండి వర్తమానం తెలిసాక ఈ విషయం గురించి మీకు వ్రాస్తాను. చెడ్డ తెలుగు, అంతకంటే అధమమైన సంస్కృతం కలగలుపు చేసినంత కాలం, ఇక మీదట మనం సిఫారసు చేయకూడదనుకుంటాను. ఇంటర్‌మీడియట్ తరగతికి, బి.ఏ. తరగతికి ఈ రెండు నాటకాలు పెట్టాలని సిఫారసు చేస్తాను.

భవదీయుడు
జి.వి. అప్పారావు

షరా: పైది వ్రాసిన తరువాత (జయంతి) రామయ్యగారి నుండి మార్కుల పుస్తకం వచ్చింది. సంతోషం. ఆయనకి నా ధన్యవాదాలు. మార్కులు బట్టి చూస్తే నలుగురు పాసయ్యారు. వీరందరూ మూడో తరగతిలో పాసయ్యారు. ఇంకా ఎక్కువ మందిని ఉత్తీర్ణులుగా చేయాలని నేననుకుంటున్నాను. సహాయం కావాలనుకున్నప్పుడు ఉన్నత ప్రమాణం పెట్టుకోవడం మంచిపనే. కాని, అధ్యయన క్రమం సరిగా ఉన్నప్పుడు నిర్ణయించిన పుస్తకాలు మంచివైనపుడు అది సరైనదే. కాలేజీ ప్రొఫెసర్లు....? మీరు కాక ఎవరినైన ఇంకొకరిని సూచించగలరా? ఇది ఎమ్.ఏ.కి చివరి సంవత్సరం. తెలుగులో ఆనర్స్ డిగ్రీ కోసం ఏ కళాశాల అనుబంధింపబడలేదు.

ప్రెసిడెన్సీ, క్రిస్టియన్ కళాశాలల్లో కనీసం బి.ఏ. డిగ్రీ కొరకు అనుబంధింపబడలేదు. తరువాత బి.ఏ., ఆనర్స్ డిగ్రీ అధ్యయనాన్ని మనం కొన్ని సంవత్సరాల తర్వాత చూడగలం. ఇద్దరు అభ్యర్థుల మార్కులు కొరత పడింది. ఒకరికి 11 మార్కులు ఇంకొకరికి 13 మార్కులు తక్కువ వచ్చాయి. వాళ్ళని తప్పక పాస్ చేయాలని నా గట్టి అభిప్రాయం. మీరు దీనిని బలపరచాలని గట్టిగా కోరుతున్నాను. ఇవాళ నేను రామయ్యగారికి (జయంతి) పంపుతున్న మార్కులు చివరి జాబితాలో వారి మార్కులను దిద్దుబాటు చేస్తాను. కాని, పాస్ కావడానికి వారికి ఒక మార్కు తక్కువగా వచ్చింది. ఒక్కొక్కరికి ఒక్కొక్క మార్కు చేర్చడమా, మానడమా అన్నది మీరు రామయ్యగారు నిర్ణయించండి.

నేను రామయ్యగారికి పెద్ద ఉత్తరం పంపుతున్నాను. ఆయన దానిని చదివి వినిపిస్తారనేది సందేహం లేదు. అందుచేత నేను దానిలో ఏమి చెప్పానో, అది ఇక్కడ మళ్ళీ చెప్పను.

☆ ☆ ☆

**జార్జి మెడోక్స్,**
**ఎస్.ఎస్.ఎల్.సి., పరీక్షల కార్యదర్శి (కి గురజాడ జాబు)**

**మహాశయా,**

మాతృభాషని, ఆధునిక తెలుగు మార్కుల పుస్తకాన్ని దీనితో మీకు సమర్పిస్తున్నాను. 99వ పుట పుస్తకం II. ఎర్రా వెంకయ్య పేరుకు ఎదురుగుండా ఏ సంఖ్యాలేదు. అతని జవాబుల పుస్తకంలో సంఖ్య 41022.

ఆధునిక తెలుగు పరీక్షకు కూర్చున్న అభ్యర్థి సంఖ్య సగటు మొత్తం మార్కుల సంఖ్య 41గా ఇవ్వబడింది. ఈ సగటుకు ఏమైన విలువ ఉన్నట్టయితే ప్రావీణ్యానికి సూచనగా ఏవైనా సగటు విలువ ఉన్నట్టయితే, కడిచిన సంవత్సరాలలో ఎటువంటి శ్రద్ధ తీసుకోలేదనుకుంటాను. 176 వ నియమం మెట్రిక్యులేషన్ పరీక్షలకు నిర్ణయింపబడిన పాఠ్యగ్రంధాలు ప్రధానంగా ఆధునిక తెలుగు గురించి ఉండాలని నియమం విధింపబడింది. ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలకు కూర్చునే అభ్యర్థులలో చాలమంది ఆధునిక తెలుగును ఎంచుకుంటారు. ఉన్నత పాఠశాలల మేనేజర్‌లకు ఉపాధ్యాయులకు సూచనలు ఉంటాయి. ఈ దిగువ నిర్దేశాలను మద్రాసు విద్యాశాఖ నియమాలను గురించి గుర్తింపబడ్డాయి.

మాతృభాషా పఠనం: ఒక వచన పాఠం.... ప్రధానంగా సంభాషణల పాఠంగా ఉండాలి. దీనిలో కుర్రవాళ్ళు విద్యావంతులైన వర్గాల భాషలో మాతృభాషలో మాట్లాడాలి.

మాతృభాషా వ్యాకరణం: "నియమాలు, ఉదాహరణలు, వ్యాకరణ విధులను బట్టి, భాషా విధానం ఉండాలి".

ఉన్నత పాఠశాలల విద్యార్థులు కొన్ని పాఠశాలలలో సజీవ మాతృభాషలో శిక్షణను పొందుతున్నారు. 176వ నిబంధన అమలు చేయడానికి పాఠ్యగ్రంథాలు ఎంపిక జరగడం ఇప్పుడు చాలా అవసరం.

అంచేత నేను 1916 మెట్రిక్యులేషన్ పరీక్షల కోసం ఈ దిగువ పుస్తకాల ఎంపికను ఇస్తున్నాను.

'కాశీయాత్ర చరిత్ర' – గ్రంథ కర్త ఏనుగుల వీర స్వామయ్య. అలహాబాదు, బెనారస్ నుండి వస్తున్న పత్రిక – 27/47 పాట్నాకు, కలకత్తాకు.

పువ్వాడ వెంకటరావు సంపుటం

లేదా

కామధేనువు కథ – రచయిత ప్రభాకర శాస్త్రి

రెండో సంపుటం 114–156

కమలాకాంతుడు – రచయిత బంకించంద్ర చటర్జీ–29 కేతన రచించిన దశకుమార చరిత్రము 103–132.

రంగనాథ రామాయణము – ఉత్తర కాండము

సరస్వతీ ముద్రణాలయము

పుట – 33–1...14 నుండి 27

II పుట 35 నుండి పంక్తి 10 పుట 38

III 19వ పంక్తి నుండి 41వ పుట వరకు పంక్తి 1 నండి – 48 వరకు

షరా: పైని రాసిన విషయాలు గురజాడ, ఆయనతోడి సభ్యులు తమ విధులను ఎంత శ్రద్ధతో నిర్వహించారో తెలుపుతాయి – సంపాదకుడు.

అత్యంత విధేయుడు
జి.వి. అప్పారావు

జార్జ్ మెడోక్స్ ఎస్క్వయర్. ఓ.ఏ.,
ఎస్.ఎస్.ఎల్.సి., పరీక్షల కార్యదర్శికి (గురజాడ జాబు)

ప్రియమైన మహాశయా,

మచిలీపట్నం కేంద్రం నుండి అందిన జవాబుల పుస్తకాల్లో శివలెంక వీరభద్రయ్య, పుల్లావజ్ఝల రామారావు పుస్తకాలు 29589 అన్న ఒకే సంఖ్య రెంటికి ఉంది.

☆ ☆ ☆

డి.సి. కృష్ణయ్యగారికి,
తెనాలి.

ప్రియమైన కృష్ణగారు,

నా నివేదికలో పంపడానికి, మీ నివేదిక కోసం ఎదురుచూస్తున్నాను. కూనూరులోని హైలాండ్స్‌కు సాధ్యమైనంత వేగంగా దయచేసి పంపించండి.

(గురజాడ జాబు)

☆ ☆ ☆

విజయనగరం, కోట
తేది: 6 ఫిబ్రవరి, 1911.

రిజిస్ట్రార్ గారికి,

మహాశయా,

9 వ తేదిన పంపిన టెలిగ్రామును అందుకున్నాను. దానిలో తమరు తెలుగు పాఠ్య గ్రంథాల స్వభావం గురించి నివేదికను త్వరగా పంపమన్నారు. 1913 అక్టోబరు 18 వ తేదీన పంపిన 4725 నంబరు ఉత్తరం, అది ఇందులో పంపిన ఉత్తరాలను త్వరగా తిరిగి పంపమని కోరారు.

ఈ నివేదికను విలువైనదిగా చేయడానికి నేను సాధ్యమైన ఏర్పాట్లన్నింటిని చేశాననుకుంటాను. ఆ పుస్తకాల ఎంపికకు సరైన సూచనలను యివ్వడానికి అది ఉద్దేశింపబడింది. ఈ పుస్తకాల అధ్యయనం వల్ల కలగగల సంస్కారం విలువను అది నొక్కి వక్కాణిస్తుంది..

ఏమైన విలువ ఉండాలంటే ఈ నివేదిక ఆధారపడదగ్గదిగా ఉండాలి. ఇటువంటి నివేదిక సిద్ధపరచడానికి చాలా కాలం అవసరం. రానున్న సెప్టెంబరుకు ముందర దానిని నివేదించగలననుకుంటాను.

నాకు పంపిన పుస్తకాల సంఖ్య ఒకటి తప్పితే, తక్కినవన్నీ అందాయి. అవి

బజారులో దొరికే చవకబారు పుస్తకాలు. నా సొంత పుస్తకాల ప్రతులు నా దగ్గరున్నాయి. కాని, విశ్వవిద్యాలయం వారు పంపినవి మీతో సహకరించే పండితుల కొరకు ఉద్దేశింపబడినవి. పుస్తకాలలో ఒకే ఒకదానిని నాతో పట్టుకొచ్చాను అది....

నాకున్న కొద్ది తమిళ భాషా జ్ఞానంతో నా అభిప్రాయాన్ని చెప్పలేను. ఈ జ్ఞానంతో గోపినాధరావు గారు ప్రవీణుడు అయినది కానిది చెప్పలేను. రేపు కృష్ణశాస్త్రిగారిని అడిగినట్లయితే గోపినాధరావుగారు ఆయన గట్టి పండితుడైన విషయం సంతోష పూర్వకంగా చెప్తారు.

భవదీయుడు,
జి.వి. అప్పారావు.

☆ ☆ ☆

ఎడ్మిరాల్టీ హౌస్,
తేది: *26.4.1914*

ప్రియమైన కృష్ణగారు,

మీ ఏప్రిల్ 21వ తారీఖు ఉత్తరం విజయనగరం నుండి ఇక్కడకు అందింది. ఈ ఏడాది ఇంగ్లీషు పరీక్షకు హాజరుకాని విద్యార్థులకు ఎటువంటి రాయితీని చూపడానికి నియమాల్లో ఏమీలేదు. నియమాలకు అనుబంధం చేర్చవలసి వుంది. మీ నివేదికలో ఈ విషయాన్ని దయచేసి చూడండి. మే ఒకటవ తేదిన కూనూరు వదలి పెడతాను. ఈ నెలాఖరుకు మద్రాసులో వుంటాను. 29వ తేదిన నాపై విలాసానికి జవాబుల పుస్తకాన్ని మీరు పంపినట్టయితే కృతజ్ఞుడనై వుంటాను. రిజిష్టర్ పార్శిల్లు ఒక రోజు ఆలస్యంగా చేరుతాయి కాబట్టి, అవి మే ఒకటవ తేది చేరుతాయి.

☆ ☆ ☆

మద్రాసు,
తేది: *4.5.1914*

*ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షల కార్యదర్శికి,*

*మహాశయా,*

వేరే సంచికలో మాతృభాషా రచన అనువాదాలు (ఆధునిక తెలుగులోనికి) పంపుతున్నాను. సహాయ పరీక్షకుల నుండి నివేదిక వచ్చిన తరువాత ఈ పరీక్షల గురించి నా వ్యాఖ్యలను పంపుతాను. సహాయ పరీక్షకుల నివేదిక ఇంకా రాలేదు.

*(గురజాడ జాబు)*

☆ ☆ ☆

దీ హైలాండ్సు,
కూనూరు
తేది: *10 మే, 1914.*

ప్రియమైన మిత్రమా,

సమావేశం ఏ తేది జరిగేది వార్త నేటి వరకు చేరలేదు. ఆశ్చర్యంగా ఉంది. ఏ కారణం చేతనో విశ్వవిద్యాలయం అధికారులు గత సంవత్సరం కంటే ముందుగానే సిఫార్సు చేసినట్టయితే, తెలుగు పాఠ్యగ్రంథాల గురించి నిర్ణయించడం సాధ్యం కాదు. 1916వ సంవత్సరానికి నిర్ణయించిన పాఠ్యగ్రంథాల్నే 1917 నకు కూడ నిర్ణయించాలని నా కోరిక.

ఇంటర్మీడియట్ తరగతి తెలుగు కాంపోజిషన్‌కు నమూనాలు శ్రీ వెంకట రంగారావు గారు ఏవైనా పుస్తకాలు సిఫార్సు చేసినట్టయితే, బ్రౌన్ రచనను (అనంతపురం రాజుల చరిత్రను)గాని, ఏనుగుల వీరాస్వామి కాశీయాత్రనుగాని నిర్ణయించమని నా విజ్ఞప్తి.

1917 పాఠ్యగ్రంథాల వల్ల, నాలుగయిదు వారాల ఆలస్యం వల్ల వచ్చే తేడా ఏమిటో నా కర్థం కావడంలేదు.

నాకోరికలకు దయచేసి విలువ నివ్వండి.

భవదీయుడు,
జి.వి. అప్పారావు.

☆ ☆ ☆

హైలాండ్సు,
కూనూరు,
తేది: *17.5.1914*

*మహారాజశ్రీ టి. రామకృష్ణ పిళ్లై గారికి ఎమ్.ఏ.,*
*తొట్టకాడు కాలేజీ (కాటేజీ?)*
*ఎగ్మోర్, మద్రాసు.*

*మహాశయా,*

ఇప్పుడు నేను ఇక్కడ వుంటున్నాను. గడిచిన సాయంత్రం నేను ఉదకమండలం వెళ్ళాను. వెంకట రంగారావుగారి నుండి నాకు టెలిగ్రాము వచ్చింది. కూనూరు రైల్వే స్టేషను వద్ద నన్ను కలవమని ఆయన కోరారు. కాని, అది ఉదకమండలంలో ఉంది. నేను ఆయన్ని కలవలేక పోయాను. కాని ఫెన్ హిల్ స్టేషన్ వద్ద మా రైళ్ళు ఒకదాని నొకటి దాటి వెళ్ళాయి. 20వ తేది సమావేశ పరుచుదామని మీరు ప్రతిపాదించిన బోర్డ్ ఆఫ్ స్టడీస్ సమావేశం గురించి నాకు ఏదో చెప్పారు. పుస్తకాల పట్టికను మీకు పంపానని నాకు ఆయన చెప్పారు. సమావేశం గురించి నాకింక వర్తమానం రాలేదు. మీరు నిర్ణయించిన తేది ఏమీ సదుపాయంగా లేదు. నీలగిరుల నుండి ఒకటి రెండు రోజుల కోసం మళ్ళీ మద్రాసుకు

పరుగున వెళ్ళడం ఏమీ సదుపాయంగా ఉండదు. 25వ తేది సమావేశానికి వి.ఆర్.రావ్‌గారు కూడ వెళ్ళలేరు. కాబట్టి సమావేశాన్ని వాయిదా వేయమని మిమ్మల్ని కోరడానికి ఆయన నిర్ణయించారు. అయినా సమావేశాన్ని వాయిదా వేయలేక పోయినట్టయితే, తెలుగు పాఠ్య గ్రంధాల గురించిన ఆలోచన దయచేసి వాయిదా వేయండి. భాషల సంఘం సిఫారసులు దృష్టిలో పెట్టుకోవాలి. కొన్ని పరిక్షల కోసం పాఠ్య గ్రంధాలను సరిదిద్దడానికి ఒక సిఫారసు ఉంది. 1915 నుండి 1916 వరకు కొనసాగాలి. తెలుగు భాషా సారస్వతాల అధ్యయనం అవసరమయ్యేట్టుగా 1915 పాఠ్యగ్రంధాల్ని నిర్ణయించాలి. వేసవి సెలవులకుగాని, సెలవుల తర్వాతగాని సమావేశం జరిగినట్టయితే, అంటే జూలై నెలలో అయితే సదుపాయంగా ఉంటుంది. మీరు సమావేశాన్ని జరిపినట్టయితే, తెలుగు భాషతో సంబంధమున్న ఏ విషయాన్ని నిర్ణయించవద్దని నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

11.5.1914 తేది గల 15:44 నెంబరు గల ఉత్తరం మీ దృష్టికి తీసుకువస్తున్నాను. ప్రామాణిక తెలుగు భాషా పరీక్షకులు భానుమూర్తిగారి, రామ్మూర్తిగారి 21.4.1914 తేదీది దీనితో చేర్చిన ఉత్తరం మీ దృష్టికి తీసుకు వస్తున్నాను. ఇది జవాబుల పుస్తకం చాలా ఆలస్యంగా నా చేతికి అందినట్లు దీనివల్ల తెలుస్తుంది.

మార్కులు వేయడంలో ఉన్న తేడా సహజం. అభ్యర్ధికి అవసరమైన శిష్ట వ్యావహారిక బాషా రూపాలలోని వ్యాకరణ నిబద్ధత దృష్ట్యా, ప్రామాణిక తెలుగు సహాయ పరీక్షకుడు పరిశీలించారు.

☆ ☆ ☆

టెలిగ్రాం పైకం చెల్లింపబడలేదు.

*పాఠ్యగ్రంథాల సంఘం కార్యదర్శికి,*
*3. హార్డ్లే రోడ్,*
*కీల్‌పాక్, మద్రాసు-1 W.*

**పంపినవారి సంతకం,**
**మాడెక్స్‌కు తంతి,**
**పరీక్షల కార్యదర్శి,**
**పాత కాలేజీ,**
**నుంగం బాకమ్.**

మీరు పంపిన తంతి నా నోటు పుస్తకంలో దొరికింది. 9047 అందలేదు. ఉత్తరం ర్రాస్తున్నాను.

*(సం.) అప్పారావు.*

*మహాశయా,*

23వ తేదిని మీరు పంపిన తంతి అందింది. మద్రాసు క్రిస్టియన్ కాలేజీకి చెందిన వెంకట సుబ్బయ్య అనే 9047 నంబరు అభ్యర్థి గురించి మీరు భోగట్టా

అడిగారు. జవాబుల పుస్తకాలు నేను మదరాసులో వదలి పెట్టాను. నోటు పుస్తకం మాత్రమే తెచ్చాను. దానిలో అతి జాగ్రత్తగా సంఖ్యలు రాసి పెట్టాను. 9047 సంఖ్య దానిలో లేదు. జవాబుల పుస్తకం నేను చూడక పోవడం ఎంతమాత్రం జరగలేదనుకుంటాను. పరీక్ష జవాబుల పుస్తకాలు నేను పరిశీలించాలని మీరు అనుకుంటే, ఇక్కడ నేను సంపాదించగలను (?) నీలగిరి రైల్వేలు చార్జీ చాలా ఎక్కువగా ఉంటుంది. దయచేసి ఏమి చేయాలో సెలవీయండి.

*25.5.1914* మీ కత్యంత విధేయుడు
ఉదకమండలం (సం.) జి.వి. అప్పారావు

☆ ☆ ☆

తేది: *26* మే, *1914.*

పి. వెంకటరామయ్య, బి.ఏ., ఎల్.టి. హైస్కూల్,
ప్రథమ సహాయకుడు,
ముల్కి(?)

మహాశయా,

ఏప్రిల్, 20వ తేది (?) ఉన్న మీ నివేదిక అందింది. సగటు గురించి నేను చేసిన సూచనలను మీరు అర్థం చేసుకున్నట్టు లేదు. గడిచిన ఏడాది ప్రామాణిక తెలుగు, ఆధునిక తెలుగు భాషల సగటు సంఖ్యల నుండి ఈ సగటు సంఖ్య భిన్నంగా ఉండరాదని అనుకుంటున్నాను. కారణాలు ఏమిటంటే, మీకు జ్ఞాపకం ఉన్నదో లేదో ప్రామాణిక తెలుగు పరీక్షకుడు శ్రీ భానుమూర్తి గారి నివేదికను మీకు చదివి వినిపించాను.

1. పరీక్షకుల, సహాయ పరీక్షకుల తెలుగు రచనలను విలువకట్టడం ఒకే విధంగా చేయడం కష్టం.
2. కళల విషయంలో ఇంటర్మీడియట్ పరీక్షల తెలుగు రచన విషయంలో వలె, తెలుగు పరీక్షల విషయంలో వలెనే, విద్యార్థుల ప్రావీణ్యాన్ని గడిచిన సంవత్సరాల సగటులు సూచిస్తాయి.
3. ఈ పరిస్థితులలో వివిధ కేంద్రాలలోని అభ్యర్థుల యిబ్బందులను తగ్గించడానికి ఒక్క సాధనము, గడిచిన సంవత్సరం సగటుకు సాధ్యమైనంత చేరువుగా ఉంచడం ఒక్కటే.

పరిస్థితి ఇది కాబట్టి, 45.2 నుండి 47.3 వరకు సగటును కృత్రిమంగా పెంచడం అవసరం కాదు. నేను విలువకట్టిన జవాబు పుస్తకాల సగటు 46.1 ఇంటర్మీడియట్ అభ్యర్థుల మార్కులను ఏ నియమాన్ని అనుసరించి మీరు పెంచారో నేను చెప్పలేను. ఇప్పుడు చాలా ఆలస్యం అయింది. ఇంతకు ముందర నా సలహాని మీరు కోరినట్టయితే, దానిని నేను సంతోష పూర్వకంగా ఇచ్చేవాడ్ని.

☆ ☆ ☆

**డా॥ హుల్ట్ ఎజ్ స్ (Dr. Hultezsch's) ఉత్తరానికి కాపీ**

*ఉదక మండలం,*
*తేది: 5.6.1895*

ప్రియమైన అప్పారావుగారు,

మీ 3వ తేది ఉత్తరం నాకు నిన్న అందింది. వచ్చేనెల మొదటి నుండి దయచేసి మీ చిరునామాను నాకు తెలియజేయండి. 3 ప్రాచీన లిఖిత పత్రాలు నేను చూస్తాను. (రెండు ఉదయగిరి నుండి, ఒకటి పాలకొల్లు నుండి) నేను బెంగుళూరి నుండి తిరిగి వచ్చాక వాటిని మీకు పంపిస్తాను. ప్రొఫెసర్ కిల్ హార్న్, వాటిలో రెండింటిని ప్రచురించడానికి ఇష్టపడినట్టుగా లేదు. అవి కృష్ణరాజు కాలానికి చెందినవి. వీటిని మీరు ప్రచురించారు. (కృష్ణదేవరాయలేమో?) ప్రాచీన లిఖిత పత్రాల గురించి నాకు జ్ఞాపికను మీరు పంపినట్టయితే నేను సంతోష పూర్వకంగా ఆయనకు పంపుతాను. లేదా మీకు వాటిని త్రిప్పి పంపుతాను. వాటిని మీరు పరిష్కరించవచ్చును.

మీరు సూచించినట్టుగా నాసిక్ కాగితాన్ని అమ్మకం చేయగలననుకోను. స్థానిక అమ్మకందారు నుండి ఈ కాయితాన్ని నేను సంపాదించడం కష్టమేమీ కాదనుకుంటాను.

*భవదీయుడు (సం.),*
**Dr. E. Hultezsch's.)**

☆ ☆ ☆

*17, పాల్ మాల్ యస్.డబ్ల్యు. లండన్,*
*తేది: 7 ఫిబ్రవరి, 1904.*

ప్రియమైన అయ్యా,

మీరు వ్రాసిన జాబు అందింది. అనేక ధన్యవాదాలు. మిమ్మల్ని నేను మరువలేదు. మీరు నాకు బాగా జ్ఞాపకం. నాతో సహకరిస్తానని మీరిచ్చిన వాగ్దానానికి కృతజ్ఞుణ్ణి. మీ కథలు పంపకోరిక. నాకవి నచ్చినట్లయితే, ఆంగ్లపాఠకులకు నచ్చినట్లే. త్వరలో మీ కథలను చదవకోరుతున్నాను.

జె.డబ్ల్యు. రీస్

☆ ☆ ☆

*56. ఫిట్జుజాన్స్ ఎవిన్యూ,*
*హేంప్ స్టెడ్,*
*తేది: 29 నవంబరు, 1904.*

ప్రియమైన అయ్యా,

దయతో మీరు వ్రాసిన జాబులకు ఎంతో సంతోషించాను. దురదృష్టవశాత్తు ప్రస్తుతం అదనంగా ఏ పని చేయాలన్నా అవకాశం లేకుండావుంది. కొంతకాలం వరకు నేననుకున్న వేవీ నెరవేరవు.

భారతీయ జీవితాన్ని ప్రతిబింబించే కథలు పంపించగలరా? కొన్ని కథలు పంపినట్లయితే, కృతజ్ఞుణ్ణి. అయిదువేల మాటల కంటె ఎక్కువ కాకుండా వ్రాయండి. మా పద్ధతికి సరిపడక పోయినట్లయితే, అక్కడక్కడ కొద్దిగా మార్చవలసి వుంటుంది. ఇందుకు మీరు అనుమతిస్తారనుకుంటాను.

మాక్స్ పెంబర్టన్

☆ ☆ ☆

వాల్తేరు,
తేది:24 మే, 1909.

ప్రియమైన అప్పారావు గారూ,

మీ నాటక నూతన ముద్రణ పీఠిక పంపినందుకు మీకు నేను చాలా కృతజ్ఞుణ్ణి. ఆ మధ్య శ్రీ శ్రీనివాస అయ్యంగారు నాకొక ప్రతి పంపించి, నా అభిప్రాయాలు విపులముగ తెలియచేయమని అడిగారు. ఆంగ్లేయ దృక్పథంతో నేను మీ పీఠికను అర్థం చేసుకుని, దానిని మెచ్చుకుంటూ నా భావాలను ఆయనకు తెలియ చేశాను. నా ఉత్తరాన్ని ఆయన మీకు పంపిస్తామన్నారు. దానిని మీకు వెంటనే అందచేయవలసినదని ఈ రోజే పి.టి.యస్.కు ఉత్తరం వ్రాస్తున్నాను. అలా అయితే, మళ్ళీ మీకు నా పరిశీలనను వ్రాయనక్కర లేదు.

హిగిన్ బాథమ్స్ వారితో నాకు పరిచయంలేదు. అక్కడికి నేను రెండు మూడు సార్లు వెళ్ళాను. నన్ను వాళ్ళెరగరనుకుంటాను. శ్రీనివాస అయ్యంగారు మిస్టర్ హాగ్స్‌కు వ్రాస్తామన్నారు. లాభం వస్తుందని తోస్తే మీ నాటక ప్రతులను అమ్మకానికి వాళ్లు తీసుకుంటారు.

మీ నాటకం బాగా చెల్లిపోతుంది. తప్పదు. మీ పీఠికలో నన్ను పరిచయం చేసినందుకు మీకు నేనెంతో కృతజ్ఞుణ్ణి. కాని తెలుగు భాషా విషయక చర్చలలో నా గురించి మీరు ప్రస్తావించడానికి నేను తగనేమో అని నా అభిప్రాయం. ఏమైనా మీ ప్రశంసకు పాత్రుడనైనందుకు సంతోషం.

వాడుక భాషలో మీరిపుడు యింకా ఏమైనా వ్రాస్తున్నారా?

జె.ఎ. యేట్సు

☆ ☆ ☆

ఎంజలిస్ హోటల్
తేది: 25.12.1909

ప్రియమైన అప్పారావుగారు,

ప్రధాన కార్యదర్శిగారికి మీ 22 వ తేదీ ఉత్తరం పంపించాను.

చాల సంవత్సరాల క్రితం నేను కన్యాశుల్కం చదివాను. వాడుక భాషలో

వ్రాసిన పుస్తకానికి రెండవ ముద్రణ జరగడం నాకు చాల సంతోషాన్ని కలిగించింది. అంతేకాక కొత్త ముద్రణలో 'అ'కు మార్పు చేసిన 'అ'కు అచ్చులో తేడాలు మీరు గుర్తించారు. ('అ' జర్మనులు వ్రాసినట్లుగా)

కొన్నెళ్ళ క్రిందట నేను వాడుక భాషలో వ్రాసిన చిన్న కరపత్రాన్ని దీనితో పంపుతున్నాను. తెలుగును ఉచ్చారణ ప్రకారం తెలుగు లిపిలో కంటే రోమను ఇంగ్లీషు అక్షరాలతో వ్రాయడం ఉచ్చారణను బట్టి రాయడం తేలికగా జరుగుతుంది. ఇంగ్లీషు ఉచ్చారణను బట్టి కన్యాశుల్కంలో 'అ' ను 'ఆ' గా మార్పు చేసి ముద్రిస్తే నేను సంతోషిస్తాను.

మీ విశ్వాసనీయుడు,
గెరిట్.

☆ ☆ ☆

ఎడ్మిరాల్టి హౌస్,
తేది: *27.12.1909,*

ప్రియమైన మిత్రమా,

మేము చాల త్వరగా తిరిగి వస్తాము. తేదీ నాకు తెలుసును కాని, నేను చెప్పకూడదు..... పద్దు దీనితో జతచేసి పంపుతున్నాను. రాత చిత్రలిపి. దాన్ని దయచేసి జాగ్రత్తగా తిరిగి రాయండి....(?) దావా నడిపించే పట్టుదలతో ఉన్నారు. (దావా అంటే ఆనందగజపతికి సంతానం లేదు. చనిపోవడానికి ముందర తనకిష్టమైన వారిని పెంచుకోవలసిందిగా తల్లికి అధికారం ఇచ్చారు. దత్తుని పేరు అలక నారాయణ గజపతి. ఈయన భార్య గురజాడ శిష్యురాలు) నా స్నేహితులు డి.ఆర్.కు, గోపీనాథ్, నేను సాయం చేస్తున్నామని విజయనగరంలో వదంతి వ్యాపింపచేస్తున్నారు. కన్యాశుల్కం నా చేతిలో పెరుగుతూ వుంది. ఆర్టిమిస్? వార్డ్‌లోని మైనపు గోలియత్‌లాగా అది పెరుగుతూ వుంది. దానిలో గిరీశం గురించి ఎక్కువగా ఉంది. గిరీశం స్థాయి దానిలో ఉందని గ్రంథకర్త నమ్మకం. వేశ్య రేఖా చిత్రం ఎక్కువగా రాయడం జరిగింది.

(గురజాడ ఎవరికో రాసినది అయి వుండవచ్చును.)

☆ ☆ ☆

మకాం, మధుర,
తేది: *11 ఫిబ్రవరి, 1910.*

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

దయతో మీరు రెండవ తేదిన వ్రాసిన లేఖ అందింది. అనేక నగరాలు తిరిగి అలసటగా వున్న నాకు మీ లేఖ హాయి అనిపించింది. బిల్హణుని జీవిత కథను నాటకంగా వ్రాస్తున్నారని విని ఆనందించాను. అపూర్వ ప్రతిభావంతమైన

మీ లేఖినితో బిల్హణుడు ఆంధ్రసాహిత్యంలో ఆచంద్రతారార్కాం భాసిస్తాడని నా విశ్వాసం. మహా ప్రేమికుడు, లలిత హృదయుడు, మధురకవి అయిన బిల్హణుని భావోద్వేగానికి హేతువు గుజరాతు దేశపు రాజకుమార్తెయేనా? మీరు నాకా విషయం తెలిపినందుకు సంతోషం.

మీ కళింగదేశ చరిత్ర ఎప్పుడు వెలువడుతుందోనని అందరూ ఎదురుచూస్తున్నారు. అది ఆంధ్ర పండితులకు, చరిత్రకారులకు, విద్యార్థులకు ఎంతో ఉపయోగపడుతుంది. మీకు దొరికిన శాసనాలలో నాలుగు సరియైనవి కావనీ జర్మనీనుంచి ప్రొఫెసర్ హోల్జ్, శ్రీ వెంకయ్యగారికి ఉత్తరం వ్రాశారు. అవి సృష్టి కనుక తాను వాటిని అచ్చువేయడట. అయితే అవి సృష్టి అని నేననుకోను. అందుకు తగినంత కారణమేమీ నాకు కనిపించలేదు.

ఈ మధ్య, అందులోను ఈ ప్రయాణంలో నాకు దొరికిన శాసనాలు ఏమంత చెప్పుకోతగ్గవి కావు. పశ్చిమ చాళుక్య ప్రథమ విక్రమాదిత్యుని తామ్రశాసన మొకటి ఇటీవల నాకు లభించింది. ఇదే నేను ఈ మధ్య కావించిన పరిశోధన. ఇదికాక గంగ, కాకతీయ యుగాలకు చెందిన రెండు మూడు శిలా శాసనాలు దొరికాయి.

నేను ఇక్కడ గుహాలలోని బ్రాహ్మీలిపిలో వున్న శాసనాలను పరిశీలిస్తున్నాను. వాటిని ఇంత వరకు, ఎవరూ వివరంగా పరిశోధించి, సరిగా అన్వయించలేదని మీకు తెలుసు కదా! వీటిని పూర్వాపరాలు తెలుసుకోగలిగితే, అది అద్భుతమైన పరిశోధనే అవుతుంది.

పని ఎంతవున్నా, రిపోర్టు తయారు చేయడం వల్ల తీరిక లేకపోయినా, మీతో కొన్ని గంటల పాటు గడపడమంటే నాకెంతో హాయి. నీలగిరికొండల మీద, ప్రతిరోజు కాకపోతే మానే, వారానికొకసారైనా, మీతో ప్రసంగించడమంటే నాకానందం.

నావద్ద శాసనాల ఫోటోలను ఎత్తే పరికరాలన్నీ వున్నాయి. మీ మహత్తర నాటకం కన్యాశుల్కం రంగ భూమి మీద దిగ్విజయ మౌతున్నందుకు, మిమ్మల్ని మనసారా అభినందిస్తున్నాను.

హెచ్. కృష్ణశాస్త్రి

☆ ☆ ☆

వార్డెన్స్ లాడ్జి,
మదరాసు యస్.ఇ,
తేది: *20.2.1912*

ప్రియమైన అయ్యా,

మీరు దయతో పంపిన మీ హాస్య రస ప్రధానమైన నాటకం అందింది. కృతజ్ఞుణ్ణి. తెలుగు భాషా రంగంలో సంస్కరణవాదులకు, సనాతన వాదులకు జరుగుతున్న వాదాన్ని నేను కొంత వరకు అర్థం చేసుకోగలిగాను. సంస్కారులు, విద్యావంతులు

మాటలాడుకునే శిష్టవ్యావహారిక భాషలో వచన గ్రంథములు వ్రాయవలెననే మీ వాదము న్యాయమైనది. సశాస్త్రీయమైనది.

శ్రీ థామ్సన్ (?)

☆ ☆ ☆

85 గ్రేస్ట్రీటు, కలకత్తా,
తేది: 15 ఏప్రియలు, 1912.

ప్రియమైన అప్పారావు గారూ,

మీరీనెల మొదటి తారీఖున వ్రాసిన ఉత్తరము, పంపిన తెలుగు గేయము అందాయి. ధన్యవాదములు. దేవనాగరలిపిలో అచ్చయిన ఆ గేయాన్ని నేను చదవగలిగాను. తెలుగు పుస్తకాలను దేవనాగరిలో అచ్చువేసినట్లయితే, ఉత్తర దేశపు భాషలకు, తెలుగుకు యిప్పుడున్న వ్యత్యాసం కొంత తగ్గుతుంది. మీ అనువాదంలో పెక్కు సంస్కృత శబ్దాలు ప్రయుక్తమైనవి కనక, నాకది చక్కగా అర్థమయింది.

మీ గ్రంథాన్ని ఒక నిధి వలె దాచి వుంచాను. 'దేవనాగర' ద్వితీయ సంచికలో అది అచ్చుపడేటట్లు చూస్తాను. భారతదేశ ఐక్యతకు మనం ఒక సామాన్య లిపిని, సాహిత్యభాషను పెంపొందించుకోవలసి వుంటుంది. టేక్‌చంద్‌ను గురించి 'నేషనల్ మాగజైన్'లో కొన్ని వ్యాసాలు అచ్చుపడినాయి. ఆ వ్యాసాలు ప్రచురితమయిన సంచికలు దొరకడం కష్టమేకాని వాటిని ఎలాగైనా సంపాదించి మీకు పంపిస్తాను. నా లైబ్రరీలో ఆ సంచికలు వున్నవేమో వెతికిచూడమని నా కుమారునితో చెప్పాను.

సాహిత్య పరిషత్తు సభ్యులు బెంగాలీ భాషలో తప్ప, ఇంకే భాషలోను వ్యాసాలు రచించరు. నేను పరిషత్తుకు అధ్యక్షునిగా వుంటూనే, వాళ్ళల్లో తప్ప బుట్టాను. సరే, మీరుకోరినట్లు, ఎవరినో ఒకరిని ప్రోత్సహించి ఆధునిక వంగ సాహిత్య భాషను గురించి విపులంగా ఒక వ్యాసం వ్రాయిస్తాను. అనేక గౌరవ పూర్వక నమస్కృతులతో లేఖను ముగిస్తాను.

శారదా చరణ మిత్ర

☆ ☆ ☆

అనంతపురం,
తేది: 5 జూన్, 1912.

ప్రియమైన అప్పారావు గారూ,

మీ ఉత్తరం చేరింది. ధన్యవాదాలు. హంటరు ఊటీనుంచి ఇంకొక నెలలో బయలు దేరుతాడు. మీరు ఆయనను కలుసుకుంటున్నారని తెలియపరిచాను.

ఇక్కడి వాడుక పదాలు తెలిపే కొన్ని పుస్తకాలను మీకు నేను ఇవాళ పంపిస్తున్నాను. అందులో కొన్నిపుస్తకాలు బ్రాహ్మణులు రచించినవి. మరికొన్ని

శూద్రులు వ్రాసినవి. ఇంకొన్ని మహమ్మదీయులు కల్పించినవి. ఈ పుస్తకాలలో వాడిన మాండలిక పదాలలో అంత తేడా కన్పించదు. కాని మహమ్మదీయులు రచించిన పుస్తకాలు పరిశీలించతగ్గవి. ఈ జిల్లాలో హిందువులు మాట్లాడే కొన్ని మాటలను వాళ్ళు చిత్రంగా ప్రయోగించారు. రేపో ఎల్లుండో మరికొన్ని పుస్తకాలు సేకరించి పంపుతాను.

నేను తెలుగు సాహిత్యం మీద ఒక వ్యాసం వ్రాయాలనుకుంటున్నాను. ఆంధ్ర సాహిత్యంలో నూతన పోకడలను పరిశీలిస్తున్నాను. ఆంధ్రకవితలో నూతన ధోరణులను గురించి. 'న్యూ కరెంట్స్ ఇన్ తెలుగు లిటరేచర్' అనే పేరుతోనో లేక 'ఎక్స్‌పెర్మెంట్సు ఇన్ తెలుగు పొయిట్రీ' అనే శీర్షికతోనో మీ గేయములను గురించి ఒక వ్యాసము వ్రాయవలెనని కుతూహలపడుతున్నాను. మీ నీలగిరి పాటలు ప్రతి నా వద్ద వున్నది. ఇతర రచనలు కొన్నింటిని పంపించకోరుతున్నాను. మీ గీతములను తిరిగి మీకు అందచేస్తాను. మీరు కులాసాగా వున్నారని తలుస్తాను.

పి. శేషాద్రి

☆ ☆ ☆

తుని,
*తేది: 18 జూన్, 1912.*

ప్రియమైన అయ్యా,

మీరు దయతో వ్రాసిన జాబు అందినది. నేను మీకు వెంటనే జాబు వ్రాసితిని; కాని మా గుమాస్తాలు దానిని ఆలస్యముగా పోస్టు చేసితిరి. మనమనుకున్న కార్యము జూలై నెలలో తప్ప నెరవేరదు, రామచంద్రరావు ఇతర పనులలో నిమగ్నుడైనాడు. అతను మనవెంట రావలెను.

మీరు లేవనెత్తిన సమస్య మిమ్ములను కలుసుకొన్నపుడు చర్చించగలను. ఉత్తరములలో చర్చించడమువల్ల లాభము లేదు. మనము ఒకరినొకరము అపార్థము చేసుకుంటున్నామని నా అభిప్రాయము. చర్చించి ఒక అభిప్రాయమునకు వద్దాము. పత్రికలలో చర్చలు చూసితిని కాని ఏమి ప్రయోజనము?

ఉదాహరణకు మద్రాసు 'మెయిలు'లో అచ్చయిన వ్యాసమును తీసుకోండి. వ్యాసమంతా అపార్థలతో వ్రాయబడినది. అకాడమీ సమావేశ ఉద్దేశములను, దాని అభిప్రాయములను వ్యాసకర్త అపార్థము చేసుకున్నాడు. శృంగార కావ్యముల సమస్యను ఆయన సరిగా అర్థము చేసుకోలేదు. పత్రికలలో వ్రాతలు ఇలాగునే వుంటవి.

పత్రికలలో చర్చలవల్ల ప్రయోజనము సిద్ధించదు. వ్యక్తిగత సమావేశములు, చర్చల వలన భాషకు నిజమైన ఉపకృతి చేకూరగలదు. ఓటమి గెలుపులను లెక్కచేయక మర్మము విడచి మనసువిప్పి చర్చించు కొనవలెను.

నేను రచించిన గ్రంథములను మీకు పంపినాను. వ్యాకరణ సూత్రములను పాటించుతూ మీ ఆశయములను నేను సాధించినాను. ఆర్థిక చరిత్ర, రాధారాణి, మాధవ కంకణము మొదలైన నా గ్రంథములను మీరు పరిశీలించిన ఈ విషయం

తెలియగలదు. అవి బాగుగానే వున్నవనుకుంటాను. ఇపుడింకొక పుస్తకమును అచ్చువేయించుచున్నాను. అచ్చయిన వెంటనే మీకొక ప్రతిని పంపగలను. అవును నేను అందులో విరళముగా విసంధిని పాటించితిని.

మీరు ప్రభోధిస్తున్న సంస్కారణము వలన, గ్రామ్యశబ్దములను ప్రయోగించి, ఆ గ్రంధములను ప్రజలకు విడిచిపెట్టే అవకాశము కలుగుతున్నది. ఈ భాషనే ప్రభుత్వము ఆమోదించవలెనని మీ పట్టుదల. సరిగ్గా అదే ఎంతమాత్రమూ కూడదని నామతము. ఈ సారి వ్రాస్తే వుత్తరములో వివరముగా పేర్కొనగలను.

టి. సూర్యనారాయణరావు

☆ ☆ ☆

శ్రీ జి. వెంకటరంగారావు

ట్రిప్లికేన్
తేది: 2.7.1912

ప్రియమైన అప్పారావు గారూ,

జూన్ 30వ తేదీన మీరు వ్రాసిన జాబు అందింది. శృంగార రసవిషయమై మన దృక్పథమేమిటో మీరు శ్రీ జె. అచిన్యన్‌కు బోధపరిచినందుకు సంతోషం. బ్రౌణ్యం మీరు పంపించమన్నారని శ్రీ వెంకటేశ్వర్లుకు ఇదివరకే చెప్పాను. కాని ఇంకా పంపలేదు. ఆ విషయం మళ్ళీ హెచ్చరిస్తాను. బెంగాలీలో పారిభాషిక పదాలను గురించిన వివరాలు, రిప్పన్ కళాశాల ప్రిన్సిపాల్ మీకు తెలియ చేశాడా? పట్టిక అందినదా? అందకపోతే, మళ్ళీ ఒకసారి ఆయనకి ఉత్తరం వ్రాద్దురూ.

ఆనర్స్ పేపర్లు మీరు నాకు పంపనక్కరలేదు. వాటిని గురించి భోగట్టా అందేవరకు దాయండి. ఈ కమిషనును మన చెంతకు ఎందుకు పంపించాలో నాకర్థం కావడంలేదు. సంగతులు ఎప్పటికప్పుడు మీకు తెలియ పరుస్తూ వుంటాను. ప్రొఫెసరు రంగాచారి గారు నెమ్మది నెమ్మదిగా కోలుకొంటున్నారు. గండం గడిచి బయటపడినట్లే. మా బావమరిది సంగతి మరవరని తలుస్తాను. నేను చెప్పేవది, దయయుంచి జ్ఞాపకం పెట్టుకోండి. నారాయణమూర్తి మంగపతి నాయుడు గార్లకు నా నమస్కారాలని చెప్పండి. ఎస్టేటు ల్యాండు ఆక్టు విషయమై ఫౌలరు ఒక పెద్ద జవాబు వ్రాశారు.

☆ ☆ ☆

*బంగీయ సాహిత్య పరిషత్తు మందిర్,*
*243-1, అప్పర్ సర్క్యులర్ రోడ్డు,*
*తేది: 27 జూలై, 1912.*

ప్రియమైన రావు గారూ,

మీరు ఉదకమండలం నుంచి శ్రీ త్రివేదికి వ్రాసిన జాబు అందింది. అప్పుడు ఆయన పరిస్థితి అతి ఆందోళనకరంగా ఉంది. అప్పటికంటె ఇప్పుడు జబ్బు

కొంచెంనయంగా వున్నట్లనిపిస్తున్నా, ప్రమాదం మాత్రం తప్పిపోలేదు. ఎప్పుడూ ఆలోచిస్తూ ఏదో ఒకటి వ్రాయడం వలన ఆయనకి అమితమైన శ్రమ కలిగింది. నరాలన్నీ తోడుకు పోతున్నట్లు, తెగిపోతున్నట్లు బాధపుట్టింది. ఏమీ ఆలోచించవద్దని, పూర్తిగా విశ్రాంతి తీసుకోమని డాక్టర్లు హెచ్చరిస్తూన్నారు. కాగితం కలం ఆయన కంటపడనీయవద్దని మమ్మల్ని ఆదేశించారు. అందువలన ఆయనకు బదులు నేను మీ జాబుకు సమాధానం వ్రాయవలసి వచ్చింది.

శాస్త్రీయ సాంకేతిక ఆంగ్ల పదాలకు సమానార్థక పదాలను తెలిపే సంచికను, మేం మా మాతృభాషలో యింతవరకు వెలువరించలేదు. అయితే అలాంటి పదాలు చాలామటుకు, మా త్రైమాసిక పత్రికలో అపుడపుడు అచ్చు అవుతూ వచ్చాయి. మరికొన్ని పదాలను కొద్దికాలంలోనే ప్రచురించదలచుకున్నాము. రసాయనిక శాస్త్ర ఆంగ్ల పారిభాషిక పదాలను, వాటి సమానార్థకాలను ఒక పట్టికగా తయారు చేయాలని డాక్టర్ పి.సి.రే. ప్రయత్నిస్తున్నారు. సమానార్థక పదాలను సాధ్యమైనంత వరకు ప్రాచీన సంస్కృత గ్రంథాలనుండి సేకరించాలని, అవసరమైతే కొన్నిటిని సృష్టించుకోవాలని ఆయన సంకల్పం. వీటిని మా పత్రికలో ప్రచురిస్తున్నాము. ఇది వరకు మా పత్రికలలో ప్రచురితమైనవీ, ఇకముందు ప్రకటనకు సిద్ధముగా వున్నవీ, అన్నిటినీ ఒక సంపుటిగా అచ్చొత్తించాలని డాక్టర్ రే నిర్ణయించుకున్నారు. పదముల సృష్టికి, ప్రత్యేకం ఒక పండితుడు ఆయనకు సహాయపడతాడు. ఈ పారిభాషిక పదకోశమును వెలువరించడానికి రెండు మూడేళ్ళు పడుతుంది.

రేపు మా వంగీయ సాహిత్య పరిషత్తు వార్షికోత్సవం. మీ రడిగినవి మాకు లభ్యమైనంతవరకు సేకరిస్తున్నాను. ఇంతవరకు వెలువడిన మా ప్రచురణలను, సమాచారాన్ని సోమవారంనాడు మీకు పంపిస్తాను. ఈ పారిభాషిక పదాలను ఏయే సూత్రములపై సమకూర్చారో, మీకు తెలియ చేసేటందుకు, అందుకు సంబంధించిన ప్రచురణను మీకు అందచేస్తాను. ఈ సందర్భంలో నన్ను మీరు మన్నించినట్లయితే, ఒక విషయం మీ దృష్టికి తీసుకురావాలనుకుంటున్నాను. మా పత్రిక 13వ సంచికలో ఇదే విషయం మీద నేను వ్రాసిన వ్యాస మొకటి అచ్చుపడింది. ఆ వ్యాసంలో నేను కొన్ని సూచనలను కావించాను. నా సూచనలపట్ల మీ అభిప్రాయమేమో తెలుసుకోవాలని, కుతూహల పడుతున్నాను. పూర్తిసెట్టు పంపాలంటే, అన్ని భాగాలు దొరకడం లేదు. కొన్ని భాగాలు ఆనాడే అమ్ముడయిపోయాయి. ఎంత గాలించినా అవి లభించవు. మీ కొరక పూర్తిసెట్టు పంపలేక పోతున్నానని బాధపడుతున్నాను.

హేమచంద్ర దాసుగుప్త

☆ ☆ ☆

బంగీయ సాహిత్య పరిషత్ మందిర్,
243-1, అప్పర్ సర్కిల్ రోడ్,
కలకత్తా,
తేది: 27 జూలై, 1912.

ప్రియమైన రావు గారు,

ఉదకమండలం నుండి త్రివేది గారికి మీరు ఉత్తరం వ్రాసినందుకు చాలా ధన్యవాదాలు. మీ ఉత్తరం అందినప్పటికి త్రివేదిగారు చాలా జబ్బుతో ఉన్నారు. వాస్తవంగా చెప్పాలంటే ఆయనింకా చాలా జబ్బుతోనే ఉన్నారు. కొద్దిగా నయమైనప్పటికీ, నరాల వ్యాధితో ఆయన బాధపడుతూ ఉన్నారు. బహుశా చాలా ఎక్కువ మేధో పరిశ్రమవల్ల చాలా కాలం వరకు పూర్తిగా విశ్రాంతి తీసుకోమని ఆయనకు సలహా యివ్వబడింది. కలం కాగితం ఆయన దగ్గరకు చేరనివ్వడంలేదు. అంచేత ఆయన ఉత్తరానికి ఆయన తరపున నేను జవాబు వ్రాస్తున్నాను.

శాస్త్రీయ సాంకేతిక పదాలకు మాతృభాషలోని సమానమైన పదాలున్న ప్రత్యేక ప్రచురణలు ఏవీ మాకు రాలేదు. కాని, అప్పుడప్పుడు మా త్రైమాసిక పత్రికలో అటువంటి పట్టికలు వెలువడుతుంటాయి. ఇంకా కొన్ని ప్రచురణలో ఉన్నాయి. వీటిలో ఒకటి రసాయనిక సంబంధమైన పదాల పట్టిక, వాటి సమానార్థక పదాలతో పాటు ప్రచురింపబడుతుంది. డా. పి.సి.రే. పిహెచ్.డి. బి.యస్‌సి., సి.ఎఫ్.ఇ. (?) పాత సంస్కృత రచనల నుండి ప్రధానంగా స్వీకరించబడినవి. ఒక ప్రత్యేకమైన పుస్తకం ఆలోచనలలో ఉన్నది. దానిలో ఈ పదాల జాబితాలతో బాటు ఇవి ప్రచురింపబడుతాయి. మా త్రైమాసిక పత్రికలో ప్రచురింపబడినవి దీనిలో ఉంటాయి. ఈ పదాల కల్పనకు ఇప్పటికే ప్రవీణుల సహాయం కోరడం దానిని వారు అందజేయడం జరిగింది. పూర్తి పట్టిక రెండు మూడేళ్ళ కాలంలో రావచ్చును. మా వార్షిక సమావేశం రేపు జరుగుతుంది. ఈ ప్రచురణలు కొన్నిటిలో ఈ పట్టికను రూపొందించడంలో అనుసరింపబడిన సూత్రాలు మీకు లభిస్తున్నాయని ఆశిస్తున్నాను. ఈ సందర్భంగా మీరు నన్ను క్షమించినట్టయితే ఒక స్వీయ ప్రస్తావన చేయబోతున్నాను. ఈ పత్రిక XXIIవ సంపుటంలో నేను రాసిన వ్యాసం మీ దృష్టికి తీసుకు వస్తున్నాను. చేయబడిన సలహాల గురించి మీ భావాలేమిటో తెలుసుకోవాలని నేను చాల అభిలాషతో ఉన్నాను. కొన్ని భాగాలు చెడిపోవడం వల్ల పూర్తిగా సంపుటాలను పంపలేకపోతున్నందుకు విచారిస్తున్నాను.

భవదీయుడు,
హేమేంద్ర దాసుగుప్తా,
(సహాయ కార్యదర్శి)

(గమనిక: ఇటువంటిదే యింకో జాబు పాఠకులు, దీనికి ముందర చదివి వుంటారు – సంపాదకుడు)

☆ ☆ ☆

కె. నాగేశ్వరరావు,
సంపాదకుడు.

తంతి చిరునామా,
ఆంధ్రపత్రిక.

ఆంధ్రపత్రిక,
తెలుగు సచిత్ర వారపత్రిక,
ప్రతి బుధవారం ప్రచురణ,
109, ఫ్రీ రోడ్డు,
కొత్త, ప్రధాన తపాలా,
కార్యాలయం ఎదురుగా,
బొంబాయి,
తేది: 5.8.1912.

ప్రియ మిత్రమా,

మీరు దయతో రెండవ తేది ఉత్తరం వ్రాసినందుకు, బుక్‌పోస్ట్ ద్వారా ఆసక్తికరమైన వ్యాసం పంపినందుకు చాలా ధన్యవాదాలు. వచ్చేవారం సంచికలో అంటే మార్చి 13వ తేది సంచికలో ఆ వ్యాసం యావత్తూ వస్తుంది. పత్రికకు వాగ్దానం చేసినందుకు కూడ నా ధన్యవాదాలు. అవన్నీ పత్రికలో ప్రచురింపబడతాయి.

ఈ దిగువ కొద్ది పంక్తులు మీరు వేసినట్టయితే, ధన్యవాదాలు చెబుతాను. మీరు గొప్ప పండితులు, ప్రతిభావంతులైన రచయితలు కనుక ఈ ఉత్తరంలో నేను కోరుకున్నదేదో మీరు ఊహింపగలరు.

తెలుగు రచనలలో శైలిని గురించి మీరన్నదానితో నేను అంగీకరిస్తాను. నేను వాడుక భాష కాకుండా గ్రాంధికాన్ని ఎన్నుకున్న పెద్ద పాపాత్ముణ్ణి, దురదృష్టవశాత్తు నా తెలుగు భాషా జ్ఞానం తక్కువ. సంస్కృత భాషాజ్ఞానం కూడ కొద్ది మాత్రమే. ఆ తార్కిక పరిస్థితులకు ఇవే కారణాలు.

ఇంకోలోపం ఏమిటంటే – ఇది భాషలోనే అవగతమవుతుంది. సంస్కృత మూలాలు, పదాలు శాస్త్ర, విజ్ఞాన, సాంకేతిక పదజాలం భాషలో లోపించడం వర్తమానకాలంలో ఎన్నో సంస్కృత పదాలు ఉపయోగింపబడడం ప్రస్తుత పరిస్థితులకు కారణం. పాండిత్య ప్రదర్శన నిమిత్తం రచయితలు కావాలనుకోకుండానే, తమ రచనలలో వాడుక చేస్తారనుకుంటాను. ఇతర రచయితలు కొందరున్నారు. వీరు సాధారణంగా తమ గ్రంధాలలో ప్రాచీన ప్రామాణిక పదాలను, భావాలను వాడుక చేస్తుంటారు. మొత్తం మీద కేవలం ఉపయోగించడం కోసమే గ్రాంథిక భాషను తమ రచనలలో ఉపయోగించరు. మన యిప్పటి సంస్కృతి సహజ ఫలితం ఇది. లేదా సంస్కృతీ రాహిత్య ఫలితం ఇది.

గ్రాంథిక భాషను ఉపయోగించాలని వాదించే వారికి ఈ పరిస్థితి సబబైనది కాక పోవచ్చు. మీకు తరచు ఇటువంటి వారు తటస్థించరు. మన పాత గ్రంథకర్తలు ఆ భాషను ఉపయోగిస్తారు (మన ప్రస్తుత గ్రంథకర్తలు ఆ భాషనే వాడుక చేస్తున్నారు).

వాడుక భాష కొరకు వాదించే వారి స్థితి ఏమిటంటే, ప్రామాణిక భాషా శైలికోసం వాదించే వారి పరిస్థితి వంటిదే. ఈ రెండు తరహాల రచయితల మధ్య ఎటువంటి స్పర్ధలు ఉండకూడదు. తమ తమ ఆదర్శాలను అనుసరించి ఉభయులు భాషా సేవ చేయాలనుకున్నారు. కాని, గ్రాంధిక భాష ఉపయోగించే ప్రయత్నం, గ్రామ్య భాష ఉపయోగించే ప్రయత్నం రచయితల గమ్యంకారాదు. తమ భావాలకు సహజంగా అనుగుణమైన రూపంలో వ్రాయవచ్చు. కాని, దారితప్పి తమ కిష్టమైన వాడుక భాషా పదాలను ఉపయోగించడం వల్ల ప్రయోజనం ఏమీ ఉండదు. మీ రన్నట్టుగా గ్రామ్య భాషలోనే వ్రాయమని నా విజ్ఞాపన. కాని దయచేసి ఆ శైలిలో మీ భావాలను సైద్ధాంతిక ప్రాతిపదిక మీద మాత్రమే. ప్రత్యేక ప్రజ్ఞ చేయవద్దు. గొప్ప గ్రంథకర్తలందరూ తమ భావాలను స్పష్టమైన, సులభమైన భాషలో అప్రయత్నంగా రచనలు చేస్తారు. కొన్ని కొన్ని చోట్ల పాఠకునికి భావాలు కలిగేటప్పుడు (వాడుక భాషలో) మీరు వాడుక భాషను ఉపయోగించటానికి ప్రయత్నిస్తారు. వాడుక భాషపట్ల పక్షపాతాన్ని మానినట్లయితే. మీ రచనాధార చక్కగా అమరుతుంది. భాషాసేవా జరుగుతుంది.

అడగని అభిప్రాయాన్ని వెలిబుచ్చినందుకు క్షమించగలరని ఆశిస్తున్నాను.

భవదీయుడు,
కాశీనాథుని నాగేశ్వరరావు

*గమనిక:* గురజాడ, కాశీనాథుని నాగేశ్వరరావు గారు యిద్దరూ ఆంధ్రులు, ఆంధ్ర రచయితలు. అయినా ఇంగ్లీషులో వారిమధ్య జాబులు, జవాబులు జరుగుతాయి. — సం.

☆ ☆ ☆

శాన్‌థోమ్, మద్రాసు
తేది: *20.10.1912*

ప్రియమైన శ్రీ అప్పారావు గారూ,

మీరీపాటికి చెన్నపట్టణం వచ్చి వుంటారు. ఈ వారం లోపున ఏదో ఒక రోజున నన్ను కలుసుకునేందుకు మీకు తీరిక వుంటుందనుకుంటాను. వీలయితే మనం సెనేటు సమావేశానికి ముందు కలుసుకోవడం మంచిది. ఎలాగైనా తమ కనుకూలమైన పండితులను చొరబెట్టాలనే శ్రీ శేషగిరి అయ్యరుగారి ప్రయత్నం నెరవేరదు. మంచి పనికి అడ్డుతగలకపోవడమే, పండితులు చేసే ఉపకారం.

సిండికేటు ఈసారి అతి ప్రధానమైన ప్రతిపాదనలను చర్చించబోతున్నది. భారతీయ భాషలను గురించి క్షుణ్ణంగా ఆలోచిస్తున్నట్లు కనిపించదు. ఇంతవరకు 'ఎల్'ను ఫెల్లోగా గవర్నరు నామినేటు చేయలేదనుకుంటాను. ఇది అవసరమని గవర్నరుకు బోధపడినట్లు లేదు. ఆంధ్రులలో, యూరోపియనులలో తగిన సమర్థులు వున్నారు. మీరొకసారి వస్తే మనం మాట్లాడుకోవచ్చు.

మార్కు హంటర్

☆ ☆ ☆

కలకత్తా,
తేదీ: 12.12.1912

మిత్రమా,

నేనిక్కడ క్షేమముగా ప్రవేశించినాడను, మీరు మద్రాసుకు బయలుదేరి యుందురు. కావున దీనిని అక్కడికే పంపవలయునని ఇంగ్లీషు మనిషికి చెప్పి వారిపేర పంపుచున్నాను.

ఇంత వేగముగా మీకుత్తరము వ్రాయవలసిన పని లేకపోవును గాని, నిన్న నేను తొందరగా నజరుమహాలుకు బోవుచుండగా మీరు కొన్ని మాటలు సెలవిచ్చినారు. అందుకుత్తరము వెంటనే చెప్పలేకపోయినాను. మీవంటి పురుషుల ప్రశ్నములకు దగిన జవాబు చెప్పుటకు కొంతయాలోచన కావలెను. అప్పటినుండియు చిత్తమాయంశములందే కాపురముంది. యీ ఉత్తరము వ్రాయువరకు నుండబట్టినది కాదు.

మీరు నాయందు రెండు నేరములు మోపినారు. మద్రాసు మహజరుకు సంతకము చేయుట మత భేదము చేత మీకివి నేరములుగా గాన్పించుట న్యాయమే. కాని నాకెలాగు నేరములు? నే నొకరికేల భయపడవలెను. అమూల్యమైన మీ స్నేహము దీనివలన బోయనేని యీ పనులు తప్పే. కాని యది యింతటితో బోయెడి భాగ్యము కాదు; మీరును నాకభిప్రాయ స్వాతంత్ర్య మియ్యనంతటి సామాన్యులు కారు. ఒక్కచో నాపని నింద్యార్హమే యగును. మనమందరము సత్యప్రియులము. ఎంతటి సామాన్యుడును సత్యము దాటినప్పుడేదో మిష కల్పించుకు దాటును. గాని సత్యము నాకవసరములేదని చెప్పి తప్పడు. కాబట్టి నే చేసినపని యిదివరలో నా మతమును ప్రకటించుకొనిన దానికి విరుద్ధమయిన యెడలగాని సంతకములు చేయించుటకు తంటాలు పడుటలో నేనితరుల నిర్బంధించి వంచించినగాని నాయందు దోషారోపణ చేయవచ్చును. మొట్టమొదట నే తంటాలు పడనే లేదు. అవకాశములు నాకు వచ్చిన రోజునే మహారాజులుంగారు విజయనగరము వచ్చుట చేత నాకందును గురించి యాలోచించుటకైనను సావకాశము లేక రామానుజాచారికిచ్చి దొరికినన్ని సంతకములు సంపాదించుమని కోరినాను. మొన్నసాయంకాలము కొంతమంది తగు మనుష్యులు నాకు తటస్థమైనారు. వారి కాగితముల సంగతి కొంచెము బోధజేసి సంతకములు చేయు నిష్టమున్నచో జేయవలెనని యడిగినాను. అందుపై నొక్కరు అప్పారావుగారేమందురో అన్నారు. ఆ మాటవిని వారికిదివరకిచ్చియున్న సంతకముల ఫారము లాగికొందుమన్నంత యసహ్యము పుట్టినది. కాని తొందరపడక నన్ను నే వారించికొన్నాను. మరునాడు వారు (మరెవ్వరుగారు, అప్పయ్య) వట్టి కాగితము తీసుకువచ్చినప్పుడు సంతకము చేసినాడా లేదా యని కూడా చూడలేదు. మరియొకురు వాగ్వాదమున కారంభించినారు. వాదమసరము లేదు. ఇదిగో మహజరు చదివి చేసితే చెయ్యండి లేదా మానవచ్చునన్నాను. అక్కడికిని వారు వాదము మానకపోయేటప్పటికి నేను ప్రతివాదమాడినాను. అందున్నవారు కొందరొక పక్షము, మరికొందరు మరొక పక్షమైనారు. ఇంతకన్న నెక్కువ తంటాలు పడలేదు.

ఇక నే సంతకము చేయుటలో గలిగిన రండాగర్భ మేమో సెలవియ్యవలెను. నా మతము తమకు విశదమే. సలక్షణముగా గాని, తెలుగు వ్రాయగూడదని, లక్షణ విరుద్ధమైనది, బాలురు చదువగూడదని, లక్షణమన్న నేమో మొదలగు సంగతులు చర్చింపవలసిన చోటిదికాదు. మహజరు కోరినదియు నదియే. ఈ కోరికల నిలబెట్టుటకు మహజరుతో వ్రాసిన కొన్ని సంగతులు నాకు సహేతుకముగా గాన్పింపలేదు. అవి అబద్ధములనికూడ చెప్పగలను. అట్లని మహజరంతయు నిరసించుట న్యాయమా. ఇంతకు నా సంతకముకన్న బహిరంగముగా నా యభిప్రాయములను వెల్లడి చేయుటకు యత్నించి మద్రాసు మెయిలకు వ్రాసినాను కాదా? అలాగు వ్రాసిన యుపన్యాసమందలి వాదములు మహజరు వాదములును గొట్టి వేయునా, వేయవా? ఇంతకన్నా ధారళమైన ప్రవర్తన మరి యెవ్వరి యందైన గలదా? నా సంతకమును ఉపన్యాసమును దగ్గరబెట్టి విమర్శించి మరి నన్ను నిందించవలెను. నేను సంతకము చేసినా నన్న మాత్రముచే మీకు గోపము వచ్చినది. ఇంత పరమతాసహనము మీకుగూడదు. మీకు జడిసియే అప్పయ్య సంతకము చేసినాడు కాదు. నన్ను కూడ అలాగే చేయమన్నారా? అలాగు చేసితినేని మీకు నాయందు గౌరవముండునని మెంచవచ్చునా? లౌక్యుడవందురు కాబోలు. కాని సత్యవాది యనియునందురా? మీ జవాబు చూచుకొని నా సంతకము తొలగించుకోను.

మీరు మద్రాసులో పాడిచే పొడుపుకై యెదురు చూచుచున్నాను. రామయ్యను రెండు సంగతులలో గెల్చుకొందురు. కాని మెమోరియల్‌లోని విజ్ఞప్తి న్యాయము కాదని వాదించిరేని యాంధ్ర ప్రపంచమంతయు మీ తోకకు తాటాకులు కట్టక మానదు. ఒక్క శుభ (మీకశుభ) వార్త తమకు విన్నవించవలసియున్నది. శ్రీ శ్రీ శ్రీ విజయనగర మహారాజావారు మాపక్షము!!! ఇప్పుడు మా బలమెక్కువారు తలచుకొండి.

శ్రీనివాసయ్యంగారికి నా నమస్కారములు మనవిచేసి నాయుత్తరములకు జవాబియ్యనందుకు నాకు కలిగిన కోపము వారు కార్యసిద్ధిచేసినగాని తీరదని చెప్పవలెను. మీ యుభయుల సహాయము చేతను ఆ పని నెరవేరునని యాశపడుచున్నాను.

చిత్తగించవలెను.
ఎనమండ్ర నారాయణమూర్తి

షరా: ఎనమండ్ర నారాయణమూర్తి గారు గురజాడకు స్నేహితులు. కనుక కన్యాశుల్క నాటకానికి ప్రశంస లర్పించినారు. కాని అప్పటి మహారాజు గారికి వాడుక భాష – గ్రాంధిక భాషల వివాదంలో రెండవదానిపట్ల మొగ్గువున్నవారు. కాలేజీ ప్రిన్సిపాలు కిళాంబి రామానుజాచార్యులు గారు మొదట యిటువంటి అభిప్రాయంలో వున్నవారే. పై వ్యాసం గడ్డు గ్రాంధిక భాషలో రాసినది. తరువాత వాడుక భాషకు అండగా వున్నారు. పై ఉత్తరంలో శైలి సవరించాక జరిగింది – సంపాదకుడు.

☆ ☆ ☆

తిరువేంద్రం
తేది: 10 ఫిబ్రవరి, 1913.

ప్రియమైన అయ్యా,

మీరు దయతో వ్రాసిన ఉత్తరం అందింది. కాని నేనీ మధ్య ఊళ్ళో లేను. అందువల్ల వెంటనే మీకు సమాధాన మీయలేక పోయాను. 'సండే మెయిలు' సంపాదకుడు శ్రీ రాఘవ అయ్యంగారు విష్ణుచిత్తుని కాలమును గురించి పరిశోధించారు. విష్ణుచిత్తుడు, క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్ది నడుమ కాలమున వుండెనని ఆయన నిర్ణయం. ఆయన నిర్ణయంతో మనం ఏకీభవించవచ్చు.

మద్రాసు విశ్వవిద్యాలయము వారిచే, మీరు పొందిన గౌరవానికి నా అభివందనాలు. ఇంకా ఇలాంటి అనేక గౌరవములను మీరు పొందవలెనని నా కోరిక.

టి.ఎ. గోపీనాథరావు

☆ ☆ ☆

కోట, విజయనగరం
తేది: 7 ఫిబ్రవరి, 1913.

ప్రియమైన మహాశయా,

నిన్న మీరు దయతో రాసిన నోటు అందింది. ధన్యవాదాలు. నేను ఇప్పుడు నివసిస్తున్న ఇల్లు సంస్థానం వారిది. సుమారు 60 సంవత్సరాల క్రితం మహారాజు విజయరామరాజు సంపాదించినది. అద్దె లేకుండా 20 ఏళ్ళకు పైగా నేను కాపురం ఉంటున్నాను. అద్దె లేకుండా సంస్థానం వారి ఇళ్ళలో కాపురం ఉండడం ఉచితం కాదు. కొన్నేళ్ళ క్రితం తమ ఆధీనంలో పెట్టుకొని లేమ హక్కులు పొందడం జరగకుండా చేయడానికి ఇది జరిగింది. 5 రూపాయల అద్దె నిర్ణయించడం ఇది జరిగింది. ప్రతి సంవత్సరానికి రెండు మాసాల అద్దెను నేను చెల్లించాలి.

ఇల్లు చాలా పాతది. సదుపాయంగా ఉండదు. ఇంటినేల ఎత్తు, వీధి నేల ఎత్తుతో సమానంగా ఉంటుంది. ఇంటి నేల ఎత్తు, రోడ్డు ఎత్తు, ఇంటినేల ఎత్తుతో సమానంగా ఉంచరాదని ప్రతి సంవత్సరం పురపాలక సంఘం కంట్రాక్టరుతో పోరాడవలసివస్తుంది. పెరడు ఎత్తు రోడ్డు ఎత్తుకంటే తక్కువ. గదులు మూడే మూడు ఉన్నాయి. ఒకటి నేల మీద ఉన్న అంతస్థులోను, రెండోది మొదటి అంతస్థులోను ఉంది. నేను మొదటి అంతస్థులో ఉంటున్నాను. నా అల్మారా, పుస్తకాల అరలు రికార్డు పెట్టెలు బోల్డంత స్థలాన్ని ఆక్రమించుకున్నాయి. అందువల్ల కదలడానికి మెదలడానికి స్థలం ఉండటం లేదు. మా కుటుంబం ఒకరి నొకరు దగ్గరగా ఉండి నిద్రపోవాల్సి వస్తుంది. నేలమీద ఉన్న అంతస్థు పరిశుభ్రత లేని పరిస్థితిలో ఉంది. ఇవికాక వంటగది, భోజనాలగది, కొట్టుగది ఉన్నాయి.

1898–99 సంవత్సరాలలో మహారాణి మహారాజ కుమారికా సాహెబ్ వారి కోసం గంగానది తీరాన మెట్ల నిర్మాణం నా అజమాయిషీలో జరిగింది. మరుసటి

సంవత్సరం వారు కేదారఘాట్‌లో భవనం నిర్మించారు. 'కేదారఘాట్ భవనం నిర్మాణం పూర్తి అయ్యాక నేను విజయనగరంలో ఉంటున్న ఇంటిని నాకు ఇస్తానని మాట యిచ్చారు. కాని 1900 వ సంవత్సరంలో మేము కాశీ వెళ్లలేదు. మహారాణి వారు గృహప్రవేశం జరుపలేకపోయారు. నా కుటుంబం గ్రంథాలయం త్వర త్వరగా పెరిగిపోవటం వల్ల, వసతి విషయంలో చాల యిబ్బంది కలిగించింది. మహారాణివారు కొద్ది రోజులలో చనిపోతారనగా ఆ యింటిని నా కిమ్మని కోరాను. లేదా ఆ ఇంటిని అమ్మడానికి ధర్మకర్తలకు అనుమతించమని కోరాను. అలాగే చేద్దామని వారన్నారు. ఈ ఇంటికి తూర్పు ప్రక్కనున్న ఇంటిని ఇదే విధంగా కీర్తిశేషురాలైన నరసమ్మకు ఇచ్చారు. ఆమె రవేజార్ మహారాణిగారి పరిచారిక. ఇది చాల విలువైన స్థలం. కీర్తిశేషురాలైన మహారాణి కుమారిక మరణానంతరం దివాన్ బహదూర్ విజాపురపు అనంతరావు పంతులు గారికి ఇవ్వడం జరిగింది. ఆమె వాగ్దానం గురించి స్నేహితులకు చెప్పాను. వారు రాణివారికి తెలియజేసారు. ఆమె దయతో ఇంటిని పొందే అర్హత నాకుందని సెలవిచ్చారు. అంత్యక్రియల సమయంలో నాకు ఒక ఇంటిని ఇవ్వడానికి కొంత అవకాశం ఉందని నేను అనుకోకపోతే ఈ విషయాన్ని చెప్పేవాణ్నే కాను. తరువాత ఈ విషయం వదలి పెట్టేసాను. రాణీవారికి ఇటువంటి విజ్ఞప్తిని నేను చేయడం కీర్తిశేషురాలైన మహారాణివారు నేను కోరకుండా చేసింది. ఇది సున్నితమైన విషయం. ఆమె సొమ్ము ఖర్చు కాకుండా చేయాలని నా కోరిక. వారితో నాకు సంబంధాలు కేవలం సేవక సంబంధాలు కాకూడదని నా కోరిక.

సొమ్ము ఎంతో నిర్ణయం కాకపోయినప్పటికి వారసత్వపు దావా అపీలు సందర్భంగా మీకు చెల్లించడం, దయతో మీరు ఆమోదించారని లా' బ్రాంచ్ సూపరిన్‌టెండెంట్ నాకు చెప్పారు. నా పని నిమిత్తం చెల్లించిన మొత్తంలో భాగంగా ఇంటి ధరను మీరు దయతో చెల్లించినట్లయితే, దానిని కొనగలుగుతాను. దాని వెల పదిహేనువందల నుండి రెండువేల వరకుంటుంది. ఈ ప్రతిపాదనను మీరు ఆమోదించినట్లయితే, ఈ ఇంటి అమ్మకానికి దయచేసి ఏర్పాటు చేయవలసిందని నా విజ్ఞప్తి. అప్పుడు నేను మరమ్మత్తులు కొత్త నిర్మాణాలు నా ఖర్చుతో చేయగలుగుతాను. నేను దీర్ఘమైన ఉద్యోగ కాలంలో డబ్బు నిల్వచేయలేక పోయాను. మీరు ఉదారంగా నాకు సాయపడకపోతే నేను ఆ ఇంటిని కొనలేను.

(* ఈ వుత్తరానికి అప్పారావుగారు ఎవరి పేరూ రాయలేదు. సందర్భానుసారంగా పాఠకులే వూహించుకోవాలి.)

☆ ☆ ☆

మదరాసు,
*తేది: 8 ఏప్రియల్, 1913.*

ప్రియమైన అప్పారావు గారూ,

మీరు మార్చి 28వ తేదీన వ్రాసిన ఉత్తరం అందింది. ఈనెల 29వ తేదీన

సెండికేటు సమావేశం జరుగుతుంది. ఆ సమావేశంలో అన్ని బోర్డ్సాఫ్ స్టడీస్‌ల విధానాలు రూపొందుతాయి. నేనా సమయంలో ఉదకమండలంలో వుంటాను. కనుక, సమావేశానికి హాజరు కాగలనో లేనో ఇప్పుడప్పుడే చెప్పలేను. హాజరైతే మాత్రం మీ ప్రతిపాదనల పట్ల విధిగా శ్రద్ధ వహిస్తాను. కాని అవి అన్నీ అంగీకృతమౌతాయో లేవో నాకు సందేహం. నిబంధనలను అనుసరించి బోర్డులు పన్నెండుగురు సభ్యులకే పరిమితం. తగినంత కారణం వుంటే తప్ప, పాత సభ్యులనే నామినేట్ చేస్తారు. ఇది ఒక ఆచారం.

సంస్కృత భాషలో డాక్టర్‌హాల్ మంచి పండితుడేనా? సమర్థుడే నంటారా? మీరు కోరుతున్నట్లు సంస్కృత ఉత్కళ, బర్మీస్‌లను వేరు వేరు శాఖలుగా విడదీయడానికి, నిబంధనలు మారవలసి వుంటుంది. అవి మార్చుకోనిదే ఇందుకు వీలులేదు. దేనికది విడదీయమని, బోర్డు తనంతతాను ప్రతి పాదించడం మంచిదని నా ఊహ.

12వ తేదీన ఉదకమండలం వెళుతున్నాను. అక్కడ క్లబ్‌లో నా బస.

శ్రీ ఇ. డబ్ల్యు. మిడిల్ మాస్టు

☆ ☆ ☆

అడయార్, మదరాసు,
తేది: *11 డిసెంబరు, 1913.*

ప్రియమైన అయ్యా,

నేను జనవరి 30, 31 వ తేదీలలో వాల్తేరులో వుంటాను. విజయనగరం రావలెనని అనుకోవడం లేదు. వాల్తేరులో నన్ను ఏ రోజున ఏ సమయంలో కలుసుకునేందుకు మీకు వీలున్నదో తెలియచేస్తే నేను తీరిక చేసుకుంటాను.

హోరాల్డు స్టూవర్టు

☆ ☆ ☆

*30, బహిర్ మీర్జాపూరు రోడ్డు,*
*కలకత్తా,*
*తేది: 21 జనవరి, 1914.*

ప్రియమైన అయ్యా,

నేను విజయనగరం నుంచి బయలుదేరి వచ్చేముందు మిమ్మల్ని మళ్ళీ ఒకసారి కలుసుకోలేక పోయాను. అందుకెంతో విచారిస్తున్నాను. మళ్లీ ఒకసారి కలుసుకుని భారతీయ భాషలలో అనుసరించదగు శైలిని గురించి, ఆధునిక బెంగాలీ భాషా ధోరణులను గురించి, మీతో నేను ప్రసంగించి వుండవలసింది. కాని, ఆ అవకాశం లేకపోయింది. టాగూరు ఒక వ్యాసం వ్రాస్తామన్నారు. ఆయనకా విషయం జ్ఞాపకం

చేయమని, నేను విశాఖపట్టణంలో వుండగానే, శ్రీ రామానంద చటర్జీకి ఉత్తరం వ్రాసాను. ఇక్కడకు వచ్చిన వెంటనే శ్రీ చటర్జీని కలుసుకుని ఈ విషయం ప్రస్తావించాను. మీరు కోరిన విషయాలను సేకరించి మీకు పంపలేకపోతున్నందుకు ఒకవంక సిగ్గుపడుతూనే వున్నాను. కాని, నా వాగ్దానం త్వరలోనే, నెరవేర్చుకుంటాను. మెస్సర్సు బి. బెనర్జీ అండ్ కో వారొక చిన్న పుస్తకాన్ని ప్రచురించారు. మీరు నాతో చర్చించుదామనుకున్న విషయాలు కొన్ని అందులో వున్నాయి. ఆ పుస్తకం దొరికిన వెంటనే మీకు పంపించి, నా వాగ్దానం నిలబెట్టుకుంటాను.

విజయనగరం, విశాఖపట్నాలలో నేను వున్న ఆ స్వల్ప కాలంలో, నేనొక విషయాన్ని గ్రహించగలిగాను. అక్కడి పండితులు రెండు వర్గాలు. మొదటి వర్గం వారి పద్ధతి అతి ప్రాచీనం. సాహిత్య రచనలో ఏ మాత్రపు ప్రాచీన పద్ధతులు సడలినా, వారు సహించరు. మార్పుకు వారు విముఖులు. రెండవ వర్గంవారు సుముఖులు. కనక ఈ ఇరు తెగలవారికి అన్నిటా చుక్కెదురు.

ఒకప్పుడు బెంగాలీ భాష స్థితి ఇలాగే వుండేది. పదాడంబరంతో పడికట్టు రాళ్ళవంటి శబ్దాలతో సమానపు బిగింపులతో వచన రచన అధ్వాన్నంగా తయారయింది. విభక్తి ప్రత్యయాలను మాత్రం మార్చి అనుస్వార విసర్గ క్రియారూపాలను సర్దుబాటు చేసుకుని, సంస్కృత శబ్దాలను దస్సాకు దస్సాదించి పండితులు భాషను కృతకం కావించారు. ఈ క్రియా పదాలు సైతం సంస్కృత వ్యాకరణ సూత్రాలకు విరుద్ధంగా కటువుగా సృష్టి అయేవి. పండితులు వ్రాసే కృతక వచన శైలి ఇటు ప్రజలకు అటు విద్యావంతులకు అర్ధంకాక, కొరకరాని కొయ్యగా రూపొందింది. కాగా, ఎవరి ఆదరణ లభించక, గ్రంథాలలో మేట వేసుకుపోయింది.

ఇలాంటి పరిస్థితులలో రాజా రామమోహన్‌రాయ్ చదవతగ్గ వచనాన్ని సృష్టించాడు. దానిని విద్యాసాగరుడు అనుసరించి, వ్యాప్తిలోనికి తెచ్చారు. అయితే ఈయన శకం స్వతంత్ర కల్పనలకు యోచనకు అస్కారం లేక అనువాదాలతోనే గడిచి పోయింది. ఇది కేవలం అనువాద యుగం. అందువల్ల విద్యాసాగరుని శైలి, సంస్కృత వ్యాకరణ మర్యాదల, భాషా సంప్రదాయాల సంకెళ్ళను తెంచుకుని బయటపడలేక పోయింది. కాగా ఆ భాష విద్యావంతులలో వ్యాప్తి చెందినా, ప్రజలకు సన్నిహితం కాలేదు.

టేక్‌చంద్ సర్వస్వతంత్రుడు, అత్యంత సాహసి. ఆయన నిండు ధైర్యంతో నిజమైన స్వాతంత్ర్యేచ్ఛతో తిరగబడ్డాడు. ఈ నియమాలను ఉల్లంఘించాడు. ఆయన భాషా ప్రవాహాన్ని తనకభిముఖంగా తిప్పుకుని, దానిని పండితులపై తిప్పికొట్టాడు. పద్యసాహిత్యంలో మైకేలు మధుసూదనదత్తు ఏ విధంగా పురోగమించాడో, అదే విధంగా టేక్‌చంద్ గద్యసాహిత్యంలో ముందడుగు వేశాడు. ఈనాడు మీరు ఆంధ్రసాహిత్యంలో బహుశా ఏయే పరిణామాలను కోరుతున్నారో, వాటిని ఆనాడు ఆయన వంగ సాహిత్యంలో సాధించాడు.

టేక్‌చంద్ తరువాత అంతకంటె గొప్పధీశాలి ప్రభవించవలసి వుంది. అలా ప్రభవించిన పురుషుడు, బంకిమ చంద్రుడు. ఆయన కాలంలో మరి ఇద్దరు ప్రసిద్ధి కెక్కిన రచయితలు వుండేవారు. ఒకరు కాళీప్రసన్న ఘోష్; ఇంకొకరు చంద్రనాథబోస్,

ఘోష్‌గారిది తూర్పు బెంగాలు – బోసుగారిది పశ్చిమబెంగాలు. అయితే వీరిద్దరూ పరిశుద్ధతావాదులు.

ఇప్పుడు విద్యాసాగరుని భాషాపద్ధతి పాతబడిపోయింది. టేక్‌చంద్ నవ్వుడు కాదు. పూర్వకాలపు మనిషి. శుద్ధ 'అతల్' శైలిలో అందరికి అభిరుచిపోయింది. ఇంకా బంకిమచంద్రుడు సాహిత్యంలో బ్రతికివున్నాడు. వ్రాసే, మాటలాడే, గ్రంథములలో పత్రికలలో వాడే భాషలను గురించి వివాదం జరుగుతూనే వుంది. వాద ప్రతివాదాలు, ఖండన మండనలు సాగుతూనే వున్నాయి. వాడుక భాషను గ్రామ్యమని, నింద్యమని కొందరు పండితులు నేటికీ అంటూనే వున్నారు. ఇంతవరకు ఏ నిర్ణయమూ జరగలేదు.

మీరూ నేనూ మనమంతా, జవమూ జీవమూకల భాష కావాలని వాంఛిస్తున్నాము. అంటే ఆ భాష పరిపూర్ణమైనదిగా వుండాలని మన ఆశయం. (అ) ప్రజలకు సాధారణ జ్ఞానాన్ని కలిగించే (ఆ) పారిశ్రామిక, వైజ్ఞానిక, కళారంగాలలో కృషి చేస్తున్న విద్యార్థులకు సాంకేతిక జ్ఞానాన్ని ప్రసాదించే (ఇ) పండితులకు ఉదాత్త భావాలను, ఆదర్శాలను జ్ఞానాన్ని ప్రబోధించే (ఈ) ప్రసన్న గంభీరమధుర కావ్య సృష్టికి దోహదపడే అన్నివిధాలా అర్థమైన భాషను, భాషాశైలిని సృష్టించుకోవాలని మనం కృషి చేస్తున్నాము. ఈ కృషి ఫలించాలని సాహితీ పరులంతా ఆశిస్తున్నారు. ఈ ఆశయంతోనే వారు సాహిత్యాన్ని ఆరాధిస్తున్నారు. దైనందిన జీవితంలో నిత్యమూ చెవిని పడుతున్న మాటలను, సులభంగా అర్థమయే సరళ పదాలను, నుడికారాన్ని సాహితీపరులు స్వీకరిస్తున్నారు. వారు తమ పుస్తకాలలో వాడుతున్న భాష రైతులకు రాజులకు పూజారులకు, పురోహితులకు అందరికి సుపరిచమైనట్టిది. అందులో ఏమాత్రం సందేహం లేదు. ఇప్పుడు బెంగాలులో రచయితలు సరళ సుబోధక శైలిని అనుసరిస్తున్నారు. మామూలు మాటలతో అర్థగాంభీర్యాన్ని సాధిస్తున్నారు. ఇలాంటి సరళ భాషను వాడుతూ రచనలో కృతకృత్యులు కావాలంటే, మాటల పొందిక, ఇమిడిక అవసరంకదా. సొగసయిన పదాలను ఎంచుకోవడంలో, వాటిని అర్థవంతంగా ప్రయోగించడంలో రచయితకున్న నేర్పును బట్టి అతని శైలికి అందం అమరుతుంది. ఆఖరికి నింద్యమని అపభ్రంశమని పండితులు ఈసడించే శబ్దాలను సైతం, అశ్లీలతాదోషం అంటనీయకుండా, సమర్థుడైన రచయిత ప్రయోగించవచ్చును.

భాష నాజూకుగా, ఠీవిగా వుండాలి. ఆడంబరం అందమీయదు. జటిలపద ప్రయోగం వల్ల భాషా సౌకుమార్యం కలగదు. తేటమాటలతో నాగరికమైన అనుభవాలను, ఉదాత్త భావాలను వ్యక్తపరచాలి. శైలి సహజ ప్రవాహంవలె ఉరకలెత్తుతూ అనుభూతులను కలిగిస్తూ హృదయంపై చెరగని ముద్రలను వేయాలి. శైలి అందం ఇలా ఇలా వుండాలని సిద్ధాంతీకరించి చెప్పడం సులభమే. కాని, ఈ అందాన్ని అలరించడం కష్టం. అక్కడే వస్తుంది అడ్డు.

నిఘంటువుల, పండితుల, వైయాకరణుల సహాయం అవసరం లేకుండా, చదవగానే అందరికీ అర్థమయ్యే విధంగా, భాషను సంస్కరించవలెనని మీ ఆశయం. అదే నేటి సమస్య. మనమంతా భాషా సంస్కరణను కోరుతున్నాము. అంటే దాని అర్థం భాషా గాంభీర్యాన్ని స్నిగ్ధసౌందర్యాన్ని మనం పోగొట్టుకుంటున్నామని కాదు.

పైగా దాని సౌకుమార్యాన్ని ఇనుమారు తెచ్చుకుంటున్నాము. దాని ఫాయిదాను, వడ్డీ ఫాయిదాలతో లెక్కకట్టి చెల్లించి, సంపన్నవంతం చేయాలంటున్నాము. మనదేశంలో ఋజువర్తనగల మీ వంటి ధీశాలురు, భాషా సంస్కరణ సమస్యను తరచి తరచి అవలోకిస్తున్నారు. సంతోషం!

ఇప్పటికే నా ఉత్తరం అనుకోకుండా పెరిగిపోయింది. ఇక ఇంతటితో ఆపివేస్తాను. మీరు ఆంధ్రసారస్వత రంగంలో తలపెట్టిన ఉద్యమం ఫలించాలని మీరు విజయం సాధించాలని ఆశిస్తూ నా జాబును ముగిస్తున్నాను.

జ్ఞానేంద్ర మోహన్‌దాసు

☆ ☆ ☆

ఎడ్మిరాల్టి హౌస్,
తేది: 26 ఏప్రిల్, 1914.

ప్రియమైన వెంకట్రామయ్య గారు,

నేను ఎగువనున్న పై విలాసంలో మద్రాసులో ఉంటున్నాను. ఈ నెల చివర వరకు అక్కడే వుంటాను. మే 1వ తారీఖున కూనూరు బయలుదేరుతాను. 29వ తేదీన నా మద్రాసుపై విలాసానికి పంపినట్టయితే, నేను కృతజ్ఞుడ్ని రిజిస్టర్ పార్శిల్లు ఒకరోజు ఆలస్యంగా చేరుతాయి. కాబట్టి అవి నాకు మే ఒకటవ తేదిన అందుతుంది.

(* ఈ వుత్తరానికి అప్పారావుగారు ఎవరి పేరూ రాయలేదు. సందర్భానుసారంగా పాఠకులే వూహించుకోవాలి.)

☆ ☆ ☆

ఎక్కహిల్ హౌస్,
ఉదక మండలం,
తేది: 7.5.1909

ప్రియమైన కవిరాజా,

కన్యాశుల్కము అచ్చు ఫారములను మీకు పంపమని ప్రచురణ కర్తలకు జాబు వ్రాశాను. దయవుంచి నాటకముపై ఒక సమీక్షను వ్రాసి ప్రముఖ తెలుగు పత్రికలలో ప్రచురింపించండి. ఇతివృత్త స్వీకరణలో, నిర్వహణలో, హాస్యరసపోషణములో, పాత్రోన్మీలనములో, తెలుగు సాహిత్యములో ఇది అత్యుత్తమ నాటకమనే విషయాన్ని మరవకండి.

మీరూ అమ్మాయి కులాసాగా వున్నారని తలుస్తాను. మీ నాటక సమీక్షను 'ఆంధ్ర ప్రకాశిక'కు పంపమని నా కోరిక.

(హరికథాపితామహులు ఆదిభట్ల నారాయణదాసు గారికి గురజాడ రాసిన ఉత్తరం)

☆ ☆ ☆

రామ్‌ఘర్,
కుమోన్ హిల్సు,
*తేది: 24 మే, 1914.*

ప్రియ మిత్రమా,

మీ దయగల ఉత్తరానికి ధన్యవాదాలు. నేను నా మేధా శక్తిని చాలకాలం నుంచి వెచ్చింపవలసి వచ్చింది. అందువల్ల చెదిరిన నా శక్తులను కూడదీసుకునేందుకు ఆత్మ సమ స్థితిని పొందేటందుకు నేను ఇక్కడ, ఈ హిమాలయ ఏకాంత స్థలంలో విశ్రాంతి తీసుకుంటున్నాను. ఇది నా కత్యంత ప్రధానమని మీరు సులభంగా అర్థం చేసుకోగలరు. కొంతకాలం వరకు మరే విషయంపై నేను, నా దృష్టిని సారించలేను. మీరు నన్ను అర్థం చేసుకుంటారని మీ కోరికను ప్రస్తుతం నెరవేర్చలేక పోతున్నందుకు, నన్ను మన్నించగలరని నా నమ్మకం.

రవీంద్రనాథ ఠాగూరు.

☆ ☆ ☆

మచిలీపట్నం
*తేది: 20.6.1914.*

ప్రియమైన అప్పారావు గారూ,

మీ వ్యాసములను పత్రికలలో చదువుతున్నాను. జయంతి రామయ్యగారివల్ల భాషాభివృద్ధి జరగదు. తెలుగు అకాడమీ స్వరూపం మారితీరాలి. శబ్దశాస్త్రాన్ని మధించిన గిడుగు రామమూర్తిపంతులు గారివంటి దిగ్గంతులు మనకు అవసరం. నిఘంటు వ్యవహారం అతి అసహ్యకరంగా తయారయింది. జరుగుతున్న జాప్యం అంతా యింతా కాదు. నిఘంటు నిర్మాణం గురించి కొవ్వూరు న్యాయవాదులు శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు వ్రాసిన వ్యాసం మీరు చదివి వుంటారు. ఇది మీ స్వంత విషయంగా భావించి మీరు పూర్తి బాధ్యత వహించకపోతే నిఘంటు నిర్మాణం జయప్రదం కాదు. మీరిప్పటికే వృద్ధులయి పోయినారు. వెనుకటి ఓపిక లేదు. చరిత్ర రచన అలాగునే వుంచి వేసినారు. ఇతర వ్యాపకాలు తగ్గించుకొని, మీరు తలపెట్టిన చరిత్రను పూర్తిచేయడం మంచిది. దానినీ నిఘంటువును దేశానికి మీరు సమర్పించాలి. మీరనుకుంటున్న విశాఖ జిల్లా చరిత్ర త్వరలో వెలువడితే, అది యితర జిల్లాల వారికి ఆదర్శ ప్రాయంగా వుంటుంది. మీ ఆరోగ్యం ఎలాగ వుంది? విజయనగరం ఎప్పుడు వెళతారు?

వి. సూర్యనారాయణగారు

☆ ☆ ☆

సెనేటు హౌస్,
మదరాసు,
తేది: 27.4.1914

ప్రియమైన శ్రీ అప్పారావు గారూ,

మీరు 26వ తేదీన వ్రాసిన లేఖను అనుసరించి మీ రిమార్కులు ప్రూఫును ఆఫీసులో అందరూ చదివారు. అది చాల స్పష్టంగా వుంది. కొన్ని టైపు తప్పులు మాత్రం అక్కడక్కడ దొర్లాయి. పూర్తి డాక్యుమెంటు వచ్చేవారం పంపగలననుకుంటాను.

ఫ్రాన్సిస్

☆ ☆ ☆

38 లాంగ్‌రిడ్జి రోడ్డు,
లండను, యస్.డబ్ల్యు.
తేది: 20 అక్టోబరు, 1914.

ప్రియమైన శ్రీ అప్పారావు గారూ,

దయతో మీరు వ్రాసిన ఉత్తరం అందింది. కృతజ్ఞుణ్ణి. మీకు అస్వస్థతగా వున్నందుకు నాకెంతో దిగులుగా వుంది. ఈ సరికి కొంత నయమైవుంటుంది. ఋతువు మారుతున్నది. కనుక వచ్చే శీతకాలం గడిచే సరికి మీకు నిమ్మళిస్తుంది. పూర్తిగా కోలుకుని ఎప్పటిలా మీరు హాయిగా వుంటారు. భయంకర సంఘటనలతో నిరంతర ఆందోళనలతో జీవితం నిండివుంది. అది తప్ప, అంతా మామూలుగానే వుంది. నేను కులాసాగా వున్నాను.

మీరడిగిన సమాచారం త్వరలోనే మీకు తెలుపుతాను. నా స్నేహితుని ఉత్తరం కోసం ఎదురుచూస్తున్నాను. త్వరలోనే అన్నాను. కాని త్వరలో ఏమౌతుందో ఎవరికెరుక? భవిష్యత్తు ఏమి ప్రసాదించనున్నదో ఎవరమూ చెప్పలేము. పారిస్‌లో వున్న నా స్నేహితుడు అసాధారణ బాధ్యతను నిర్వహిస్తున్నాడు. సరాసరి యుద్ధరంగంతో అతనికి ప్రత్యక్ష సంబంధం వుంది. సైనిక దళాలకు ఆధ్వర్యం వహిస్తున్నాడు. తుపాకులతో పని. ఇంతవరకు క్షేమంగానే వున్నాడు. మొన్నను ఆ మధ్య అతనికి విరేచనాలు పట్టుకున్నాయి. అయితే అదృష్టవశాత్తు అది ఆసియా వాసులకు వచ్చేమాదిరిది కాదు. కాని అతని పరిస్థితి ఎప్పుడూ ప్రమాదకరమే కదా!

నేను ఫ్రాన్సు నుంచి ఇక్కడికి వచ్చి పదిహేనురోజులయింది. అక్కడ వున్నన్నాళ్ళు ఎక్కువ కాలం పారిస్‌లో గడిపాను. నాకు రెడ్‌క్రాస్ కమిటీలో పని. ఇక యిక్కడ అట్టే రోజులు వుండను. నాలుగయిదు రోజుల్లో బయలుదేరాలి. ఈసారి పారిస్‌కాదు, మరెక్కడికో ప్రయాణం. జీవితం చిత్ర విచిత్రంగా వుంది. అన్నీ వింత వింత అనుభవాలు, తలుచుకుంటున్న కొద్దీ తమాషా. ఆ యుద్ధ దృశ్యాలను వాతావరణాన్ని వర్ణించి మీ కళ్ళకు కట్టలేను. కాని పారిస్‌లో వుండగా ఒకసారి

హఠాత్తుగా ఇరవై ఎనిమిది బాంబులు దబదబపడ్డాయి. నగరం దద్దరిల్లిపోయింది. అటుఇటు ఊగిపోయింది. బాంబులు పడిననాడు నేను నగర సమీపంలో వున్నాను. ఆ ఘోరదృశ్యం ఇప్పటికీ నా కళ్ళకు కట్టినట్లుంది. కాని, ఒక సంగతి, పూర్వంలా ఫ్రెంచి పౌరులు భయవిహ్వలులు కాలేదు. హఠాత్తుగా పడే బాంబులకు అలవాటు పడిపోయారు. ఇది వరకు అలాకాదు. అస్తవ్యస్తమై ఎక్కువ నాశనం సంభవించేది.

మా సైనికదళం ఎక్కడకు వెళ్ళినా మన్ననలను పొందుతోంది. కష్టాలలో వున్నపుడు ఆదుకునేందుకు వస్తున్నామనే భావం సర్వత్ర వెల్లివిరుస్తోంది. నిస్సహాయస్థితిని చక్కబరిచేందుకు సైనికులు నియుక్తులయారనే అభిమానం కనిపిస్తోంది. రెండు దేశాల మైత్రీభావం పరస్పరం పెంపొందుతోంది. సైనికులకు పౌరుల సహకారం అన్నిటా లభిస్తోంది. యుద్ధంలో విజయానికి ఇది అత్యావశ్యకమని నా భావం.

నేను ఫ్రాన్సులో వుండగా ఒక భారతీయదళం ఆర్లియన్స్‌కు పయనమయింది. అది అక్కడ నిఘాచేస్తుంది. కందకాలను తవ్వుకుని బలమైన స్థావరాలను ఏర్పరచుకోవడం ఈ యుద్ధంలో ఒక ముఖ్య వ్యూహం. ఈ వ్యూహరచనలో ఈ భారతీయ సైనిక దళానికి ప్రత్యేకమైన శిక్షణ యిచ్చారు. లార్డుకిచిన్ సర్వవిధాల సమర్థుడు. తక్కువ మంది సైనికులతో ఎక్కువ ఫలితాన్ని సాధించడం అతని లక్ష్యం. ఏ మాత్రం ప్రాణ నష్టం జరగనీయడు. అతి జాగ్రత్తగ వ్యూహాన్ని నడుపుతాడు. పూర్తి శిక్షణ పొందిన భారతీయ సైనికులకు సాటిరాగల సైనికులు మరెక్కడా కనిపించరు. మొత్తం యుద్ధ రంగంలో వారికి వారే సాటి.

ఫ్రాన్సులో నా యుద్ధానుభవాలను తెలుపుతూ మహారాజా వారికి ఉత్తరం వ్రాస్తున్నాను. దానితోపాటు కొన్ని ప్రభుత్వ ప్రచురణలు పంపిస్తున్నాను. అవి మహారాజా వారికంటె మీకూ విజయనగరం స్నేహితులకు ఎక్కువ ఆసక్తిని కలిగిస్తాయని నా నమ్మకం. వాటి వివరాలను ఆయనకు తెలియజేస్తారని ఆశిస్తాను.

ఈ యుద్ధానికి జర్మనులే బాధ్యులు. ఆ సంగతి నేను పంపుతున్న పత్రాలు చదివితే మీకు తేటపడుతుంది. మొదట దాడి చేసింది మిత్రమండలే అయినా, యుద్ధ ప్రేరేపకులు మాత్రం జర్మనులే. అందులో అనుమానం లేదు. ఎవరినీ కవ్వించని వారిమీద దురన్యాయంగా, క్షమించరాని దురాక్రమణ బుద్ధితో జర్మనులు యుద్ధాన్ని ప్రేరేపించారు. ఇది సహించరాని దురాక్రమణకు వ్యతిరేకంగా ఆత్మరక్షణార్థమై సాగుతున్న యుద్ధం. యుద్ధ పరికరాలను తయారు చేసుకోవడంలో, యుద్ధ నైపుణ్యాన్ని పెంపొందించుకోవడంలో, జర్మనులకంటె, మిత్రమండలి దేశాలు వెనకబడివున్న మాట నిజం. అయితే ఇలా వెనకబడి వుండడమే ఆదేశాల గొప్పతనం. అలా పెంపొందించుకోవడమే జర్మనులకు అవమానకరం. యుద్ధ పరికరాలను వాళ్ళల్లాగ పెంపొందించుకోనందుకు మేం నిజంగా గర్వించవచ్చుననుకుంటాను. మరి మీ ఉద్దేశం? నాతో ఏకీభవించరా? మేం ఆయుధ సామగ్రిని, సైనిక బలాన్ని వాళ్లల్లా పెంపొందించుకోలేదు. అందుకు మాకు శక్తి లేక కాదు. మాది అత్యుత్తమమైన నాగరికత. అందువల్ల మేం వెనకతీశాం. అదే విధంగా మా సామ్రాజ్యాధిపత్యంలో వున్న దేశాలన్నీ ఒకేమాట మీద నిలబడి వున్నవీ అంటే, దానికి కారణం మా నిష్పక్షపాతవైఖరి. అతి సున్నితమైన వ్యవహార దక్షత. ఈ యుద్ధంలో భారతదేశం

ఇంగ్లండుకు తోడ్పడి చరిత్రలో మన్ననల పొందాలి. గౌరవమైన పద్ధతులతో ఈ రెండు దేశాల సంబంధం అభివృద్ధికి రావాలి. మా పరిపాలనలో అనేకలోట్లు, దోషాలు వుండ వచ్చును. నిజమే అయినా మనం వేరు అనుకోరాదు. భారతీయులు ఇలాటి స్వల్ప విషయాలను మరచిపోయి, మొత్తం యుద్ధాన్ని దృష్టిలో పెట్టుకొని ఆలోచించాలి. అలా ఆలోచించే గొప్పతనం భారతీయులకు ఎప్పుడూ వుంది. ఈ సమయంలో ఈ రెండు దేశాలవారు ఎవరిభావాలను వారు చూసుకుంటే సమయం మించిపోతుంది. ఇరుదేశాల జాతులు పరస్పర సాన్నిహిత్యం పెంపొందించుకోవడం ఎంతో మేలు. ఇది భారతదేశంలో నా అనుభవం.

దయవుంచి నన్ను మిత్రులందరికి జ్ఞాపకం చేయండి. మీకు వ్యవధివుంటే ఒక ఉత్తరం వ్రాయండి.

హెచ్.డి. డరెల్

☆ ☆ ☆

అండర్ సన్ హౌస్,
నుంగం బాకం,
మద్రాసు,
తేది: 9.12.1915

ప్రియమైన రామదాసు గారు,

మీ తండ్రిగారు, నాకు మిత్రులు అయిన జి.వి. అప్పారావుగారి మరణవార్త విని ఎంతో విచారించాను. నేను ఎంతో గౌరవించే నడవడి, భావాలు ఉన్నవారు, ఆయన సారస్వత భాషాధ్యయన విషయంలో ప్రత్యేకించి దక్షిణ భారత సారస్వత భాషాధ్యయనంలో, ముఖ్యంగా ఆయన మాతృభాష తెలుగు అధ్యయన విషయంలో ఆయన అద్భుతమైన కృషి చేశారని నా నమ్మకం. ఈ కృషిలో ఆయన ఎంత వ్యతిరేకతను ఎదుర్కొనవలసి వచ్చెనో అంత దురవగాహన కూడ ఎదుర్కోవలసి వచ్చింది. అయినప్పటికీ ఆయన నిబ్బరం చెడలేదు. ఆరోగ్యం చెడుతూ వున్నప్పటికీ ఆయన ఎంత పట్టుదలగా కొనసాగించారు. ఆయన మరణించడం వల్ల మద్రాసు విశ్వవిద్యాలయంలో ద్రావిడ భాషాధ్యయనానికి తీరని నష్టం కలిగింది. కాని, ఆయన అడుగుజాడ అనుసరించడం నింపాదిగా జరుగుతుంది.

మీరు ఉత్తరం వ్రాసినందుకు నా ధన్యవాదాలు. ఈ దుఃఖ సమయంలో నా ప్రగాఢ సానుభూతిని అప్పారావుగారి కుటుంబానికి అందజేయవలసిందిగా నా విజ్ఞాపన.

భవదీయుడు,
మార్క్ హంటర్.

☆ ☆ ☆

హఠాత్తుగా ఇరవై ఎనిమిది బాంబులు దబదబపడ్డాయి. నగరం దద్దరిల్లిపోయింది. అటుఇటు ఊగిపోయింది. బాంబులు పడిననాడు నేను నగర సమీపంలో వున్నాను. ఆ ఘోరదృశ్యం ఇప్పటికీ నా కళ్ళకు కట్టినట్లుంది. కాని, ఒక సంగతి, పూర్వంలా ఫ్రెంచి పౌరులు భయవిహ్వలులు కాలేదు. హఠాత్తుగా పడే బాంబులకు అలవాటు పడిపోయారు. ఇది వరకు అలాకాదు. అస్తవ్యస్తమై ఎక్కువ నాశనం సంభవించేది.

మా సైనికదళం ఎక్కడకు వెళ్ళినా మన్ననలను పొందుతోంది. కష్టాలలో వున్నపుడు ఆదుకునేందుకు వస్తున్నామనే భావం సర్వత్ర వెల్లివిరుస్తోంది. నిస్సహాయస్థితిని చక్కబరిచేందుకు సైనికులు నియుక్తులయారనే అభిమానం కనిపిస్తోంది. రెండు దేశాల మైత్రీభావం పరస్పరం పెంపొందుతోంది. సైనికులకు పౌరుల సహకారం అన్నిటా లభిస్తోంది. యుద్ధంలో విజయానికి ఇది అత్యావశ్యకమని నా భావం.

నేను ఫ్రాన్సులో వుండగా ఒక భారతీయదళం ఆర్లియన్స్‌కు పయనమయింది. అది అక్కడ నిఘాచేస్తుంది. కందకాలను తవ్వుకుని బలమైన స్థావరాలను ఏర్పరచుకోవడం ఈ యుద్ధంలో ఒక ముఖ్య వ్యూహం. ఈ వ్యూహరచనలో ఈ భారతీయ సైనిక దళానికి ప్రత్యేకమైన శిక్షణ యిచ్చారు. లార్డుకిచిన్ సర్వవిధాల సమర్థుడు. తక్కువ మంది సైనికులతో ఎక్కువ ఫలితాన్ని సాధించడం అతని లక్ష్యం. ఏ మాత్రం ప్రాణ నష్టం జరగనీయడు. అతి జాగ్రత్తగ వ్యూహాన్ని నడుపుతాడు. పూర్తి శిక్షణ పొందిన భారతీయ సైనికులకు సాటిరాగల సైనికులు మరెక్కడా కనిపించరు. మొత్తం యుద్ధ రంగంలో వారికి వారే సాటి.

ఫ్రాన్సులో నా యుద్ధానుభవాలను తెలుపుతూ మహారాజా వారికి ఉత్తరం వ్రాస్తున్నాను. దానితోపాటు కొన్ని ప్రభుత్వ ప్రచురణలు పంపిస్తున్నాను. అవి మహారాజా వారికంటె మీకూ విజయనగరం స్నేహితులకు ఎక్కువ ఆసక్తిని కలిగిస్తాయని నా నమ్మకం. వాటి వివరాలను ఆయనకు తెలియజేస్తారని ఆశిస్తాను.

ఈ యుద్ధానికి జర్మనులే బాధ్యులు. ఆ సంగతి నేను పంపుతున్న పత్రాలు చదివితే మీకు తేటపడుతుంది. మొదట దాడి చేసింది మిత్రమండలే అయినా, యుద్ధ ప్రేరేపకులు మాత్రం జర్మనులే. అందులో అనుమానం లేదు. ఎవరినీ కవ్వించని వారిమీద దురన్యాయంగా, క్షమించరాని దురాక్రమణ బుద్ధితో జర్మనులు యుద్ధాన్ని ప్రేరేపించారు. ఇది సహించరాని దురాక్రమణకు వ్యతిరేకంగా ఆత్మరక్షణార్థమై సాగుతున్న యుద్ధం. యుద్ధ పరికరాలను తయారు చేసుకోవడంలో, యుద్ధ నైపుణ్యాన్ని పెంపొందించుకోవడంలో, జర్మనులకంటె, మిత్రమండలి దేశాలు వెనకబడివున్న మాట నిజం. అయితే ఇలా వెనకబడి వుండడమే ఆదేశాల గొప్పతనం. అలా పెంపొందించుకోవడమే జర్మనులకు అవమానకరం. యుద్ధ పరికరాలను వాళ్ళల్లాగ పెంపొందించుకోనందుకు మేం నిజంగా గర్వించవచ్చుననుకుంటాను. మరి మీ ఉద్దేశం? నాతో ఏకీభవించరా? మేం ఆయుధ సామగ్రిని, సైనిక బలాన్ని వాళ్లల్లా పెంపొందించుకోలేదు. అందుకు మాకు శక్తి లేక కాదు. మాది అత్యుత్తమమైన నాగరికత. అందువల్ల మేం వెనకతీశాం. అదే విధంగా మా సామ్రాజ్యాధిపత్యంలో వున్న దేశాలన్నీ ఒకేమాట మీద నిలబడి వున్నవీ అంటే, దానికి కారణం మా నిష్పక్షపాతవైఖరి. అతి సున్నితమైన వ్యవహార దక్షత. ఈ యుద్ధంలో భారతదేశం

'ఎత్తు లంగరు' రాసేటప్పటికి లోకస్థితి, కవి మనస్థితి పూర్తిగా మారాయి. గురజాడ ఆత్మావలోకం చేసుకున్నారు. ఆరోగ్యం కోలుకోవడానికి వీలుకానంతగా చెడింది. ఆశ అడుగంటింది. "...ఇకనేమి లోకము చాలు, చాలును, లంగ రెత్తుము" అనక తప్పిందికాదు.

జీవితనౌక తీరందాటి వెళిపోయిందెక్కడికో. కాని, దాని సారధి గొంతు గత 90 ఏళ్ళుగా వినిపిస్తూనే వుంది. కాలాలు మారినా వినిపిస్తూనే ఉంటుంది.

★ ★ ★



కీ.శే. గురజాడ వెంకట అప్పారావుగారి తృతీయ కుమార్తె,
శ్రీమతి పులిగెడ్డ అప్పల కొండాయమ్మ



గురజాడ కుమారుడు గురజాడ రామదాసు



గురజాడ తండ్రి గురజాడ రామదాసు



గురజాడ స్మారక జిల్లా కేంద్ర గ్రంథాలయం, విజయనగరం


రాయవరం ఊరు


రాయవరంలో గురజాడ స్మారక మందిరం మరియు గ్రంథాలయం



విజయనగరం మహారాజా కోట ముఖ దృశ్యం



గురజాడ చదివిన, పనిచేసిన (లెక్చరర్‌గా) విజయనగరం
మహారాజా వారి కళాశాల

# దినచర్యలు

## 1895

* *3-1-1895* *
గురువారం

నువ్వు చెప్పిన దాన్ని నమ్మకు, చూసిన దానిని సగమే నమ్ము.

జనవరి నెలకి నాకు రావలసిన పైకం షరాబు దగ్గర నుండి ఇంతకు ముందు తీసుకున్నాను. సోమరాజు బావగారికి ఈ దిగువ నున్న ప్రకారం పైకం ఇవ్వవలసిందిగా ఉత్తరం వ్రాశాను. పది రొక్కం రాజమ్మకు. 20 స్టాంప్‌ల కోసం రిజిస్ట్రేషన్ ఫీజు. మందుల కోసం 10 రూపాయలు. గుర్రం పద్దు కోసం 150 రూపాయలు. పెళ్ళి కోసం తీసుకు వెళ్ళిన వస్తువుల కోసం 23. ఆక్స్‌ఫర్డ్ పుస్తకాలు 8. మొత్తం 211 రూపాయలు.

ఈ రాత్రి కోటలో ఫ్యాన్సీడ్రస్ విందు.

☆ ☆ ☆

* *5-1-1895* *
శనివారం

కృష్ణాజిల్లాలోని వీరవల్లి స్టేషన్ దగ్గర ఒక చెరువుంది. దాని గట్టు మీద తుమ్మ, ఈత చెట్లు. రాజమండ్రి చేరువలో గోదావరికి అవతల ప్రక్క ఇంకొన్ని చెరువులున్నాయి. రోడ్డు వెంబడిని అంతటా పచ్చగడ్డి అక్కడక్కడ మొలిచి ఉంది. తుమ్మ చెట్లు మొలిచి ఉన్నాయి. ఏపుగా మొలిచి ఉన్నాయి. తుమ్మ మాన్లు, పచ్చిక మొలచిన నేల బెజవాడ సమీపంలో ఉన్నాయి. అక్కడ పెరిగే గడ్డి పొడవాటిది. అదేమిటో? బెజవాడలో చీమచింత చెట్లు అక్కడక్కడ...

☆ ☆ ☆

* *7-1-1895* *
సోమవారం

నవంబరు, డిసెంబరు నెలలకు జీతం తీసుకోవాలి. మద్దాల వెంకటరత్నం, నెం.7 కాలేజ్, మైలాపూర్. సుందరరావు 293 తంబుచెట్టి చెంగయ్య.

☆ ☆ ☆

* *9-1-1895* *
బుధవారం

విజయనగరం నుండి సాయంత్రం ఆరుగంటలకు బయలుదేరాను.

☆ ☆ ☆

* *10-1-1895* *
గురువారం

| | | |
|---|---|---|
| 20 రూపాయలు మద్రాసు నోట్.నెం. | T.43 | 90416 |
| 10 రూపాయలు | T. | 29936 |
| 10 రూపాయలు | T/16 | 22403 |
| 10 రూపాయలు | T/42 | 36930 |
| 10 రూపాయలు | T/41 | 55410 |

పాగ్‌సన్స్ వీటిని వ్యవసాయంలో వెయ్యాలి. ఉదయం 6 గంటలకు రాజమండ్రి చేరాను.

☆ ☆ ☆

* *11-1-1895* *
శుక్రవారం

విజయనగరం మహారాజు వారి రైలు బండిలో బెజవాడకు బయలుదేరాను. ఉదయం పూట 7 గంటలకు. మాధవరావుగారు నేనెరిగిన ఉత్తమోత్తములలో ఆయన ఒకరు. తన కుర్రవాడ్ని పెంచడంలో ఆయన చాల శ్రద్ధ తీసుకుంటాడు.

☆ ☆ ☆

* *12-1-1895* *
శనివారం

ఇంకా తోవలోనే ఉన్నాం. నంద్యాల దాటింది రైలు. చక్కని ఊరు. అక్కడ ఉపహారం పశుగ్రాసంలా ఉంది. అక్కడక్కడ కొత్తగా కొట్టిన అడివిప్రాంతాలు. ఆముదం విత్తనాలు నాటారు. మొక్క తరహా బాగా పెరుగుతుంది కంది. ఎరువు వేసినట్టు లేదు. మట్టి మంచిది కాదు. ఆముదం విత్తనం ఏపుగా పెరుగుతుంది.

☆ ☆ ☆

* *13-1-1895* *
ఆదివారం

మద్రాసు చేరుకున్నాం. అడ్మిరాల్టీ హౌస్ చక్కని స్థలం. మహారాజులుంగారు మొత్తం భవనం అంతటినీ తిప్పి చూపారు. నేల మీద, ఇళ్ళ మీద పెట్టుబడి పెట్టడం మంచిదని మాకు కొంత బోధపర్చారు. రాజధాని నగరంలో భవనాన్ని

కొన్న మొట్ట మొదటి మహారాజాయన. ఆయన వెంబడినే యితర మహారాజులు కొన్నారు. ఇందువల్ల నగరం వృద్ధి అవుతుంది. మహారాజావారి భవనం అతిచక్కని భవనంగా పరిగణింపబడుతుంది. ఇందుకు బలరామస్వామి నాయుడు గార్ని చాల మెచ్చుకోవాలి. చూడ ముచ్చటైన మహారాజుగారికి తగిన భవనం యిది.

☆ ☆ ☆

* *14-1-1895* *
సోమవారం

చంగయ్య పంతులు వచ్చారు. ఫూల్‌బాగ్ అభివృద్ధి చేయాలి. భవనం విషయం కాదు గాని అది చూడ ముచ్చటగానే ఉంది. తోటనింకా అభివృద్ధి చేయాలి.

☆ ☆ ☆

* *16-1-1895* *
బుధవారం

కేశానపల్లి నర్సింగరావు పంతులు మామగారు సాయంత్రం పూట వచ్చారు. బలరామస్వామి నాయుడుగారు 6 రూపాయలు నాకు ఇచ్చారు. 17,18,19 జనవరి ఖర్చుల కోసం. నేను దీన్ని ఆయన్ని అడగలేదు.

☆ ☆ ☆

* *17-1-1895* *
గురువారం

మహారాజులుంగారు రామమూర్తి పంతులుకు నాకు సూట్లు కుట్టించడానికి ఏర్పాటు చేశారు. అవిధంగానే జరిగింది. డబల్ బ్రెస్ట్ లేత ఎరుపు కోటు నా ఖర్చుతో కుట్టించుకోడానికి ఆర్డరిచ్చాను.

☆ ☆ ☆

* *18-1-1895* *
శుక్రవారం

మాధవరావుగార్ని నేడు చూస్తున్న కొద్దీ ఆయన పట్ల నా గౌరవం హెచ్చుతూ వుంది. నరసింహం దగ్గర నుండి ఉత్తరం. నెం. 32, తంబు చెట్టి వీధి.

☆ ☆ ☆

* *19-1-1895* *
శనివారం

జె.యం. గ్లీసన్ ఎస్క్వైర్, తోటల సూపరెంటెండెంటు, సెయింట్ జార్జి కెథడ్రెల్ రోడ్డు, తేనాంపేట,

ఎన్.కృష్ణారావు, బోర్‌హన్ అండ్‌కో, పోస్ట్ బాక్సు నెం. 151.
మాధవరావుగారు ఈవేళ 27రూపాయలు అప్పు ఇచ్చారు.

☆ ☆ ☆

** 20-1-1895 **
**ఆదివారం**

బెజవాడ ఉదయం పూట చేరాం. విజయనగరంలోని మా కుటుంబం గురించి ఏవేవో ఆలోచనలు. బెజవాడ ఇంద్రకీలాద్రి పర్వతం దిగువనుంది. శ్రీకృష్ణవిజయం గ్రంథకర్త అయిన రాజుగారు దాన్ని ఎంతో మమకారంతో వర్ణించారు. కృష్ణానదికి రెండు ప్రక్కల నది ఎర్రరంగు నీటితో నిండి వుంది. నగరం అవతలగా ఉంది. వెనుకన కొండలు, కనకదుర్గ గుడి ఒక లోయలో ఉంది. రైలు స్టేషన్‌కు దగ్గరగా బంగ్లాలు. ముచ్చటగా కన్పిస్తున్నాయి. నాకు ఆతిథ్యమిచ్చిన పాటిబండ్ల వెంకటరామయ్య పంతులుగారి ఇల్లు గవర్నరు పేటలో ఉంది. కొండలు ఉన్నంత దూరంలో ఉందది. ఎక్కువ ఆరోగ్యవంతంగాను ఆ ఇల్లు ఉందనుకుంటారు. ఆయన సంస్కృత పండితుడు. తరువాత ఇంగ్లీషు చదువుకున్నారు. ఆయన పెద్ద లాయరుగా ఉన్నారు లేదా ఉండేవారు. ఎటువంటి దర్పము కానరాదు. ఇంటికి పెద్ద ఆవరణ. అది తనకు తానుగా నిలిచి ఉంది. నేనుండడానికి ఇచ్చిన గది కిటికీ, తలుపులున్నాయి. అవి కృష్ణానది ఎదురుగా. కృష్ణానదికి, బందరు కాలువ ఎదురుగుండా ఉన్నాయి. ఒడ్డున వరుసగా చెట్లు. ఇటువంటి ఇల్లు నాకుంటే బాగుంటుందని నా కోరిక. ఈ ఏడాది ఏవో నెలల్లో ఉద్యోగ విరమణ చేస్తాను.

ఈ పదం ఎరగని పదంలాగా ఉంది. ఆరోగ్యం పాడైపోయిన మనిషికి ఇది ఇంచుమించుగా అర్థరహితం. కాని, బలహీనంగాను లేదా బలంగాను ఎలాగో ఒకలాగున ఏకాంత ప్రదేశంలో విశ్రాంతి తీసుకుంటాడు. కాని, నా విషయంలో మెదడు పని లేకుండా ఉండడం నాకు అసాధ్యం. ఊరికే ఉండమని ఇచ్చే సలహా తిరస్కరించాను. ఏపనీ చేసే శక్తి లేనప్పుడు ఇక జీవించడం వృథా. ఇది వేరే విషయం. నేను గ్రామసీమ అయిన దేవరపల్లిలోను లేదా అటువంటిదే ఇంకో స్థలంలోను విశ్రాంతి తీసుకుంటాను. ఏడాదిలో కొన్ని నెలల్లో ఇవన్నీ నాకు జ్ఞాపకం వచ్చాయి.

భూపతిరాజు దీపపు మసి (కత్తెర) మర్చిపోయాడు. శాసనాలకు సంబంధించిన ఏ విషయాన్ని మర్చిపోవద్దని ప్రతి ఒక్కరికి నేను చెప్పాను. వీటిని కట్టకట్టి నా సామాన్లతో విజయనగరానికి పంపించాను.

రామస్వామి చెట్టి అండ్‌కో వారు, సంపత్ చెట్టి నాకు దుకాణాదారులుగా కాకుండా స్నేహితులుగా ఉన్నారు. మద్రాసులో ఆయన సహాయం అమూల్యం. కావలసింది ఏ వస్తువయినా సరే తనకు సంబంధించినది కాకపోయినప్పటికి, నేను బయలుదేరినప్పుడు నాకు ఆయన ఎంతో సహాయం చేసారు. ఆయన పలుకుబడి లేనట్టయితే, రైలు తప్పిపోయి ఉండేవాడ్ని. ఆయన కంపెనీ ఇంకా వృద్ధి కావాలని నా కోరిక. యూరోపియన్ కంపెనీలను ఆయన మించిపోవాలని నా కోరిక.

ఇప్పటికే అచ్చుపనిలో వాళ్ళను మించిపోయారు. గవర్నమెంట్ సూపరెండెంటు మిస్టరు మార్కర్ ముద్రణ గురించి ఒక పుస్తకం వేయాలనుకున్నారు. మద్రాసులో అన్ని కార్యాలయాలకి దాన్ని పంపారు. నమూనా ప్రతులు పంపించమన్నారు. రామస్వామి చెట్టి అండ్ కో వారు ఉత్తమమైన ముద్రకునిగా ఎంపికయ్యారు. ఈ దుకాణం బయటకు గొప్పగా ఉండదు. ఈ చెట్టిగార్లు గౌరవమైన కుటుంబానికి చెందినవారు, ధనవంతులు. వారి పెద్ద తండ్రి(?) మద్రాసులో మొట్ట మొదటి స్థానికుల అంగడి పెట్టారు.

శ్రీనివాసాచారిగారు సంపత్ చెట్టిగార్ని నాకు పరిచయం చేసారు.

నేను బెజవాడ తిరిగివచ్చాను. ఒకప్పుడది పెద్ద నగరమై ఉండాలి.

కృష్ణా(?) సైనిక ప్రాముఖ్యం దృష్ట్యా మంచి బలమైనదానిగా భావింపబడుతుంది. కృష్ణదేవరాయలు కొన్ని రోజులు ఇక్కడ బసచేశారు. ఆముక్తమాల్యద విజయ వాటిన్ కొన్ని దినంబులుండి వాటి.... మాధవవర్మ స్థాపించారు. పూసపాటి వారి కోట అను స్థలం బెజవాడ నగరంలో ఉంది. ఇప్పుడీ స్థలంలో ఇళ్ళు కట్టడం జరిగింది.

మహారాజులుంగారు మద్రాసులో వదలి పెట్టిన చరిత్ర గ్రంథాల పట్టిక.

1. పరిపాలనకు సంబంధించిన మద్రాసు మాన్యువల్
2. భారతదేశపు ప్రాచీన భూగోళశాస్త్రం – కన్నింగ్‌హామ్ సంపుటంI
3. కొన్స్ రాసిన హిందుస్తాన్,
4. ఓర్మె రాసిన హిందుస్తాన్ చరిత్ర సంపుటం II
5. బెంగాల్ సైన్యం గురించి బ్రౌన్ రాసిన గ్రంథం
6. లార్డ్‌క్లయివ్ గురించి మాల్కమ్ సంపుటాలు II, III
7. బ్రిటిష్ రాజ్యం గురించి అల్‌బెర్ సంపుటాలు II, I
8. గోదావరి జిల్లా చరిత్ర (మాన్యువల్)
9. భారతదేశం గురించి ఫుల్ ఆర్డర్
10. డా రాసిన హిందుస్థాన్ సంపుటాలు I, II
11. ఎలిఫెన్‌స్టన్ గ్రంథం భారతదేశం
12. కొన్ – మొగల్ సామ్రాజ్యం
13. లార్డ్‌క్లయివ్ గురించి గ్లియిచ్
14. బ్రిటిష్ భారతదేశం గురించి గియిచ్ సంపుటాలు III, IV
15. ఫ్రేజర్ – విశ్వసనీయుడైన మన మిత్రుడు నైజాం
16. బ్రిటిష్ రాజ్య ప్రారంభం ఎలిఫెన్‌స్టన్
17. బెల్ – భారతదేశంలో సామ్రాజ్యం
18. మెకాలే రచనలు – సంపుటం II
19. లైట్ జగేడ్ – భారతదేశం రెండు ప్రతులు
20. షెరింగ్ – హిందూ తెగలు, కులాలు
21. పోప్ రచన, భారతదేశ చరిత్ర గురించి పాఠ్య గ్రంథం
22. వీలర్ – భారతదేశ చరిత్ర
23. మెడోస్ టైలర్ భారతదేశ చరిత్ర గురించి విద్యార్థులకు గ్రంథం

24. సీమెన్ – జ్ఞాపకాలు
25. నీచే – ప్రాచ్యఖండంలో బ్రిటిష్ ప్రపంచం
26. ఐదవ నివేదిక – మద్రాసు రాజధాని – రెండు సంపుటాలు
27. కేంబ్రిడ్జ్ – కోరమండల్ తీరంలో యుద్ధం. రెండు సంపుటాలు
28. సెయింట్ జాన్ – ప్రాచ్యఖండంలో బ్రిటిష్ విజయాలు
29. టాడ్ – రాజస్థాన్ సంపుటాలు II, I
30. లయల్ – భారతదేశంలో బ్రిటిష్ వలసలు
31. పూర్వకాలంలో మద్రాసు – లీలర్

మహారాజులుంగారు మద్రాసులో వదలిపెట్టిన చరిత్ర గ్రంథాల పట్టిక. 44 గ్రంథాలు.

మహారాజులుంగారి కోసం నేను కొన్నవి ఆరు. నేను ఉపయోగిస్తున్న మహారాజావారి పుస్తకాలు 12. నేను కొన్న పుస్తకాలు మొత్తం 78.

ఈ పుస్తకాలన్నింటిని తెనిగించటం అవసరం కాదు. కేవలం తెలుగు పాఠకులకు ఇంగ్లీషు వచ్చిన వారికి ఇవి చదివి అర్థం చేసుకోవడం కష్టం. పై వాటి పట్టికలు (యథాతథంగా) ఉన్నవి ఉన్నట్టుగా ఇస్తున్నాము. వాటి వివరాలు మొదలైన విశేషాలు రాబోయే తరాల వారికి ఉపయోగపడవచ్చును.

విజయనగరం కోట గ్రంథాలయంలో ఎన్నో గ్రంథాలు బీరువాలలో ఉన్నాయట. తాళాలు వేసి ఉంచారట. అవి ఎవరు సేకరించారో మనకు తెలియదు. బహుశా పుస్తక ప్రియుడైన ఆనంద గజపతిగారివి కావచ్చును.

☆ ☆ ☆

*** *21-1-1895* ***
**సోమవారం**

మహారాజులుంగారు బి.ఏ. గురించి తన అభిప్రాయాల్ని నాకు చెప్పారు. ఎన్నికల వ్యవహారం గురించి కూడ. ఉదయపూర్ దివాన్ పన్నాలాల్‌జీకి స్వాగతం ఇచ్చాను. [ఈయన వృద్ధులు, ఆరోగ్యంగా, చిరునవ్వుతో ఉన్నారు. ఆయన తాతగారు ఉదయపూర్ నుండి మహారాజులుంగారి తండ్రికి ఉత్తరం రాశారు. మహారాజులుంగారు తమ కుర్చీలోంచి కొద్దిగా లేచి ఆయనతో కరచాలనం చేశారు. కుడి ప్రక్కనున్న కుర్చీలో కూర్చోమన్నారు. దివానుగారు ఐదు రూపాయలు దిగముడుపు (ఇది తెలుగు అక్షరాలలో రాసినది) ఇచ్చారు.

రామానుజాచారిగారికి సెలవు కోసం రాసాను. (విజయనగరం మహారాజా కాలేజీ ప్రిన్సిపాల్)

☆ ☆ ☆

* *22-1-1895* *
మంగళవారం

శేషగిరిశాస్త్రి, నార్త్ మాడా స్ట్రీట్, మైలాపూర్.
రంగయ్య శెట్టి, గోవిందప్పనాయకన్ స్ట్రీట్.
సి.ఆర్. సుబ్బారావు సబ్ అసిస్టెంట్ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్,
293 బ్రాహ్మణవీధి, సైదాపేట.
మిస్టర్.ఇ. హాల్డ్స్ ద్వార పి.హెచ్.డి.
ప్రిన్సిపాల్ కె. రామానుజాచార్యులుగారికి టెలిగ్రామ్ పంపాను.

☆ ☆ ☆

* *24-1-1895* *
గురువారం

చెంగయ్య పంతులుగారి చిరునామా 293.

☆ ☆ ☆

* *25-1-1895* *
శుక్రవారం

నా కజిన్‌కు 9 రూపాయలు అప్పు ఇచ్చాను.

☆

* *26-1-1895* *
శనివారం

బి. సూర్యనారాయణ పంతులుగారి నుండి ఐదు రూపాయలు అప్పు పుచ్చుకున్నాను. కుంచె కోసం ఇంకో రూపాయి కూడ అప్పు పుచ్చుకున్నాను.

☆ ☆ ☆

* *27-1-1895* *
ఆదివారం

6 రూపాయలు ఆబ్దికం కోసం ఇచ్చాను. ఇంకో రూపాయి వెంకటరత్నం పంతులు గారికి ఇవ్వాలి. జి.వి.సుబ్బారావు 99, హైకోర్టు, పెరిస్ భవనాలు. ఇంకో అర్ధ రూపాయి ఖర్చు చేశాను. అంతా బాగా జరిగిపోయింది.

☆ ☆ ☆

* *28-1-1895* *
సోమవారం

కుంచె కోసం ఇంకో రూపాయి అప్పు.

☆ ☆ ☆

* *30-1-1895* *
బుధవారం

దినభత్యం కోసం 12 రోజులుకు అడిగాను. 19వ తేది నుండి 30వతేదీ వరకు. ఆయన అడ్వాన్స్‌గా 25 రూపాయలు ఇచ్చారు. సీతారామయ్య వంటవాని కోసం ప్రయాణ ఖర్చులు కూడ. రెండవ తరగతి టిక్కెట్ కోసం 29 రూపాయలు.

☆

* *31-1-1895* *
గురువారం

శ్రీనగర్, కాశ్మీర్ గోవింద కౌల్, సహజ భట్. మహారాజులుంగారు విజయనగరానికి బయలుదేరారు. మున్సీగారు పెట్టె కోసం ఒక రూపాయి ఇచ్చారు. వంటసామాన్లు కొనడానికి ఐదు రూపాయలు. నర్సింగరావు 19 రూపాయలు భత్తెం కోసం ఎక్కువగా ఇచ్చారు. 19వ తేదీ నుండి ఫిబ్రవరి 12 వరకు 25 రోజులకు మొత్తం 25 రూపాయలన్నమాట.

☆ ☆ ☆

* *1-2-1895* *
శుక్రవారం

దర్జీకి 8 రూపాయలిచ్చాను. టెలిగ్రామ్‌కి 12 అణాలు, టోపు 2 అణాలు, టి.ఎ.టిఫిన్ 7 అణాలు, కుంచెమల్ రూ.4–10 అణాలు.

☆ ☆ ☆

* *2-2-1895* *
శనివారం

| | |
|---|---|
| నెయ్యి | 0–4–6 |
| ఇంట్లో టిఫిన్ కోసం | 0–2–0 |
| రొట్టె, వెన్న, కాఫీ | 0–8–0 |
| డి.ఎ. | 0–0–6 |

ప్రూఫ్‌ల కోసం 2 కార్డులు, మధ్యాహ్న భోజనం, రాత్రి భోజనం, మధ్య మూడు దోసెలకు 11 అణాలు, కాఫీ, రొట్టె 8 అణాలు. టెలిగ్రాం, పోస్ట్ ఖర్చులు, పేకెట్ల కోసం $2\frac{1}{2}$ అణాలు, పుస్తకాల కోసం 10 అణాలు.

☆ ☆ ☆

* *3-2-1895* *

భోజనాల మధ్య

☆

* *4-2-1895* *

| | |
|---|---|
| రెండో మోతాదు | 6 drops (drs) |
| (duching-2) డూచింగ్ | 7 అణాలు |
| టెలిగ్రామ్ | 1 రూ. |
| నోటుపేపరు | 1.12 అణాలు |

☆ ☆ ☆

* *5-2-1895* *

పోస్టేజి 4 అణాలు. ఒక అణా అదనపు ఖర్చు, ఒక అణా పోస్టేజి, 7 అణాలు టిఫిన్, 3 అణాలు దువ్వెన, మూడు రూపాయలు టిఫిన్ (సెట్) గిన్నెలు.

☆ ☆ ☆

* *6-2-1895* *

దర్జీకి 10 రూపాయలు, వంటపనివానికి 3 రూపాయలు, సూర్యనారాయణ పంతులుగార్కి టెలిగ్రామ్ 9 అణాలు, ఒక యాంగ్లో ఇండియన్ జీ.యేన్ ట్రెనర్, 3 పెట్టెలు.

☆

* *7-2-1895* *

7 అణాలు టిఫిన్, సూర్యనారాయణ పంతులు సారస్వత సంఘం నుండి తెచ్చిన పుస్తకాలు తిరిగి యివ్వడం జరిగింది. ఒక్కటి తప్ప తక్కినవి విజయనగరం పంపాము. మహారాజులుంగారి దగ్గరలేని 3 పుస్తకాలు ఇక్కడ వున్నాయి.

☆ ☆ ☆

* *8-2-1895* *

ఉదయం మోతాదుతో పాటు మిక్సర్ (మందు) ముసలిబండి వానికి పావల, వంటవానికి 4రూ.లు, 4 అణాలు పోస్టేజ్, సారస్వత సంఘ గ్రంథాలయం నుండి 18 సంపుటాల భారతదేశ చరిత్ర తెచ్చాను. కంపోజిటర్‌కి ఒక రూపాయి ఇనాము. పని ఒత్తిడి బాగా ఉంది. చేతుల నిండా పని. పనివాళ్ళందరూ పనిలో మునిగి ఉన్నారు. 4 అణాల టిఫిన్.

☆ ☆ ☆

* *9-2-1895* *

టిఫిన్ ఏడు అణాలు, రాత్రిమాత్ర 1

☆ ☆ ☆

* 10-2-1895 *

వీరరాఘవస్వామిగారికి టెలిగ్రామ్ 8 అణాలు, కార్డ్ లివర్ ఆయిల్ 2 డోసులు. ఒక్కొక్కసారి 2 చెంచాలు రాత్రిమాత్ర, వైష్ణవ బిచ్చగాడికి 3 అణాలు, చాకలికి 9 అణాలు. $1\frac{1}{2}$ అణాలు spts....

☆

* 12-2-1895 *

మీరు దయతో రాసిన ఉత్తరాలు, టెలిగ్రాములు అందాయి. సంతోషం. మీరు పంపిన రచనలోని భాగం నిన్న అందింది. వాటిలోని భాగాలు కూడ మహారాజులుంగారు చేర్చాలనుకుంటున్నారు.

వంటవానికి 5రూ. లిచ్చాను. అర రీం కాగితాలు కొన్నాను. రూపాయి రెండు అణాలకు ప్రాచ్యఖండ గ్రంథాలయంలో ఫూసపాటి కుటుంబశాసనాలు కొనుక్కున్నాను. వ్యవసాయం గురించి ఒక పుస్తకం కూడ. క్రొవ్వొత్తి రెండణాలకు.

1. టర్కీదేశ పతను తన గుర్రాలు పోగొట్టుకున్నాడు
2. నక్కల కూతలు
3. ఏనుగు పెరుగుతూ వుంది. రెండు పావురాలు కూడ బచ్చన్నపాద్‌ష
4. తోప
5. పుస్తక పఠనం, సఫోర్‌పిక్‌గా(?)
6. అన్నం వంట
7. ఎన్.వై. చీమ, నెమలి, నేస్తం.(ఈ మూడు పదాలు తెలుగు అక్షరాలలో)
8. రాజు, గారడీ చేసే స్త్రీ
9. రాజుగారికి భార్యంటే ఇష్టం లేదు. షరతులు రుద్దుతారు.

☆ ☆ ☆

* 13-2-1895 *

5 అణాల పుస్తకం, 6 అణాలకు కథలు సంగీత గొడ్డలి, దూడగడ్డి మేత తినుట, పరమానంద శిష్యులు, గుడు గుడు శబ్దం, లంఖనం పరమౌషధం.

☆ ☆ ☆

* 16-2-1895 *

టిఫిన్ నాలుగణాలు, తప్పులు దిద్దిన ప్రూఫ్ జోగారావు పంతులుగారి నుండి వచ్చింది. 17వ తప్పు క్రింద.

సహజ బొటానికల్ గార్డెన్స్ గ్లేసన్. ఈయనకి విద్యలేదు. మర్యాదలు తెలియవు. పెద్ద కబుర్ల పోగు. అతనితో ఎక్కువ పరిచయం చేసుకోవాలి. ఇది 18వ తప్పులోది.

☆

* *17-2-1895* *

మైసూరు శేషన్నగారి వీణ కచేరి విన్నాను. జలతరంగిణి (ఆఖరి రెండు పదాలు తెలుగు లిపిలో) ఇది శేషగిరి శాస్త్రులుగారి ఇంట్లో సాయంకాలం.

ప్రాచ్య విద్యా గ్రంథాలయంలో పుస్తకాల పట్టికను చూడడానికి వెళ్ళాను అద్భుతం.

☆ ☆ ☆

* *18-2-1895* *

ప్రూఫ్‌ల కోసం కలకత్తా నుండి టెలిగ్రామ్ ట్రీటి (సంధి) పని దయ చేసి త్వరగా కానివ్వండి.

(మహారాజాలుంగారి, ఆనంద గజపతి రాజాలుంగారి పూర్వులు విజయనగరానికి స్వపరిపాలన ఉండాలన్న సంధి చేసుకున్నారు. అవసరం తీరాక ఆ సంధిని బుట్టదాఖలు చేశారు – గమనిక – సంపాదకుడు)

రాధాబాబు సాహెబుగారికి పంపండి. 25, బల్లీయ ఘాట్, శీయాల్దా టెలిగ్రామ్ ద్వారా, బాలయ్య నాయుడుగారి వంటమనిషికి 5రూ.లిచ్చాను. టిఫిన్ 7 అణాలు.

☆ ☆ ☆

* *19-2-1895* *

టిఫిన్, బిస్కట్లు 1–2, టెలిగ్రామ్. బి.ఎస్.గేస్, ఎడ్మిరాల్టీ భవనానికి రాత్రి తిరిగి వచ్చాక టెలిగ్రామ్ చూసాను. పోస్టేజ్ 8 అణాలు, 2 అణాలు, అదనంగా 10 అణాలు.

☆ ☆ ☆

* *20-2-1895* *

కాపీ ఏది ఉంచలేదు. మీరు అవసరం అనుకున్న దాన్ని బట్టి తప్పులు సరిదిద్దండి.

మహారాజాలుంగారికి టెలిగ్రామ్ 3రూ.లు (అర్జెంట్) త్వరగా. కన్నడ గురించి పుస్తకాలు కొన్నాను. ఒక వ్యాకరణం రూపాయి నాలుగణాలు $1\frac{1}{2}$ Mac Kesau(?) వాగ్విధాయ!

4 అణాలు, గాథాసప్తశతి (తెలుగులో) 8 అణాలు 1 కట్టు కథల పుస్తకం 4 అణాలు, సంకలనం $1\frac{1}{2}$ అణాలు అన్నీ కలిపి మొత్తం 14 రూ.లు. సెనెట్ హాల్ వేలంలో ఇవన్నీ కొన్నాను. 2రూ 15 అణాల 6పైసలు. 2–15–6 ఒక పిల్లర్ సిరావింపే, నాలుగు చెంచాలు, రెండు టాప్స్ (?) (Tops) పిల్లల టీ సామగ్రి, ఎడ్మిరాల్టీ భవనంలో నా కోసం ఎదురుచూస్తున్న సుందరరావుగార్ని చూసాను. ఆయన తన ఇద్దరు స్నేహితుల్ని పరిచయం చేసారు. బాలాజీరావుగారు బి.ఏ.బి.ఎల్, ఇంకోకాయన అయ్యంగార్. తాను స్వామి వివేకానందకు మొదటి శిష్యుడునని చెప్పాడు. మేము సభల గురించి, ఉపన్యాసాల గురించి, వాక్ ప్రావీణ్యం

గురించి, సాంఘిక  సంస్కరణలు గురించి, మత సంస్కరణ సారస్వతాల గురించి మాట్లాడుకున్నాము.

☆ ☆ ☆

* *21-2-1895* *

చివరి ప్రూఫ్ పోస్టు చేసాను. 7 అణాలు జోళ్ళు కొన్నాను. ఒక రూపాయి ముప్పావల మూడు పైసలు

☆

* *23-2-1895* *

పూలప్రదర్శనం, సాంతిముక్కల వెంకటరామరాజు నుండి పది రూపాయలు అప్పు తీసుకున్నాను. ఫోర్‌మెన్‌కు అప్పు ఇచ్చాను.

1. టెలిగ్రామ్
   ఆటవస్తువులు
   ఒక రూపాయి (స్కూల్) పాఠశాలలో చేర్చడానికి
   ఒక రూపాయి కూరగాయల కోసం.

☆ ☆ ☆

* *24-2-1895* *

ట్రిప్లికేన్(లో) చెరువులో పడవ ఉత్సవం జరిగింది. బట్లర్‌కు 10 అణాలు, వెంకటరామరాజుకు 2 రూపాయలు. కొవ్వొత్తులు 2 అణాలు, వంట మనిషికి 5రూపాయలు, వంటమనిషి వద్ద నుండి 2రూపాయలు తిరిగి తీసుకున్నాను.

☆ ☆ ☆

* *26-2-1895* *

చాకలి $9\frac{1}{4}$ అణాలు ఇచ్చాడు. ఇంకా నాలుగణాలివ్వాలి. 22 బట్టలు వేసాను.

☆ ☆ ☆

* *27-2-1895* *

**అండర్‌వుడ్ నుండి కథలు**

(1) కోమటి (2) వైద్యుడు – గుణ్ణం (3) వైద్యుడు–కరక్కాయ (4) బాబిగాడి కథలు (5) రాజు మంగలిని మంత్రి  చేయుట (6) కోతి గుడ్డలతో బంగారు (7) జ్యోతిష్కుడు (8) మంగలి (9) సరసం (10) మిడతం భొట్లు (11) మంచి గంధపు చెట్లు అమ్మడం గతిమాలినే (12) సవారి

* 28-2-1895 *

అండర్‌వుడ్ కథలు

(1) ససేమిరా (2) ఏకఃపంథాను కర్తవ్యం (3) రాజుభార్య రాజును చంపుట, మంత్రి భార్య బ్రతికించుట, పక్షులు మాట్లాడుకోవటం (4) రాచకన్యల తాలూకు బట్టల నిమిత్తం కుమారుడు.

☆ ☆ ☆

* 2-3-1895 *
శనివారం

కళ్యాణ రామయ్యరు మాకు టిక్కెట్లు యిచ్చారు. స్త్రీలు చాల చక్కగా అభినయించారు.

☆ ☆ ☆

* 3-3-1895 *
ఆదివారం

రాజగోపాలాచారిగార్ని చూసాను. కాలేజీలో ఒక సమావేశానికి వెళ్ళాను. ఒక స్నేహితునితో పాటుగా శశిపాద బెనర్జీగారి సభకు వెళ్ళాను. బట్లర్ దగ్గర నుండి 10 అణాలు పుచ్చుకున్నాను.

☆

* 4-3-1895 *
సోమవారం

మహారాజులుంగారికి టెలిగ్రాం 2–8–0, మిస్టర్. కోస్, ఎమ్.'ఎ.ఎల్.టి'., ఎమ్.'ఆర్.ఎ.'సి. ఎ.జి, వ్యవసాయ కళాశాల ప్రిన్సిపాల్, వంటమనిషికి అదనంగా నాలుగు రూపాయిలిచ్చాను. రోగికి, సోప్‌కి 0–5–8

ముత్తుస్వామి స్మారక సభకు వెళ్ళాను. అధిక భాగం ఉపన్యాసం బాగోలేదు. శ్రీరాజ్ ఎ.వై భాష్ వగైరా బాగాలేదు. పరమేశ్వరన్ పిళ్లె ప్రసంగం ఉద్రేకంగా ఉంది. కాని, ఆయన మాటల వేగం అధికం, ఉద్రేక పడ్డారు. హుందాతనం, సహజత్వం, శృంగారం కొందరి వక్తల ప్రసంగాలలో లేదు.

☆ ☆ ☆

* 5-3-1895 *

రాధాబాబు సాహెబ్‌కి టెలిగ్రామ్ 2రూ. నాయుడుగారి నుండి 50రూపాయలు నాకు ముట్టింది. మిగతా వారి కోసం 50 ముట్టింది.

☆ ☆ ☆

* *6-3-1895* *

4-8-0 ట్రేటి గురించి పేపరు కోసం, సూర్యనారాయణ పంతులుకి టెలిగ్రాం 1-0-0, బండివాడికి 0-2-0, జి.డి. 0-8-0, లేబల్స్ 0-1-0.

☆

* *7-3-1895* *

| | |
|---|---|
| బి.ఎస్.కు టెలిగ్రాం | 1-2-0 |
| ఫోర్ మెన్ కు | 2 రూ. |
| ట్రంకు పెట్టె | 15 రూ, 5 రూపాయలకు ఒక దీపం కొన్నాను. |

☆ ☆ ☆

* *8-3-1895* *

సంపెంగ, చామంతి (తెలుగు లిపిలో) పి.వెంకటస్వామినాయుడుగారు, శానిటరీ ఇన్స్పెక్టర్, నెం.2 డివిజన్ కోర్టు, రంగనాథం మొదలి వీధి, ఇంటి నెం.19. పార్శల్ కోసం 5-4-0 కోర్టు ఖర్చు, పెన్సిల్ కొన్నాను.

☆ ☆ ☆

* *9-3-1895* *

బంతి, బూడిద (తెలుగు లిపిలో)

0-1-3,లు చాకలి ఇవ్వాలి.

ప్రాచ్య విద్యా గ్రంథాలయంలో (క్రిస్టియన్) కాలేజీకి చెందిన రామయ్య పిళ్లైగార్ని పరిచయం చేసుకున్నాను.

☆

* *10-3-1895* *

మామిడి చెట్టు పువ్వు పూసింది.

**మిస్టర్ అండర్ వుడ్ కథలు**

1. గారడీ విద్య. 2. విక్రమార్కుడు – దొంగతనం. 3. సాని యింటికి వెళ్ళుట. 4. రాజు దొంగతనము నేర్చుట. 5. నక్కల రాజు. 6. రాజకుమారుడు ఉండని ఇళ్ళు, పురోహితుడు కుమార్తె 7. బాచిగాడు నెల్లూరు ప్రయాణం 8. మంత్రి బంగారు గిన్నె ఎత్తుకుపోవటం 9. గొడ్డు గోతపడ్డది

(పై నున్నవన్నీ తెలుగు లిపిలో రాసినవి. సం)

☆ ☆ ☆

* *11-3-1895* *

అచ్చుపనివానికి 2 రూపాయలిచ్చాను. స్థానిక వార్తలలో ఒక ముఖ్యమైన వార్తను సేకరించాను. ఆపరేషన్.

☆ ☆ ☆

* *13-3-1895* *

కృష్ణంరాజుగారితోపాటు ఆఫీసుకు వెళ్ళాను. సుందరరావు పంతులుగార్ని పెవెట్ హౌస్‌లో కలిసాను. ఒక గంటకు పైగా కలిసాము. చీకటిని చూసి సంతోషించాము. ఆ సముద్రపుఒడ్డు గాలి గంటకు పైగా అనుభవించటం జరిగింది. అనేక విషయాలు మాట్లాడుకున్నాము. కాలం బాగా గడిచింది. అక్కడి నుంచి ఆయనింటికి వెళ్ళాము. ఆ తర్వాత మా యింటికి. వెంకటరామరాజుగారి దగ్గర నుండి 10రూ. అప్పు. ట్రీటి పనుల నిమిత్తం కాగితం కోసం 4రూ. ఇంగ్లీషు, కన్నడం నిఘంటువుకు 5రూపాయలు. ప్రెసిడెంట్ భూగోళశాస్త్ర పటానికి 3రూపాయలు.

☆

* *14-3-1895* *

వృద్ధులు కృష్ణమాచార్యులు గారిని రిజిస్ట్రార్ ఆఫీసుకి తీసుకు వెళ్ళాను. వెస్ట్ అంగడికి వెళ్ళి 5 చర్మం బైడింగ్‌తోను, 10 గుడ్డ బైండింగ్‌తోను కాపీలకు ఆర్డరిచ్చాను.

☆

* *15-3-1895* *

మొన్న ట్రీటీలు ప్రతులు వచ్చాయి. బాగుంది. పని బాగా జరిగింది. మహారాజులుంగారు చాల సంతోషించారు. అవి మంచి సమయానికి వచ్చాయి. ఆనందబాగ్‌లో బాలస్వామినాయుడ్ని చూసాను. చాల దయగా నన్ను చూశారు. ఆవరణ చూసాను. కొత్త భవనం అనేక పథకాల్లో ఉంది. ఎదురుగా ఉన్న తోట చాల చల్లగా ఉంది. 400 రూపాయలు తీసుకున్నాను.

☆

* *16-3-1895* *

బ్రాహ్మో (తెలుగులో)
బట్లర్ దగ్గర నుండి $2\frac{1}{4}$ రావాలి.

☆

* *19-3-1895* *

ఉదయం 9,10 గంటల మధ్య క్రిస్టియన్ కాలేజీకి వెళ్ళాను. విద్యార్థులు గోల చేస్తూ ఉండనిచ్చారు. దిగువ అంతస్థులో డా.మిల్లర్‌గారి పలుకుబడి అంతా గోల నుండి బడిపిల్లల అవిధేయత నుండి కాపాడలేకపోయింది. బెంచీ బల్లలు చాల బాగున్నాయి. కొన్నిటికి వెనక తట్టు ఉన్న బెంచీలు కుర్చీలన్నిటికి కాళ్ళు డా.మిల్లర్‌గారి సొంత గది నిండా పుస్తకాలు. ఒక జాబితా ఉంది. పుస్తకాలు అరల్లో పెట్టి ఉన్నాయి. ఒక నౌకరుకు కొద్దిగా ఇంగ్లీషు తెలుసును. కుర్రవాళ్ళకు కావల్సిన పుస్తకాలు తీసి

ఇస్తాడు. చిన్న కాగితం ముక్క మీద వారి పేర్లు, వాళ్ళకు కావలసిన పుస్తకాల పేర్లు రాసిస్తారు. పిల్లలు గ్రంథాలయాన్ని బాగా ఉపయోగించుకుంటున్నారు. సాధారణ గ్రంథాలయం చెప్పుకోవలసిందిగా లేదు. అలమారాలు అందంగా చేయబడ్డాయి.

50 రూపాయలకి లెక్క పద్దు

| | |
|---|---|
| పాకీవానికి | 2 రూపాయలు |
| శ్రీనివాసాచార్యులు గార్కి | 1 రూపాయి |
| విజయనగరం మున్సిపాల్ సెక్రటరీకి | 20 రూపాయలు |
| బిస్కట్లు | 1-2-0 |
| సోడా, లెమినేడ్ | 0-6-0 |
| సిల్వరీ పళ్ళు | 0-2-0 |
| సెకండ్ హ్యాండ్ పుస్తకం | 1 రూపాయి |
| సూరన్నకు | 4 రూపాయలు |
| పేక, బండివాడు వగైరా | 1 రూపాయి |
| బండివాడు | 0-4-0 |
| రామస్వామి సెట్టి | 8-8-0 |
| శ్రీనివాసాచారి | 0-8-0 |
| బండివానికి | 0-2-0 |
| ఫోటో | 0-2-6 |
| బిస్కట్లు | 2-4-0 |
| డి(?) | 2-0-0 |

☆

** 20-3-1895 **

మిస్టర్ కూపర్ ఓక్లేని చూశాను. ఆయనకి కళ్ళవాపు. ఆయన ఎంత నిక్కచ్చి మనిషంటే ప్రెసిడెన్సీ కాలేజీ, క్రిస్టియన్ కాలేజీ, పచ్చయప్పన్ కాలేజీ కంటే అన్ని విధాల చాల మంచివి. మా కళాశాల గురించి తనకు చాల మంచి అభిప్రాయం వుందని ఆయన అన్నారు. తన క్లాసు రోజుల్లో కొన్ని గంటలు ఉండటానికి నేను కోరడం విషయం. ఆయన దిగువ ఉద్యోగస్థులకు ఇది నచ్చుతుందో లేదో తెలియదు.

☆ ☆ ☆

** 21-3-1895 **

డా. మిల్లర్ వద్దకు ఉదయం పూట 9గంటలకు వెళ్ళాను. ఆయన నన్ను ఎంతో దయతో చూసారు. ఆయన నా చేతిని పట్టుకుని వీపు మీద తట్టి నా గురించి విజయనగరంలోని తన పూర్వపు విద్యార్థుల గురించి ప్రశ్నలు అడిగారు. అక్కడ నుంచి రమణస్వామి శెట్టిగారి అచ్చాఫీసుకి వెళ్ళాను. అక్కడ వైష్ణవుల నీతి నియమాలు గురించి, ఆయన అన్నదమ్ముల ఒకరితో బాతాఖానీ వేసాను. అక్కడ నుండి వెస్ట్ సంస్థకు వెళ్ళాను. నాలుగో ఫారం మళ్ళీ అచ్చు వెయ్యమని

అక్కడ కోరాను. సెనెట్‌హౌస్‌లో కాన్వకేషన్‌కి హాజరవుతానని రాసి ఇచ్చాను. శ్రీరామశాస్త్రికి ఉత్తరం రాసాను.

☆ ☆ ☆

*** 23-3-1895 ***

బాలస్వామినాయుడుగారు దయతో శ్రీనివాసశాస్త్రిగార్ని నన్ను చెంగ అంగడిలోని ఒక నాటకశాలలో కల్యాణరామయ్యర్ నాటక సమాజం వారి ప్రదర్శనకు ఆహ్వానించారు. అరిపిరాల వెంకటరావు పంతులుగారు గత శనివారం నాడు నాకిష్టం లేకపోయినా అక్కడకు లాక్కెళ్ళారు. పై కప్పు జింకు ప్లేట్స్ వేసి ఉన్నాయి. వాటికి ఇనుప దూలాలు. నాటకశాల కంగాళిగా ఉన్న చిన్న ఇరుకు సందులో ఉంది. ఒక్కసారి హాల్ నిండిపోయింది. మాకు స్థలం లేదు. వేస్తున్నది శాకుంతలం. మేము అక్కడకు వెళ్ళేటప్పుడు వీడ్కోలు దృశ్యం నటన జరుగుతూంది. బాలామణి అక్క చెల్లెలు దుష్యంతుని పాత్రలో ఉంది. నడక తీరు వికారం. రూపము పొడుగా ఉంది. గొంతుక ఆమె స్త్రీ అని సులభంగా తెల్పుతుంది. నాటక సమాజంలోని ప్రతి ఒక్కరు బాలామణి తప్ప ఉత్తచెత్త. కాని, రూపం బాగుంది. సున్నితంగాను ఉంది. ఆమె అలంకరణ బాగుంది. సున్నితంగాను ఉంది. ఆమె ముఖం అంత తాజాగా లేదు. గొంతుక బాగుంది. ఆమె తన గొంతుక మార్చగలదో లేదో నాకు తెలియదు. విషాదాంత పాత్రలు ఆమె బాగా నటించగలదు. విషాదాంత పాత్రలు ప్రశాంతంగా, ఏడుపుగొట్టుగా ఉన్నాయి. ఆమె మంచి విషాదాంత కథానాయిక పాత్ర వెయ్యగలదో లేదో నాకు తెలియదు. ఏడుపుగొట్టు పాత్ర ఆమె అతిగా చేస్తుంది. ఎందుకంటే దానికి కారణం బహుశా రచయిత తెలివి తక్కువతనం. ఆమె అందంగా ఉంది. ఆహార్యం చక్కగా అమర్చారు. మద్రాసు ప్రేక్షక లోకంలోని తెలుగు అనుసరణ ఉంది. విదూషకుడు ఎంతో విషాదాంత ఘట్టాలలో సొంత హాస్యం పెట్టడానికి స్వేచ్ఛ ఇచ్చారు. బాలామణి నాటక సమాజం వారి ఇతర పాత్రధారుల వేషధారణ పొడుగా ఉంది. పాత్రధారులు తక్కువ కులాల వారేమో! మద్రాసులో తక్కువ కులాల వారు సాధారణంగా అందంగా ఉండరు. నాటక రంగానికి తగ్గట్టు చెయ్యడానికి ఎక్కువగా శ్రమపడి వేషధారణ చెయ్యడం అవసరం. పక్క వాయిద్యాలు మరీ ఎక్కువ. ఒకటే గోల. ఈ విషయంలో కూడ ఈ సమాజం 'ప్రహ్లాద నాటకం' (ఇది తెలుగులో రాసారు)లోని కొన్ని అంశాలను అట్టేపెట్టారు. దుష్యంతునికి, శకుంతలకి మధ్య ఒక దృశ్యం కొన్ని గంటలు నడుస్తుంది. ఇది రాజుగారి దర్బారులోనిది. దీర్ఘంగా ఉన్న విచారణ. దానికి ప్రత్యుత్తరం – ఆ దృశ్యాన్ని పాడు చేసాయి. కాళిదాసు ఎంతో చక్కగా రాసిన వాటిలో అది ఒకటి. భరతుని పాత్ర రూపం కోతిరూపం. ఇది చెప్పడం మరచాను. గత శనివారం నాడు బాలామణి నాటకం చూడడానికి వెళ్ళి, కొన్ని గంటలు తరువాత కల్యాణరామ అయ్యర్ ద్రౌపదీ వస్త్రాపహరణం నాటకంలోని కొన్ని దృశ్యాల్ని చూడడానికి వెళ్ళాము. మేము చివరి క్లాసు టికెట్ కొని హాలు చిట్టచివరన కొన్ని నిమిషాలు నిలబడ్డాము. ఈ సమాజానికి

మంచి దుస్తులున్నాయి. కాని, వాటిని వేసుకున్న తీరు పరమపాడుగా ఉంది. తలకు వెనుకగా జుట్టు పెద్దగా ముడివేసుకొని ఉన్నాడు. దాని మీద ఒక టోపి, అది హుందాగా కనిపించదు. రాజుగారిలాగా కూడ కనిపించదు. దుష్యంతుని వేషం ఎలా ఉందంటే గడ్డం, మీసాలు, వికారమైన తలపాగా. మా జిల్లాలోని పాములవాడి కంచుగంటలు వంటివి. దుర్యోధనుడు, దుశ్శాసనుడు ఇద్దరూ మాట్లాడవలసినపుడు కేకలు వేస్తారు. మహారాష్ట్ర నాటక సమాజంలోని దుశ్శాసనుల్లాగా, రాక్షసుల్లాగా మద్రాసులోని ఇంకే నటునికీ సహజంగా మాట్లాడే తీరు తెలియదు. పాత్రలు మాట్లాడవు. అవి వల్లిస్తాయి. హిందూ స్కూలు కుర్రవాడులాగా తొందరగా మాట్లాడతాయి. ఎవరు తొందరగా మాట్లాడతారా అన్నదాని గురించి పందెం వేసుకున్నట్లుగా మాట్లాడతారు. విరామాలు చాల. కొద్దిగా కృత్రిమం. గత శనివారం నాడు కల్యాణరామం నాటకం ఎక్కువ చూడలేకపోయాను. దుశ్శాసనుడు చేసిన వస్త్రాపహరణం ఎంతో గడిబిడిగా జరిగింది. అవిడ చుట్టూ భయంకరంగా గావుకేకలు పెట్టాడు. మద్రాసు వాలాలకి ఇటువంటివి ఇష్టంలాగా ఉన్నాయి. దీర్ఘ సంభాషణలు, సంగీతం. సంగీతం లేనిదే వారికి ఏదీ జరగదు. సులభమైన వచన నాటకానికి వారికి అవకాశమే లేదనుకుంటాను. ఈవేళ కల్యాణరామం నాటకంలో ఉత్తమ ఘట్టం చూసాను. చాల చక్కగా ఉంది. దుస్తులు బాగున్నాయి. బట్టరంగు కూడ నాకు నచ్చింది. అది తెల్లని పట్టుబట్టలాగా ఉంది. చివరన చిన్నగా లేసుకుట్టు. ఆయన కళ్ళు, ముక్కు అన్నిటిలోకి పరమపాడుగా ఉన్నాయి. కళ్ళు మరీ గుండ్రంగా ఉన్నాయి. ముక్కు మొద్దుగా ఉంది. దూరం నుండి చూస్తే దృశ్యం బాగుంటుంది. నటన బాగాలేదు. గొంతుక సంగీతం ఈ రెండూ పాడుగా ఉన్నాయి. అతని నటన వేశ్య తీరుగా ఉంది. శకుంతల పాత్రలో బాలామణి హద్దులు దాటలేదు. నాటక సమాజాలలోనికి వేశ్యల్ని అనుమతించడం ఎంత మాత్రం సమ్మతించరాదని నా అభిప్రాయం. ఒక తెలివైన నటి అందచందాలతో సమాజానికి ప్రమాదం. ఆమె వ్యభిచారిణి అయినట్టయితే, ఆమె చూడ చక్కగా, తెలివిగా ఉన్నట్టయితే ఆమె శక్తికి పరిమితి లేదు.

కల్యాణరామ అయ్యర్ ప్రదర్శన చూడడానికి వెళ్ళాం. కాసేపయ్యాక మేము బాలామణి వద్దకు వెళ్ళాము. బాలయ్యనాయుడిగారి బృందం మొత్తం 12 మంది. ఒక్క మనిషికి కూడ అక్కడ జాగాలేదు. మహారాజులుంగారి సిబ్బందిలో అసంభవాల్ని సాధించగల ఒక మనిషి ఉన్నాడంటే, సరియైనట్టుగా పనిచేయడం తెలిసిన మనిషి ఉన్నాడంటే, ఆయన నాయుడుగారే. ఆయన పేరులో ఆకర్షణ ఉంది. ఆయన పేరు చెప్పినట్లయితే మర్యాద, స్థలం దొరుకుతాయి. ఎక్కడైనా సరే. చిట్ట చివరికి మాకు స్త్రీలకు వెనుక ప్రక్క స్థలం దొరికింది. నాయుడుగారు ఖర్చంతా పెట్టుకున్నారు. తంబాచారి విలాసం సాగుతూవుంది. 'గొబ్బి' నాట్యాన్ని కథానాయిక ఒయ్యారంగా ఆడుతూ ఉంది. ఆమె వేసుకున్న బట్టలు బంగారపు రంగువి. ఈరోజు నాటక దృశ్యాలలో ఒకటి నలుగు పెట్టడం. దృశ్యం బాలామణి నృత్యనాటికలోని బాలిక ఏదో లేతరంగు బనియన్ వేసుకొని వచ్చింది. ఆమె జాగ్రత్తగా దుస్తులు వేసుకొని తలకు సూర్యుడు, చంద్రుడు మొదలగు ఆభరణాలు

పెట్టుకుంది. అవి లేకుండా ఉంటేనే ఇంకా బాగుండేది. ఈ దుస్తుల్లో ఆమె నాకు నచ్చలేదు. ఆమె సహజంగా కనిపించలేదు. మదన సుందరి (తెలుగులో)లాగా కూడ ఆమె కనిపించదు. ఆమె రూపం, నటనల్లో హుందాతనం ఉంది. కాని, నిజంగా చెప్పుకోవలసిందేంటంటే, కుండం నాయకర్ని కలిసిన వేశ్య కొవ్వెక్కిన మద్రాసు శెట్టి తంబాచారి విలాసంలోని వ్యభిచారిణి పాత్ర ఉంది. తన పాత్ర ద్వారా నిరసన భావాన్ని ప్రకటింప చేస్తుంది. అయితే ఈవిడ చెప్పుకోవలసిన స్త్రీ.

ఈ ఉదయం ఒక తూర్పు ఇండియా కుర్రవాడు జింకురేకుల్ని వెయ్యటానికి వచ్చాడు. అప్పటి నుండి టెలిఫోను పనిచెయ్యడం మానివేసింది.

☆

*** 24-3-1895 ***

బాలయ్యనాయుడు గారు కొందరు స్నేహితులతో కలిసి ఇక్కడకు వచ్చారు. వారిలో జావళి పాటలలో ప్రసిద్ధుడైన సుబ్బారావుగార్ని ఎరుగుదును. వారితో పాటు కందస్వామినాయుడు గారు 'ఎక్స్‌ప్రెస్ ఆఫ్ ఇండియా ప్రెస్' షణ్ముగ చెట్టియార్ కూడ వచ్చారు. శ్రీనివాసాచార్యులుగారు నాతో ఉన్నారు. మేము కులాసాగా కాలక్షేపం చేసాము. శ్రీనివాసాచార్యులు పాడారు. జి.యన్.జి చక్కగా తీగలు కదిపేరు. కాని, ఇంకా ఆయనకు అభ్యాసం కావాలి ప్రవీణుడు కావడానికి. కందస్వామి నాయుడు గారు పరవా లేదు. సుబ్బారావుగారు చెప్పుకోవలసిన మనిషేను. ప్రశాంతమైన వ్యక్తిత్వం, పండితుడు, విద్వాంసుడు. ఆయన మాకు గొప్ప మొజార్టు వంటివారు.

షణ్ముగం గారు వెంకటాద్రినాయుడుగార్ని జ్ఞాపకం తెచ్చారు. మొహంలో కనిపించే హావభావాలొక్కటే. ప్రశాంతత కన్పిస్తుంది ఆయనలో. అకస్మికావసరం దేనికైనా తగ్గట్టు నాయుడుగారు బాగా కలిసి మెలసి ఉండే తరహా మనిషి. నేను చాలా మందిని అడిగాను ఎందుచేతనని. సంగీతం విషయంలో ఆంధ్రదేశం కంటే తమిళ దేశం ముందున్నప్పటికీ, ఇక్కడ పాడిన వాటిలో అధికభాగం తెలుగులో ఉన్నవి. తెలుగు ఎక్కువ సంగీతబాణిలోను, తియ్యగాను ఉండటం చేతనని చాల మంది చెప్పారు. కాని, సంపూర్ణ సత్యం కాదు. తమిళం ఎంత మాత్రం సంగీతరహితం కాదు. ఇంతకంటే సబబైన కారణాల్ని కనుక్కోవాలి. ముసల్మానులు, యూరోపియన్లు దక్షిణ భారతదేశాన్ని ఆక్రమించుకొన్నప్పుడు పరిస్థితులని నేను సూచిస్తున్నాను. అప్పుడు పాలించే కుటుంబాలు తెలుగువారు. అంటే మధుర నాయకులు, కంచి, చోళ చాణిక్య, విజయనగరం, పాలకులు. తెలుగుకు కొన్ని సదుపాయాలున్నాయని అనడానికి సందేహం లేదు. ఎటువంటి పరిమితి లేకుండా అది సంస్కృత పదాల్ని స్వీకరిస్తుంది. దానికి ఎక్కువగా స్పష్టమైన అచ్చులున్నాయి. కాని, తమిళానికి చాల మూర్ధన్యాక్షరాలున్నాయి. కనీసం 'అ' తరచూ వినిపిస్తుంది. ర,ళ,డ తరచుగా వస్తాయి. ద్విత్వాక్షరాలు కూడ తరచుగా వస్తాయి. హల్లులతో చాల పదాలు ముగుస్తాయి. (తమిళంలో ద్విత్వాక్షరాలు పక్కన వస్తాయి. రెండో శబ్దం మూల పదానికి దిగువన కాకుండా ప్రక్కన వస్తుంది.)

టెలిఫోను సరిగ్గా పని చేయడం లేదు.

మహారాజులుం గారు కలకత్తా వదలి వెళ్ళారని తెలిసింది.

☆ ☆ ☆

* *25-3-1895* *

బయటకు కదల లేదు.

పాత్రలు, రూపం.

1. ఏకాంగి (తెలుగులో) మొహానికి మసూచికపు మచ్చలు, బాగా పొడవు, నలుపు, చిక్కని రంగు, మొహం మీద లేసు అల్లిక వంటి గీతలు కాళ్ళాక్ష..గౌను వేసుకుంటాడు. నాణ్యమైన రంగు బట్ట, మహాజ్ఞానిలా నటిస్తాడు. కొంత ఇంగ్లీషు అలవాటు చేసుకున్నాడు. చేతిరుమాలు తరచుగా ఉపయోగిస్తుంటాడు, ఎక్కువగా మాట్లాడుతున్నప్పుడు. తనతో ఎవరైన మాట్లాడుతున్నప్పుడు తల మహాజ్ఞానిలా తిప్పుతుంటాడు. ముసలి కృష్ణంరాజుగారికి ఇతని వల్ల చాల ఖర్చు అవుతుంది. ఎప్పుడు అయనకు చిత్తం వస్తే అప్పుడు. ఈ ఏకాంగి స్వామి తన వద్దకు వెళ్ళినపుడు రెండున్నర రూపాయల అద్దె ఇచ్చుకోవాలి. దిగువ జాతుల వాళ్ళు ఏకాంగిని పూజిస్తారు. బ్రాహ్మణులు, వైష్ణవులు ఏవగించుకుంటారు. ఈయన గారు మెచ్చుకోవలసిన వాడు కాడని దానర్థం. తక్కువ కులాల వాళ్ళు అయనకు వంగి వంగి మ్రొక్కుతారు. ఒక వైష్ణవ బిచ్చగాడున్నాడు. అతను కృష్ణంరాజును అంటి పెట్టుకొని ఉన్నాడు. అయన పచ్చిదొంగ.

☆ ☆ ☆

* *26-3-1895* *

విన్దోరియా సబ్బు కొన్నాను.

ఒక గడియారం 3–10–0, బులుసు సూర్యనారాయణ గారి కోసం రామస్వామి శెట్టి అంగడిలో కొన్నాను.

అనేక వస్తువుల కోసం 8–8–0

రామస్వామి అంగడిలో కృష్ణంరాజు అష్టకం చూసాను. వెస్ట్ కంపెనీ ఫోర్‌మెన్‌కు రెండు ముద్రూపాయలిచ్చాను. 'ట్రీటీ' కోసం $2\frac{1}{2}$ రూపాయలు.

ఏకాంగి వచ్చి పడ్డాడు.

శలవు (expenditure)
విచారించుట (enquire)
తీస్తిని (bought)
గొల్లవాడు

ఎప్పుడూ తమలపాకులు నవులుతుంటాడు.

రైలు స్టేషన్‌లో నా బరువు చూసుకున్నాను. 88 పౌండ్లు. 7 పౌండ్ల బరువు అధికంగా సంపాదించాను.

☆ ☆ ☆

* 27-3-1895 *

చాలా విచారంగా ఉంది. మా మావగారి కుటుంబంలోని చనిపోయిన వారి గురించి ఆలోచనలో పడ్డాను. ముఖ్యంగా చిన్నపిల్లవాడు చిట్టిబాబు గురించి.

ఈవేళ గిడుగు రామ్మూర్తికి తప్పకుండా ఉత్తరం రాయాలి. దేశంలో గౌరవనీయమైన కుటుంబాల పరిస్థితులు చాల వరకు ఇలాగనే ఉంటాయి. కుటుంబం దిగజారిపోతుంది.

ఈవేళ తెలుగు ఉగాది రోజు. మహారాజులుం గారికి దేవుని ఆశీర్వచనాలు! లోకం సుఖవంతంగా ఉండునుగాక!

వైష్ణవ బిచ్చగాడు చడీచప్పుడు కాకుండా తచ్చాడుతున్నాడు. అయన ఒక దీపం పట్టుకొచ్చి ఏదో దేవుడు కోసం దానిని నేను కొనాలని సూచించాడు. ఆయనకి కొద్దిగా వేదాంత బోధన చేసాను. చడీచప్పుడు కాకుండా వెళ్లిపోయాడు. వి.వెంకట నారాయణరాజు గారు నాకు ఒక కథ చెప్పారు. ఆ కథ ఆయన బంధువులు, శత్రువులు చేసిన యుద్ధం గురించి. దాంట్లో వి.ఎన్. ఒక పాత్ర. ఇతగాడు మంచి కులాసామనిషి.

అన్నిటిని సరదాగా తీసుకుపోయే మనిషి. తాము గౌరవించే వారి గురించి కటువుగా చెప్పాలంటే పారిపోతాడు, గాభరాపడతాడు. సైనిక భటుల గురించి కథ. అతని మాటల్లో స్థానిక పద ప్రయోగాలు అధికం. పెసెచి, నాం, యేటు (తెలుగు లిపిలో)

ఏదో నవలలో మాడుగులలోవ గురించి రాయాలి. పార్క్ ఫెయిర్ ఎగ్జిబిషన్ తగలబడ్డ గురించి కూడాను.

☆ ☆ ☆

* 28-3-1895 *

ఆనందాచార్లు గారిని కలుసుకున్నాను. రామస్వామి శెట్టిగారి యింట్లో శ్రీనివాసాచారిగారిని చూశాను. చాల కులాసా యువకుడు. ఆయన ప్రచురిస్తున్న పత్రిక తీరు దాని విజయానికి అనుకూలం కాదని ఆయన ఒప్పుకున్నారు. కవిత్వం, ముఖ్యంగా ఆధునిక కవిత్వం పాఠకులకు ఎన్నటికీ నచ్చదన్నారు. ఇంగ్లీషు సాహిత్య రచనల్ని అనువదించగలవారు చాలా కొద్దిమందే వున్నారన్నారు. అనువాదాలు బాగుండడం చాల అరుదన్నారు. ఆయన ఒప్పుకున్నారు. కాని దేశీయ పట్టభద్రుల్లో ఉపజ్ఞ తక్కువగా వున్నందుకు ఆయన నొచ్చుకున్నారు.

అచ్చు రేట్లు:

6 రూపాయలు రామస్వామి శెట్టి
4 రూపాయలు
4-4 మెరుపు డెమ్మీ

15 అణాలు పౌండ్లు
$1\frac{3}{4}$ అలంకారపు హంగులు, $3\frac{1}{4}$ జి.ఎం.

☆ ☆ ☆

*** 29-3-1895 ***

పట్ట ప్రదానోత్సవానికి వెళ్లేను. ఏర్పాట్లు తృప్తిగా లేవు.

☆ ☆ ☆

*** 30-3-1895 ***
**శనివారం**

డాక్టరు బ్రౌనింగ్‌గారు వచ్చారు.

నౌకర్ల ప్రయాణం ఖర్చుల కోసం, వారి మార్చి నెల జీతం కోసం నాయుడుగారి నుండి యాభై రూపాయలు తీసుకున్నాను.

| | |
|---|---|
| మార్చినెలకు జీతం | 18–8–0 |
| ఏప్రిల్ దిన భత్యం ఎనిమిది రోజులకు | 6–4–0 |
| రోగి ప్రయాణపు ఖర్చులో తేడా | 20–12–0 |
| ఇతర ఖర్చులకు అడ్వాన్సు | 15–12–0 |
| మొత్తం | 61 రూపాయలు. |

ముత్తుస్వామి అయ్యర్ స్మారకార్థం బడికుర్రాళ్ళు చూడడానికి, యీ సాయంత్రం టౌన్‌హాల్ కెళ్ళాను. మార్టిన్‌గారు అధ్యక్షత వహిస్తారట. కాని, ఆయన గారు రాలేదు. అంచేత పరమేశ్వర పిళ్లై గారు అధ్యక్షత వహించారు. రాబర్ట్‌సన్‌గారు, బ్రౌనింగ్‌గారు సహకరించారు.

☆

*** 30-3-1895 ***

భారతదేశపు సంపూర్ణ పోరాటాల గురించి మెల్లిసన్ పుస్తకం కోసం అప్ప చేశాను (?) నాటకానికెళ్ళాను. జేబుదొంగ. కొన్ని పాత్రలు మరీ మెల్లగా మాట్లాడాయి. రంగాలంకరణ ఘటనల్లో (1892) వున్నంత బాగాలేదు. కథ మరీ ఆసక్తి పుట్టించలేదు.

☆ ☆ ☆

*** 31-3-1895 ***

అడ్మిరాల్టీ భవనంలో విందు.

మద్రాసు తిరిగి వచ్చాను.(?)

నడక, గుర్రపుస్వారి, చదువు, సైకిల్ తొక్కడం, ఈత, గానం... డాక్టర్.జాన్...

(1) చన్నీళ్ల స్నానం (2) మూత్రం (3) ఎన్.ఐ, (4) ఈత రోజు (5) జలుబు, మందకొడితనం, ఎస్.ఐ (6) మిమ్స్ జబ్బు (7) డి.వై.ఎస్ (8) గుండె

(9) ఊపిరితిత్తులు (10) తలనొప్పి (11) బడి (12) ఆపరేషన్(?) (13) మాత్రలు (14) లేదా ఐ.ఎన్.టి (15) సార్థీ(?)

డాక్టర్ జాన్.... కంఠస్వరం పరీక్ష.... నాన్నగారి హాస్యం.... నిద్రపోయినప్పుడు.... పర్వతం.... పళ్లు, కాఫీ సైతం.... పక్షవాతం, దిగ్భ్రాంతి....

పరమేశ్వర పిళ్లైగారు విందులో వున్న వారిలో ఒకరు. చాలా మంచి భోజనం వడ్డించారు. ప్రతి ఒక్కటి చాల చక్కగా ఏర్పాటు చెయ్యబడింది. మేము (బ్రాహ్మణులం) ఉదయం అల్పాహారం ముగించాక, మేము వెళ్ళి యితరులతో కూర్చున్నాం వాళ్లు తింటుండగా. తినడం ముగిసిన తరువాత, సోడా చేతపుచ్చుకొని విందు ఆరగించిన వారి ఆరోగ్యాన్ని కోరుతూ, చిన్న ఉపన్యాసం చేశాను. శ్రీనివాసాచారి, సుబ్బారావు గార్లు పాడారు. మహారాజులుంగారిని పొగుడుతూ పాడమని నాయుడుగారు వారిని కోరేరు. అటువంటి పాటలు అందరికి చాలా యిష్టంగా వుంటాయన్నారు. మహారాజులుంగారి భవనంలో మాత్రమే యిటువంటివి జరగాలి. ఎంతటి వారయినా యింకొకరి కోసం జరుగకూడదు. సంతోషంగా ఉండడం ఎలాగో వారికి తెలుసు. ఇతరుల సంతోషంలో వారు పాలుపంచుకుంటారు. డాక్టరు బ్రౌనింగ్ గారి ఇల్లు గిండీలో వుంది. ఆయన ఇంట్లో లేరు. ఆఫీసు గది తూర్పు వేపుగా వుంది. అది చాలా చల్లగా ఉంది. గిండీపార్కు అందంగా లేదు. గడ్డి అంతటా ఎండిపోయింది. చెట్లు ఒకటికొకటి చాల ఎడంగా వున్నాయి. పెరుగుదల లేకుండా వున్నాయి. ఒక అల్మారా నిండుగా పుస్తకాలతో ఎక్కువ భాగం ఆయన వృత్తికి సంబంధించినవి. అయితే షేక్స్పియర్ సాహిత్యం వుంది. ఏసుక్రీస్తు చిత్రం వుంది. నేను బట్లరుతో కబుర్లు వేశాను. తన యజమాని అంటే అతనికి చాలా యిష్టంలాగా వుంది. బ్రౌనింగ్ తన వద్దకు చికిత్స కోసం వచ్చిన వారిని చాల జాగ్రత్తగా పరీక్ష చేస్తారు. రోగ నిదానం చెయ్యడానికి ఒక్కొక్కప్పుడు కొన్ని రోజులు పరీక్ష చేస్తారు. పెద్దతనం, నెమ్మదితనం ఆయన్లో కన్పిస్తాయి. తాను అనుకున్న దానిని మహారాజులుం గారికి చెప్పే కొద్దిమందిలో ఆయన ఒకరు. మహారాజులుంగారు లేనప్పుడు డాక్టరు బ్రౌనింగ్ ఫీజు తక్కువగా వుంటుంది. ఆ వృత్తిలో వున్నవారి రేట్లకంటె తక్కువగా వుంటుంది. మద్రాసులోని స్థానికులు, బ్రౌన్‌ఫీట్ వెళ్ళేక, డాక్టరు బ్రౌనింగ్ ఆ వృత్తిలో ఘనాపాటిగా వున్నారు. వైద్య పత్రికలకు ఆయన రాస్తుంటారు. గోషాసుపత్రి గురించి ఆయన ఎంతో శ్రద్ధ తీసుకుంటారు. గవర్నర్, ఈ సందర్భంగా తన ప్రశంసను వ్యక్తం చేశారు.

పరమేశ్వర పిళ్లైను నారాయణమూర్తికి పరిచయం చేశాను.

మీ అవయవాలకు యిబ్బందేమీలేదు. కాని, మీ నరాలు ముక్కలై వున్నాయి. సాధ్యమైనంత వరకు సంభోగం మానండి. పీపైన్ చూర్ణాలు తీసుకుంటూ వుండండి. అవి మానేసినా యిబ్బంది లేదనుకునేవరకూ. ఉప్పు వద్దు. తరచు డోసు తీసుకోండి. పళ్లు, సోడా. మీరు కాలేజీలో వుండకూడదని నా అభిప్రాయంగా మహారాజులుంగారికి తెలుపండి. ఎండలో తిరగకండి. ఎండలో వుండకుండా ప్రయాణం చేయాలంటే చెయ్యండి. కాడ్ లివర్ ఆయిల్ త్రాగుతూ వుండండి. బలం వస్తుంది.

వేసవిలో చన్నీళ్ళ స్నానం చేయవచ్చు. చలికాలంలో నునువెచ్చని నీళ్లు. గుర్రపు స్వారీ చెయ్యండి. సైకిల్ తొక్కవద్దు. గుండెకది చెడుపు చేస్తుంది. మీ మూత్రం గురించి సమాచారం ఏమిటో మీరు తెలుసుకోవలసిన అవసరం లేదు. అది శరీర సంబంధమైన ఆతృత మాత్రమే. ఏ విధంగాను అది మీ చికిత్సను యిబ్బంది పెట్టేది కాదు.

☆ ☆ ☆

* *1-4-1895* *
సోమవారం

2 రూపాయలు అప్పు.

☆

* *2-4-1895* *
మంగళవారం

5 రూపాయలు బ్రహ్మం

☆

* *3-4-1895* *
బుధవారం

బెంగుళూరుకు బయలుదేరి వెళ్ళాను. రామస్వామి మొదలియార్ సత్రంలో రాత్రి భోజనం దొరకలేదు. నేరుగా బెంగుళూరు వెళ్ళే రైలులో రెండో తరగతిలో చోటు దొరికింది. అంచేత మెట్టుపాలయం కార్లలో ఎక్కాము. ఒక యూరేషియన్ మిత్రుడు దొరికాడు. అరక్కోణంలో ఘటన. జొలార్ పేటలో రైలు మారాము.

☆

*4-4-1895*
గురువారం

డాక్టరు హాల్స్ దొర వద్ద వెంకయ్య, కృష్ణగార్లను చూసాను. ఇక్కడ బాలయ్యనాయుడిగారి చక్కని భవంతి ఉంది. ఆయన డవేదారు. వెంకోజీరావ్ దేశ్‌ముఖ్ మమ్మల్ని చాల శ్రద్ధగా చూసారు. సత్రంకి అనుబంధంగా కార్ఖానా. మద్రాసులో కంటే ఇక్కడ దిగువ తరగతుల వాళ్ళ దుస్తులు బాగున్నాయి. స్త్రీలు ఎక్కువ రంగు బట్టలు వేసుకున్నారు. ఇక్కడ నూతులు చాలా లోతు. రాళ్ళతో కట్టినవి. నాలుగు పెద్ద పలకలు. నూతి వెలుపలి గోడకు నాలుగు పెద్ద రాతి పలకలు అమర్చబడ్డాయి. ఇక్కడి బడుల్లో తెలుగు నేర్పడం జరుగుతుంది. వీడలో ఉష్ణోగ్రత స్థితి గురించి వెంకట్రావుగారు ఫిర్యాదు చేస్తున్నారు.

1. నాటక శాలలున్నాయా?
2. స్థానికుల క్లబ్‌లు.

3. స్థానికుల వార్తా పత్రికలున్నాయా?

పళ్లు తోముకోడానికి పందుంపుల్ల ఒకటి నాకు కావాలి. నా స్నేహితుడు నల్లటి పళ్లపొడి ఇస్తానన్నాడు. పందుంపుల్ల గురించి అర్థం చేసుకోలేదు.

ఒక అంగుళం లావు పుల్లను నౌకరు సంపాదించాడు. 5 అణాలు, నటేశశాస్త్రి సాధ్యమైతే మిస్టర్ రైస్‌ద్వార. (జాన్ స్ట్రీట్)

డాక్టరు హాల్స్‌ద్వార, నంది దుర్గ్‌రోడ్డు. మిస్టర్ రెవరెండ్, రాయల్ ఆర్టిలరీ తుపాకుల సైన్యం, మెస్ భోజనశాల. మిస్టర్ ఆడమ్‌ని మద్రాసులో తప్పక చూడాలి. బెంగుళూరు కన్‌టోన్‌మెంట్ స్టేషన్‌లో సోడా దొరకదు. వెంకటదశకి (?) వైష్ణవ ఆచార్య వెంకయ్యగార్ని, కృష్ణశాస్త్రిగార్ని, డాక్టరు హాల్స్‌ద్వారగారి ఇంట్లో చూసాను. ఆయన ఓసెంట్ రోడ్‌లో ఒకంత్ వద్ద, నంది దొడ్డి వీధిలో ఉంటున్నారు. కొన్ని శాసనాలు కాపీ చేశాను. కొండపడమటికి చెందినవారివి. సాయంత్రం ఇంటికి వచ్చాను. నగరంలో అటు ఇటు పచారి చేశాను. అది చాల ముద్దు ముచ్చట్లతో ఉన్న నగరం. అయితే వీధులు కంగాళీగా, ఇరుగ్గా ఉంటాయి. ఇళ్ళు ఎక్కువ భాగం మట్టితో కట్టినవి. పై కప్పులు మట్టితో వేసినవి. ఇక్కడ అక్కడ ఒక మంచి ఇళ్ళు. తక్కువ జాతి స్త్రీలు మద్రాసు, విశాఖపట్నం కంటే చాల మంచి బట్టలు వేసుకుంటారు. జనం తెలుపు రంగులో ఉంటారు. చూడటానికి బాగుంటారు. బజారు ఆకారం ఏమీ ఆకర్షణీయంగా లేదు. వీధులు మద్రాసులో కంటే నయం. పకోడీలు అద్భుతం. చోళా పొడుగా వుంది. శ్రీనివాసపఠనాలయానికి వెళ్ళాను. కోట నెల జీతం 50 రూపాయలు పంపింది. అది తీసుకున్నవాడు సంతకం చేయవలసి వుంటుంది. ఇరుకుగా పొడవుగా ఉన్న గది శుభ్రంగా ఉంచబడింది. వెలుతురు బాగా వుంది. అమృత బజారు, డెయిలీ పోస్టు, మద్రాసు మెయిల్, టైమ్స్, స్టేన్‌డర్ట్ (?) ఇక్కడ ప్రతి ఒక్కరు మర్యాదగా ఉంటారు.

స్వామి అన్న వ్యక్తిని చూశాను. ఆయన రావుగారి పెద్ద గుమస్తా. ఆర్కెలాజికల్ సర్వేవారి మనిషి. ఇళ్ళు ఎందుకు అంత పొడుగా నిర్మించారని అడిగాను. అవువనక తప్పిందికాదు. ఆ ప్రదేశపు అమ్మాయిలు చూడ చక్కని వారు. గృహ నిర్మాణం గురించి, పురాతన వస్తువుల గురించి మాట్లాడుకున్నాము. పీవెల్ కాగితాలు ఎక్కడున్నాయో ఎవరికీ తెలీదు.

ఆనందమహల్ చూసాను. చక్కగా కట్టారు. మంచి అభిరుచితో సామగ్రి అమర్చారు.

☆ ☆ ☆

*** 5-4-1895 ***

సెంట్రల్ కాలేజీకి బండిలో వెళ్ళాను. మిస్టర్ టెయిట్‌తో చాలసేపు మాట్లాడాను.

కాఫీ తాగాను. అది మెచ్చుకోవల్సిన భవనం. ఆవరణ చాల పెద్దది. టెన్నీస్ కోర్టుకు రెండు వైపుల తీగ కంచె సుమారు 8 అడుగుల ఎత్తుది ఉంది. బంతులు అన్ని

వైపుల ఎగిరి పోకుండా. ఈ భవనంలో కాలేజీ, ఉన్నత పాఠశాల విభాగాలున్నాయి. అల్పాహారశాల నాలుగు వేల రూపాయల ఖర్చుతో కట్టినది అది. గుఱ్ఱపు శాలలు, పాయిఖానాలు.

గణితశాస్త్ర ఉపన్యాసకుడ్ని చూసాను. ఆయన పేరు వెంకటస్వామి నాయుడుగారు. ఉపాధ్యాయుల గదిలో ఎదురుచూసాను. మాధవరావుగార్ని, విజయరాఘవాచారిగార్ని, రామానుజాచారిగార్ని ఆయన ఎరుగుదురట. ఆయన జీతం మూడువందలు.

సామాన్లు బాగా లేవు. చక్కగా అమర్చలేదు. విజయనగరంలో కంటే ఇక్కడ కుర్చీలు బాగోలేవు. పది రాత బల్లలతో ఉపాధ్యాయుల గది అమర్చబడివుంది. పఠన మందిరంలో మూడు చక్కని మేజా బల్లలున్నాయి. గ్రంథాలయాధికారి జీతం నెలకు ఇరవై అయిదు రూపాయలు. గ్రంథాలయంలో మూడువేల సంపుటాలున్నాయి. ఒక అల్మారా నిండా బైండ్ చేసిన పత్రికలున్నాయి. గ్రంథాలయంలో చెప్పుకోవలసింది ఏమీ లేదు. గణితశాస్త్ర శాఖలో విద్యార్థులు ఎనిమిది మంది. పదార్థ విజ్ఞాన శాస్త్రంలో 25 మంది.

మిస్టర్ వెయిట్‌తో సుమారు గంట సేపు మాట్లాడాను. ఆయన ఇంగ్లీషు ప్రొఫెసరు. స్థానిక విద్యార్థుల్లో చాలా మంది తీరు తెన్నుల గురించి ఆయన ఫిర్యాదు చేశారు.

వాళ్ళు స్థానిక విద్యార్థులతో కలసి మెలసి వుండరు. తమ ప్రొఫెసర్ల దగ్గరకు వెళ్ళాలని ఉన్నా వెళ్ళరు. మేము పాఠశాలలో చదివినప్పుడు ఆవిధంగా లేం. మేము కలిసి ఆడుకునే వాళ్ళం. కలిసి పోట్లాడుకునే వాళ్ళం. వారికి దేవుడు, దెయ్యమన్నా ఖాతరు లేదు. వారికి మనసులో పాదుకొని ఉన్న భావాలు. తమ మత చరిత్ర గురించి ఉన్నవి వదలిపెట్టాలని ఉండదు. బాగా గౌరవించే మత సాంప్రదాయాలు, గౌరవభావం వారి కుండదు. నార్టన్ పరిపాలనలోని మద్రాసు బడిపిల్లల, విద్యార్థుల గురించి నా మనసులో ఉంది. ఇది విచారించవలసిన విషయమని ఆయన అన్నారు. విద్యావంతులైన హిందువులకు ధైర్యం లేదని డా.మిల్లర్ అన్నారు. చిన్నప్పుడే పెళ్ళిళ్ళు, దారిద్ర్య విద్యార్థులకు మనశ్శాంతిని ఇవ్వవు. అంచేత శ్రద్ధ లేకపోవడం, ఇది ఇంగ్లీషు విద్యార్థులకు భిన్నమైన గుణం అని అన్నాను నేను. దీనిలోని సత్యాన్ని ఆయన ఒప్పుకున్నారు. తనను పై తరగతులకు పంపమని తనను బ్రతిమాలుతారట. ఎంచేతనంటే తన బిడ్డ చావు పరీక్షల ముందు జరగడం వల్ల మనశ్శాంతిని లేకుండా చేసిందట. నేను ఆయనకు ఏం చెప్పానంటే మా ప్రిన్సిపాల్‌గారు పెళ్ళి చేసుకున్న విద్యార్థులకు సహాయం రద్దు చేశారు. ఇది అందరి విషయంలో జరుగుతుందని ఆయన అన్నారు. పెళ్ళి చేసుకుందామన్న విద్యార్థులకు ఆయన సాధారణంగా సెలవు ఇచ్చేది లేదు. అసాధారణమైన మాతృభాషా సారస్వతం ఇంగ్లీషు విద్యాభ్యాసంలో ఉండడానికి కారణమేమిటని నేనడిగాను. దీనివల్ల గౌరవభావం సాంప్రదాయ విద్యల పట్ల లేకుండా పోతుంది.

లాటిన్ గ్రీకు రచనల అధ్యయనం వల్ల సారస్వతంలో సృజనాత్మకత పెద్దగా పెంచుడం వల్ల ఆరోజుల్లో ఉజ్జీవన యూరప్ దేశాలలో విజృంభించడం జరిగింది

కదా. అటువంటి గొప్ప సారస్వతం ఇంగ్లీషు సారస్వతం వల్ల ఏల చెప్పుకోతగ్గట్టుగా భారతీయ భాషల్లో కలగలేదని అడిగాను. ఆయనకు జవాబు దొరకలేదు. ఒక మలయాళ నవల గురించి ఎక్కువగా చెబుతుంటానని ఆయన చెప్పారు. ఈ నవలను యూరోపియన్లు ఎగదోసినట్లుగా చెప్పారు. మద్రాసులో మలయాళ స్నేహితులతో చర్చించాను. ఆ నవల గురించి వాళ్లు పెద్దగా చెప్పుకోవడం లేదు. మిస్టర్ టెయిట్ యిలా అన్నారు. దానిలో హాస్య సంభాషణలు వున్నాయి. ఈ సంభాషణలు పొగవోడల గురించి ఒక విద్యావంతునికి, విద్యావిహీనునికి మధ్య సంభాషణ. కొందరు యూరోపియన్లకది ఎందుకు నచ్చిందో? వారికి హాస్యం యిష్టం. శైలి గురించిగాని, విషయం గురించిగాని అందచందాలు అమరాయా అంటే అది తనకు తెలియదన్నారు.

కళాశాలల్లో సారస్వతం కంగాళీగా బోధించడం కారణం. కుర్రవాళ్లకు శైలిలోను, విషయంలోను మంచి చెడ్డలు విలక్షణతో చెప్పకపోవడం కారణాలు. తమ విమర్శనా జ్ఞానాన్ని విద్యార్థులకు ఉపయోగించడం నేర్పడం లేదు. దీని అంతటిలోను వున్న సత్యాన్ని ఆయన వొప్పుకున్నారు. విచారించాల్సినవి ఇవి. తేదీలు, పుస్తకాల పేర్లు, తమకు అర్థం కానివి విద్యార్థులకు చెప్పుతున్నారు. ఎక్కువగా గొప్ప గ్రంథాల్ని, చరిత్రలు మాత్రమే. ఒక శకానికి చెందిన వాటిని వారి చేత చదివిస్తే బాగుంటుందని నేను సూచించాను డాక్టరు మిల్లర్‌కు. ఆయన అన్నారు కదా ఇప్పటికే వారి చేత చదివిస్తున్నది చాలా ఎక్కువ. ఇంకా ఎక్కువగా రుద్దడం మరీ ఎక్కువ అవుతుంది. కాని వీరి ప్రతిపాదన కొంత హేతుబద్ధమైనదీ, ఉపయోగకరమయ్యేదీ. మీ ప్రతిపాదన బాగా వుందన్నారు.

బి.ఏ. సాధారణ ఇంగ్లీషు భాష అనుసరించి చేయడం విశ్వవిద్యాలయం పూర్తిగా వదలిపెట్టింది. సాధారణ భాష ప్రశ్నపత్రం ఒక చికాకు పని. ఏది అడుగుతారో సరిగ్గా తెలియదు.

పరీక్షకుల తలలో ఉన్నదాన్ని బట్టి ఈ ప్రశ్న పూర్తిగా ఆధారపడి వుంటుంది. మద్రాసు కళాశాలల్లో ఏం చెబుతారో అన్నదాని కంటే మేము ఎక్కువగా చెప్పాలని నేను ఆయనకు చెప్పాను. మద్రాసు కళాశాలల్లోని ప్రొఫెసర్లు, విశ్వవిద్యాలయ పరీక్షకులు కేలన్ వాక్య నిర్మాణం స్కీట్ భాషా సరళి. మద్రాసు కళాశాలల్లో ఇంకా ఇది బోధించడం లేదు. నాలుగైదు ఏళ్ళక్రితం ఈ పుస్తకాల నుండి నేను నోట్స్ ఇచ్చాను.

పాఠ్యగ్రంథంగా మీరే గ్రంథం ఉపయోగిస్తున్నారన్నాను. మేజాబల్ల మీద నుంచి అతనొక పుస్తకం తీశాడు. అది చూస్తేనే లాంగ్‌మెన్ గ్రంథంలాగా కనిపించింది. అది లాంగ్‌మెన్ గ్రంథం అన్నాను నేను. టెయిట్ అవును, అయితే మీకు తెలుసన్నమాట అన్నారు.

ఇక్కడ వున్నవి కొన్ని కంఠస్థం చేయవలసినవి. సాధారణ పుస్తకాలు, స్కూలు పుస్తకాలు కావు. విద్యార్థుల చేత చదివించాను. ఉపన్యాసకుడు ఒకడు ఆయనకు సాయం చేస్తాడు. అద్భుతంగా వుంది అని అన్నారు ఆయన.

తక్కువ తరగతుల వారికి ఇది భారంగా వుంటుంది అని ఆయన ఫిర్యాదు చేశారు. ఒక్కొక్క విద్యార్థి రచనలో తప్పులు పట్టడం సాధ్యం కాదని ఆయన అన్నారు. తప్పుల్ని ఊరకనే గుర్తు పెట్టితే ఉపయోగం లేదు. ఆ తప్పు ఏమిటో విద్యార్థికి తెలియదు. దిద్దుబాట్లు వ్రాసి పెట్టడం.

☆ ☆ ☆

*** 6-4-1895 ***

మహారాజులుంగారు రేపు మీకు టెలిగ్రామ్ ఇవ్వబోతున్నానని అన్నారు. దిద్దుబాట్లు చేస్తున్నందుకు ధన్యవాదాలు చెప్పారు.

భవనం చూసాను. మిగిలింది 80 రూపాయలు. ఈ ఉదయం భవనాన్ని చూసాం. చక్కని భవనం. విజయనగరంలోని మోతీమహల్ కంటే ఇంపుగా సామగ్రి అమర్చిలేదు. కొన్నిచోట్ల వైభవం కన్పిస్తుంది. దాని ప్రక్కనే వసతి కన్పిస్తుంది. కొన్ని మెట్లు బాగాలేవు. నేలకు చాపిన కర్రపలకలు ఏమి ఇంపుగా లేవు. ఎక్కువగా చిత్ర పటాలు లేవు. మహారాజుగారి గ్రంథాలయం చిన్నది. దాంట్లో ఉన్న పుస్తకాలు తేలికగా చదువుకునేవి. నవలలు అటువంటివి పుస్తకాలు తప్పితే ఇంకేమిలేవు. ఒక తమిళ పిళ్ళై క్రింద ఉంది ఈ భవనం. భవనాన్ని మూసి వేయాలని ఎవరూ లోనికి రాకూడదని మహారాణి ఆజ్ఞ అని చెబుతారు. ముందుగా నాకు తెలిసినట్లయితే లోపలికి అడుగు పెట్టేవాడ్నికాను. ఆయన పట్ల గౌరవాభిమానాలు అధికం. ఆమె నడవడి హుందాగా ఉంటుంది. ఎంతో బాగుంటుంది. ఆమెకు ఇంగ్లీషు, కన్నడం, తెలుగు భాషలు వచ్చు. ఇద్దరూ ధారాళంగా మాట్లాడతారు, రాస్తారు. మహారాణి వారి విషయంలో మన దేశం గర్వించవచ్చును. ఆమెకు అయిదుగురు బిడ్డలు. ఈ కుటుంబం ఆనందంగా జీవించునుగాక! పిల్లలు తమ తలిదండ్రులకు తగిన వారుగా ఉందురు గాక! కీర్తిశేషులైన మహారాజుగారు డిఫ్తీరియా వల్ల కలకత్తాలో మరణించారు. సియాల్దాకోటలో మహారాజుగారి అతిథిగా ఉన్నప్పుడు చనిపోయారు. మా యజమానికి తంతి ద్వారా తెలిసినపుడు, ఆయన ఎంతో బాధపడ్డారు. ఈ మహారాజులు మంచి స్నేహితులు. ఒకరిపట్ల ఒకరికి ఎంతో గౌరవం. డవేజర్ మహారాణి కలకత్తా నుండి బయలుదేరినప్పుడు రఘుబాబు సాహెబ్‌గారికి ఈ విషయం మన మహారాజుగారికి తెలియజేయమని కోరారు.

మహారాణిగారు తన భర్త తన ఇంటిలోనే మరణించినందుకు కొంత ఊరటగా వుందని తమకు విన్నవించవలసిందిగా నన్ను కోరారు. ఈ కుటుంబాల మధ్య స్నేహసంబంధాలు కొనసాగాలని ఆమె ఆశించారు. మహరాణివారి సద్భావనను మహరాజులుంగారు మెచ్చుకున్నారు. మహరాజులుంగారు పెద్ద పండితుడేమి కాదుట. ఆలోచనాపరుడూ కాదట. మున్నుస్వామి (తెలుగు లిపి) అయ్యో సైనిక విభాగం నియామకం జరిగింది.

కొద్దిగా పాలు (?) (పౌడరు) చూర్ణం కాస్తంత... (?)

వస్తుప్రదర్శనశాలను చూడటానికి వెళ్ళాను. చక్కని తావు. దాని అధిపతి చాల మర్యాదస్తుడు.....(?) తీసుకున్నాము. విజయనగరంలోని దంతపు పని అంతా

బాగా ఉంది. ఇక్కడి దంతపు పని ఇంకా రమ్యంగా ఉంది. కుంచెతో రాతిని శుభ్రం చేయాలి. తరువాత ధూళిని కడిగివేయాలి. తరువాత కాగితాన్ని నీటిలో ముంచి సరిసమానంగా శాసనాల మీద పరచాలి. తరువాత కుంచెతో కొట్టాలి. వివరాలన్నీ స్పష్టమయ్యేదాకా, కాగితాన్ని నీటిలో ముంచాక దానిని నీటి డబ్బాలో పిండాలి. నౌకరు మొదట నాసిక్ కాగితాన్ని అచ్చు కాగితం మీద అద్దాలి. చిన్న అద్దకాలు (?) రావచ్చును. నాసిక్ కాగితం అద్దకం చేసేటప్పుడు అక్షరాలు గుల్లగా ఉన్నట్లయితే రాయి గరుకుగా వున్న జిగురు రాయాలి. లాంతరు మసిని, సిరా పొడిని ఒక పీసాలో వేసి అది సిరాలా తయారయ్యేంత వరకు నీరు పొయ్యాలి. తరువాత దీనిని కొద్ది కొద్దిగా అట్ట మీద అద్ది ఇతరం కాగితం మీద చేసినట్టుగా ఒత్తాలి. తరువాత శాసనాల మీద అద్దకం చేయాలి. సిరాను పదేపదే వెయ్యాలి. ఒక ప్రక్కను జాగ్రత్తగా చుట్టబెట్టాలి. రెండు కాగితాలు ఒకదాని మీద ఒకటి.

సైనిక బృందంలో ఒకటి చిత్రాల్. వీడ్కోలు చాల దుఃఖకరంగా ఉంది. రైలు బండి పోతూ వుంది. సిపాయిలు చేతులు ఊపుతున్నారు. కృష్ణశాస్త్రి మంచి అధికారిలా ఉన్నాడు. రవ్వంత దర్పం. నేర్పడానికి, నేర్చుకోడానికి ఆయన సిద్ధం. కాని మర్నాడు ఆయన రాలేదు. అంచేత వెంకయ్యగారి దగ్గర ఉండిపోయాను. తన కాలం అంతా పనిలో నిమగ్నులై ఉన్నారు. ఆర్కియాలాజికల్ పనుల్లో తన శక్తి సామర్థ్యాలు ఉపయోగిస్తున్నారు. తన గురించి తాను అధికృత భావనతో ఉన్నారు. కాస్త అసూయ కూడ. తెలుగు శాసనాలు నాకివ్వడానికి ఇష్టపడటం లేదు. రికార్డులు ఇవ్వడానికి ఆయన ఇష్టపడటం లేదు. ఇలియట్ సేకరించిన తెలుగు శాసనాలు అడిగాను. హుల్ట్జుదొర తీసుకొని ఉండవచ్చునని ఆయన అన్నారు. బెజవాడ శాసనాలు, నాదెండ్ల శాసనాలు చూడండి. వాటిలో ముఖ్యమైనది ఏదో ఉంది. ఈ రెండు ఉన్నది ఎక్కడ? సింగ శాసనాలు ఏమైనా ఉన్నాయా, లేదు. ఒక్కటే ఉండేది. దానిని ఎడిటింగ్ చేయడానికి డా. కీల్‌హార్న్‌కు నేను 'పీవెల్'ను చూపాను. రెండు శాసనాలు చేర్చబడ్డాయి. ఇది తప్పై ఉండాలని ఆయన అంటున్నారు. మొదటి రెండు రోజులు డా.హుల్ట్జుదొర పొగడ్తతో గడిచిపోయాయి. ఆయన బాగా శ్రమపడి పని చేస్తారు. మంచి సంస్కృత పండితుడు. రాజేంద్రలాల్ మైత్రా మంచి సంస్కృత పండితుడేమికాదని హుల్ట్జుదొర అన్నారు. బండార్కర్ సంస్కృత శాసనాల్లో కొన్ని శాసనాల్ని నేను చూసాను. నేను బయటకు రావడానికి ముందర నా సంస్కృత భాషా జ్ఞానాన్ని పెంచుకోవాలి. చోళరాజ రాజుగారు, ఆయన అక్క కుండవ మధ్య సంభాషణలు ఊహించుకొని నేను రాస్తున్నాను. రాజరాజు గురించి కొన్ని వ్యాసాలు రాయబోతున్నాను. ఆయన సామర్థ్యం వడవడి వగైరా దక్షిణ భారతదేశ చరిత్రను నిర్దుష్టంగా ఒక వ్యాస సంగ్రహం రాయాలని ఉందని నేను అన్నాను. ఆ విధంగా కొన్ని నాటకాలు, నవలలు రాయడానికి చారిత్రక చట్రం తయారుకావచ్చు. వీటిని తెలుగులో రాద్దామని నా ఉద్దేశం. ఇటు వంటిదే తాను చేద్దామని ఉందని ఆయన చెప్పారు. కృష్ణా, గోదావరి జిల్లాలలోని వర్తమానకాల వివరాలను ఇవ్వమని అడిగాను. కాని, ఆయన ఇవ్వలేదు. నాకు తీరుబాటు తక్కువగా ఉన్నప్పుడు నన్ను బాతాఖానీలోకి దింపాడు. శాసనాల్లోని కొన్ని తెలుగు

పదాల అర్థం గురించి తనకు చెప్పమని కోరాడు. నాకు సాధ్యమైనంత సహాయం నేను చేసాను. కరికాళచోళుడు అన్న పేరు చాలమందికి ఉన్నదని ఆయన అనుకున్నారు. కావేరి నదిపై ఆనకట్ట లేక వంతెన కట్టినది ఎవరో ఆయనకు తెలియదు. కరికాళుని గురించి ఆయన జ్ఞానం బహు అల్పం. స్థానిక కైఫీయతులు, దాఖలాలు అంటే ఆయనకు విలువలేదు. ఇలియట్ తెలుగు శాసనముల సంపుటి యిలియట్ దొరగారు ఆఫీసుకు పంపించివేశారు. ఈ శాసనాల సంపుటాలను పరిశీలించినట్టు ఎక్కడా కన్పించలేదు. ఇందులో కొన్ని దానాల గురించి ఉంది. మూల ప్రతులు దొరకడం లేదు. రెండు వేల సంవత్సరాల క్రితపు దాన శాసనం ఉంది. బహుశా అది (ఫోర్జరీ) దొంగరాత. కుంచెలు అద్దకపు అట్టలు కావాలన్నాను. నా కోసం తానే తెప్పించి వుండవచ్చును. కాని, ఆపని ఆయన చేయలేదు. డా.హూల్ట్స్‌దొర అతనికి రాయమన్నారు. ఆఫీసులో నేను సేకరించిన ఛోగట్టాను ప్రచురింపవద్దని ఆయన కోరారు. డాక్టరుగారి అనుమతి లేకుండా అది ఇవ్వబడిందన్నారు. ఆయన ఊటీలో ప్రివిలేజ్ సెలవులో ఉన్నారు. కొన్నిటిని ఫోటోలు తీసుకుందామనుకున్నాను. దానికోసం కూడ డా.హూల్ట్స్‌దొర అనుమతి కావాలట. ఆయనగారు తరచు ఉత్తరాలు జవాబులు రాయరు. ఆయనకి మరపు ఎక్కువని వెంకయ్యగారు అంటున్నారు. మార్పులు కూడ చేస్తుంటారు. తన మనసులో ఏముందో ఆయనకే తెలీదు. ఎక్కువ కాలం ప్రయాణం ఆయన కిష్టం ఉండదు. సీవెల్ సంపాదించిన కైఫీయతులు ఎక్కడున్నాయని అడిగాను. ఆయనకు తెలీదు. ప్రభుత్వం సేకరించిన వాటి వివరాలు ప్రతులు ఎక్కడున్నవని అడిగాను. అవి కూడ ఆయనకు తెలియదు. రావుగారి దగ్గర అవి ఉండవచ్చునని ఆయన అనుకుంటున్నారు. తన స్వంత ఆస్తి అని ఆయన భావిస్తున్నారు. రావుగారి సహాయకుడ్ని నేను కలిసాను. ఆయన విషయాలు తెలియచెప్పతారు. కాగితాలు తన కార్యాలయంలో లేవని ఆయన చెప్పారు. తరువాత ఎక్కువ విషయాల్ని రాసిపెట్టారు. డా.రావు పండితుడేమి కాడని మిస్టర్ రెయిట్ నాతో అన్నారు. గృహాలు, రాళ్ళు జాగ్రత్తగా చూడటం ఆయన పని. గృహ నిర్మాణం గురించి ఆయనకు తెలిసింది తక్కువ. అపోర్ట్ ఒక అవివేకి. సీవెల్ అంతకుమించిన వాడేమికాదు. సంతృప్తికరంగా పనిచేయడం ఎలాగో నటేశన్‌కు తెలియదు. జానపద సారస్వతం ఆయనను ఊహాశాలిగా చేసింది. ఊహాస్వభావం కలవాడు. శాస్త్రీయ పద్ధతిలో పని చేయలేదు. నేర్పరితనంతోను, ఒత్తిడితోను అది జరుగుతుంది. నాకు సాధ్యమైనంత ఛోగట్టా సేకరించగలిగాను. కోటావారు గురించి ఆయనకు ఏమీ తెలియదు. రాజమహేంద్రవరాన్ని, కొండవీటి రెడ్డి రాజ్యాల్ని యుద్ధాల ద్వారా జయించిన సామ్రాజ్యాలని వీరేశలింగం గారు చెప్పారు. గజపతి మహా మండలేశ్వరుడుగా ఎందువల్ల బిరుదు స్వీకరించినది ఆయనకు తెలియదు. చోళుని తరువాత కాకతీయులు బలసంపన్నులు. భారతీయ పురాతన చరిత్ర ఇటీవల సంపుటాలలో తూర్పు ప్రాచ్య చాళుక్యుల గురించి ఫ్లీట్ రాసారు. సాగి వంశస్థుల గురించి మీకేమన్నా తెలుసునా? తెలియదు. చివరి విజయనగర మహారాజు కృష్ణదేవరాయలు. ఆయన తరువాత పరిపాలకులు కొద్ది గ్రామాలు మాత్రమే పాలించారు. అయినా గొప్ప చక్రవర్తులమని ప్రకటించుకున్నారు. డా.

హూల్ట్స్‌దొర గిడుగు రామమూర్తిగార్ని ఆయన మనసులో పెట్టుకున్నారు. కాని, తరువాత తెలుగుదేశంలో ఎక్కువ శాసనాలు లేవని కృష్ణశాస్త్రిని నియమించారు.

నాకు ఏమి సామర్థ్యాలు లేవు. నాకు విశ్రాంతి కావాలి. నా లక్ష్యం సాహిత్యసేవ. కాని, స్వతంత్రంగా పని చేయాలి.

ప్రాదేశిక నివేదిక గురించి వస్తు ప్రదర్శనశాలలో విచారించాలి. ఎపిగ్రాఫికల్ ఆఫ్ ఇండియాకు రచనలు చేసేవారికి పుటకు 5 రూపాయలు ఇవ్వాలి. తాత్కాలిక విభాగం విద్యాశాఖలో ఒక స్థానం కోసం ఆయన దరఖాస్తు చేశారు. డా. హూల్ట్స్‌దొర నా దరఖాస్తు మీద ఏమి వ్యాఖ్యలు చేశారో నాకు తెలియదు. ప్రభుత్వం నా వేతనాన్ని 250/–రూ. లకు హెచ్చించింది. ఆ విధంగా శ్రీనివాసయ్యంగారు నాకు చెప్పారు డా. హూల్ట్స్‌దొర పండితుడేమి కాడని. తన ఉద్యోగాన్ని శాశ్వతం చేయమని ఆయన ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టారు. లేదా పెన్షన్ ఇమ్మన్నారు. ప్రభుత్వం ఈ దరఖాస్తు ఆయన చేసిన పనిని బట్టి కొనసాగగలదని ఆయన దరఖాస్తుకు జవాబు చెప్పడానికి నిరాకరించారు. ఆయన నా గురించి కోరేదేమిటంటే

1. పినవీరన్న విషయాలు
2. .... అప్పన మంత్రి
3. తెలుగు గ్రంథాలకు పీఠికలు తన పుస్తకాల ప్రతులు పంపమని మా బంధువును కోరాలి(?)

☆ ☆ ☆

** 7-4-1895 **

మద్రాసు చేరాను. ప్రొద్దుటి పూట మద్రాసు చేరాను. సెంట్రల్ స్టేషన్‌లో టీ త్రాగాను. శ్రీనివాసశాస్త్రిగారు ఒక ముచ్చట చెప్పారు. బొమ్మిడిలో ఆయన ప్రవర్తన ఎంత మాత్రం బాగోలేదని నా అభిప్రాయం వ్యక్తం చేశాను. (నీలం సుబ్బారావు) తుని రాజుగారి బంధువులు, వెంకట నారాయణరాజుగారు. దాట్లవారి సాహస కృత్యం.... స్పెన్సర్‌లో ఉపాహారం తింటుండగా టెలిఫోన్ చేసాము. కేంద్ర కార్యాలయం నుండి ప్రత్యుత్తరం లేదు. బహుశా అది మరీ ప్రొద్దుట పూట అయ్యుండాలి. ఇంటి నుండి బండి వచ్చే అవకాశం లేదు. అందుచేత బండి కుదుర్చుకున్నాను. ఒక సార్జెంట్ బండిని ఆపాడు. బండిని ఆపి అనుమతి పత్రం అడిగాడు. నేనేమన్నానంటే రైలు ప్లాట్‌ఫాం నుంచి సామాన్లు తీసుకువెళ్ళడానికి అనుమతించారని, ఎందుకు నువ్వు అడ్డుతున్నావని నేనడిగాను. అవును, నన్ను వదలిపెట్టినందువల్ల నిన్ను నేను పట్టుకున్నాను. పట్టుకోడానికి నేనేమి నేరం చేయలేదే అన్నాను నేను. సార్జెంట్ తప్పు చేసిన వాళ్ళెవరు ఒప్పుకుంటున్నారు. నోరుమూసుకుని ఉండేందుకు సార్జెంట్ చేతిలో ఒక బేడ పడేశాను. అలా చేయనన్నాడు. బండివాడ్ని తిరిగి ప్లాట్‌ఫాం మీదకు వెళ్ళమన్నాను. సార్జెంట్ బెదిరించవద్దని చెప్పి తోవ వదలిపెట్టాడు. నాయుడుగారి మనుషులు బెంగుళూరులో ఎంతో దయ చూపారు. బెంగుళూరులోని వాళ్ళు చాలా మర్యాదస్తులు. ప్రతి ఒక్కరు నన్ను గౌరవంతో చూసారు. ఒక సమావేశానికి గోవిందరావు పంతులుగారు...

శ్రీనివాసాచార్యులు దగ్గర నుండి ఆహ్వాన పత్రిక వచ్చింది. బి.ఎల్. డిగ్రీ పరీక్షలో ఘనంగా పాస్ అయినందుకు శ్రీ వేపారామేశం పంతులుగార్కి లా కాలేజీ తెలుగు విద్యార్థులు ఒక వెండి కప్పును బహూకరించారు. ఆ ఆహ్వాన పత్రికలో జె.ఎస్.ఎస్, జి.ఎస్.సి.హెచ్ వారు నేను బెంగుళూరు నుండి తిరిగి వస్తే నన్ను కూడ ఆహ్వానించమని ఉంది. బెంగుళూరు నుండి తిరిగి వచ్చిన తరువాత చాల అలసటగా ఉన్నప్పటికి సభకు వెళ్ళాను. వెళ్ళకపోయినట్టయితే సామభూతి లేకపోవడంగా భావించవచ్చును. ఈ ప్రతిపాదన నాకు చేసినప్పుడు నా స్నేహితుడు జె.ఎస్.ఎస్ ప్రత్యేకించి నా ఉపన్యాసాన్ని చదివి వినిపించాడు. తెలుగు వాళ్ళు చాల వెనుకబడి వున్నారు. కాబట్టి మరీ గొప్పగా చెప్పుకుంటారు. చాల తెలివైన వ్యక్తిని మరీ అతిగా పొగిడినట్టయితే, తల తిరిగి పోతుందని ఈ తప్పటడుగును భావించవచ్చును. విద్యావంతులైన అందరికి దర్పం ఒక సహజమైన లోపం. అది మానసికమైన లోపం. అది ఎంతగా లేకున్నట్టయితే అంత మంచిది.

అతిగా పొగడడం దక్షిణ భారతదేశానికి చాల కీడు చేసింది. కొందరు అక్రమమైన నడవడి ఉన్నవారు, లేదా ప్రజ్ఞలున్నవారు దీన్ని అతిగా చెప్పుకుంటారు. నన్ను పొగిడేవాళ్ళు దీనిని అతిశయోక్తిగా చెప్పుకుంటారు. అతడు తనను వృద్ధి చేసుకోడానికి ప్రయత్నం చేయడు. అతనిని అనుసరించేవారు ఈ అక్రమాలను అతని అభివృద్ధికి తోడ్పడడానికి సాయపడరు. వీరేశలింగంగారు ఇందుకు ఒక ఉదాహరణ. ఈ ప్రత్యేక విషయంలో రామేశంగారు (గర్వికానందుకు) నిగర్వి అయినందుకు సంతోషిస్తున్నాను. ఆయన వినయం కలవారు. ఆయనకు ఎక్కువగా పాండిత్యం, సద్గుణాలు సామర్థ్యాలు ఉన్నట్లయితే అంత కంటే కోరవలసినదేమీ లేదు. ఆయన ఔన్నత్యం తప్పక పొందగలరు. ఇప్పటి మన మద్రాసు సింహాలు వంటివికావు. ఈ పెద్దమనిషి గురించి ఇంకా ఎక్కువగా చెప్పవలసింది ఏమీలేదు. కాని, సమావేశం అన్ని విధాల తగ్గట్టుగా ఉంది. అధ్యక్షునిగా ఉండమని కోరబోయేటట్టుగా ఉంది. కాని, నేను బెంగుళూరు వెళిపోయాను. నేను బెంగుళూరు వెళ్లినట్టు తెలుసుకొని శ్రీరాములుగారిని అధ్యక్షునిగా చేశారు. ఆయన బి.ఏ.బి.ఎల్... మద్రాసు హైకోర్టులో తెలివైన వకీలులో ఒకరు. మచిలీపట్నం నివాసి. ఆ రోజున నా దుస్తులేమి బాగోలేవు. నేను కూర్చోగానే ఎవరైనా అధ్యక్షత వహించడానికి అర్హత వున్నట్టయితే, అది మీకేనని అన్నారు. కాని, ఈ అసంగతం జరక్కుండా భగవంతుడు నన్ను కాపాడాడు. మిస్టర్ జె.వి.ఎస్ ప్రసంగం బాగోలేదు. దీర్ఘాలు, ఎవరికైన తల దిమ్మెక్కించినట్టుగా ఉంది. మిస్టర్ జగన్నాథన్‌గారు ఈ విషయంలో తీసికట్టు. ఒక మహమ్మదీయుడు తనంతట తాను మాట్లాడతానని వచ్చాడు. అతని తీరు బాగుంది. కాని, విషయం బాగోలేదు. ఆధునిక నాగరికతలోని చెడుగులలో ఉపన్యాసాలు చేయడం ఒకటి. మంచి ప్రసంగం కంటే చక్కనిదేదీ లేదు. కావి చెడ్డ ఉపన్యాసం కంటే సహించగలిగేది లేదు. ఉపన్యాసాలు ఎక్కువ భాగం బాగుండవు. రామేశంగారి తలకాయ ఇందువల్ల తిరిగి వుండవలసింది. దేవుడు మేలు చేస్తే ఇందుకు బాధ్యులు నా స్నేహితులు. మిస్టర్ జె.వి.ఎస్‌కు ఈవిధంగా చెప్పాను. నేనే అధ్యక్షునిగా ఉండినట్లయితే, నా ప్రసంగం ఉండేది. అందుకు కొంత పొగడ్త

నాకు వచ్చేది. కాని, నేను ఇంటికి వెళ్ళే ముందర నేను వేపా రామేశంగార్ని కలవాలి. ఆయన లోతుపాతులు తెలుసుకోవాలి. పి.యస్.ను 21వ తేది ఉదయం అల్పాహారానికి ఒకరోజు రమ్మని ఆహ్వానించాను. కాని, ఆయన రాలేదు. కవిగారు వచ్చారు. సూర్యనారాయణ పంతులు కవిగారు తన నవలలో 60 పేజీలు చదివి వినిపించారు.

సభలో శ్రీనివాసశాస్త్రుర్ని ఆ రోజు కలిసాను. సమావేశం తరువాత వెన్నెలలో ఆయన పాటలు పాడారు. డాబా మీద నా స్నేహితులు వెంకటపతిరాజుతో క్షత్రియుల విద్యాభ్యాసం గురించి మాట్లాడాను. మద్రాసు పకోడీలు చాల బాగుంటాయి. అరువత్తిమూరు ట్రిప్లికేన్ చేరడానికి చాల కష్టమైపోయిందని చెప్పడం మర్చిపోయాను. మొత్తం దారంతా జనంతో నిండిపోయింది. అరువత్తి మూరు శైవభక్తుల ఊరేగింపుతో కిటకిటలాడిపోయింది. చూద్దామంటే అందమైన ముఖం ఒక్కటీ కనిపించలేదు. (స్త్రీల మొహమే ననుకోండి)

జనవరి పది నుండి ఏప్రిల్ ఇరవై వరకు

| | |
|---|---|
| 16–10–8 | పైసలు శ్రీరామమూర్తి పంతులు వంట మనిషికి. |
| 11 | రూపాయలు వెళ్ళడానికి. |
| 27–10–8 | |
| 103–0–0 | |
| 130–10–8 | |
| 3–0–0 | పడవ చార్జీ |
| 133–10–8 | మిగిలింది 59–5–4 |

1 బండి అద్దె మిగతా సుమారు 40 మహారాజులుంగారి సామాన్లు తీసుకురావడానికి 6 జట్కాల అద్దె. నమూనా వెన్న తేవడానికి.

☆ ☆ ☆

* 8–4–1895 *

| | |
|---|---|
| 204 | |
| 80 | |
| * 120 | |
| 40 | మిగతా |
| * 160 | మిగతా |

(* జమఖర్చులు లెక్కల్లో తేడా వుంది. మూల ప్రతిలోనే పొరపాటు వుంది.)

☆ ☆ ☆

* 10-4-1895 *
బుధవారం

చిత్రకళా పాఠశాలకు వెళ్ళాను. పచ్చయప్ప కళాశాలకు వెళ్ళాను. అక్కడి నుండి బేంక్‌కు 180 రూ.ల చెక్కు ఇచ్చి డబ్బు తీసుకున్నాను. బాలస్వామి నాయుడు గారిచ్చినది. అక్కడి నుండి x కాలేజీ. అక్కడి నుండి రాజ్య విద్యా గ్రంథాలయానికి. అక్కడ పెన్సిల్ పోగొట్టుకున్నాను. ఎమ్.ఏ. విద్యార్థులు నన్ను ఆకర్షించారు. వాళ్ళు నా సలహాలడిగారు. నా సలహాలు చెప్పాను. బాలయ్య నాయుడు దగ్గర నుండి 180 రూపాయలు తీసుకున్నాను. దాని లోంచి 83 రూపాయలు రాజుల కిచ్చాను.

| | |
|---|---|
| కృష్ణరాజుకు మార్చిలో జీతం ఇచ్చినది | 30–0–0 |
| వెంకట రాజుకు | 7–8–0 |
| కృష్ణరాజుకు భత్యం ఏప్రిల్ | 21–0–0 |
| వెంకటరాజుకు | 5–4–0 |
| సోడా | 6–5–0 |
| పనివాళ్ళకు | 6–5–0 |
| బండి అద్దె | 2–0–0 |
| నరసింగరాజుకు సగం టిక్కెట్టు | 4–10–0 |
| | 83–0–0 |
| సైన్ దినభత్యం ఏప్రిల్ నెలకు 20 రూపాయలు ఇళ్ళు చేరేవరకు x తో కలుపుకొని గుఱ్ఱాలకు గడ్డి కోసం రూపాయలు | 20–0–0 |
| | 103–0–0 |

అసాధ్యం. బి.ఏ. సాధారణ ఇంగ్లీషు భాష అనుసరించి చేయడం విశ్వవిద్యాలయం పూర్తిగా వదలి పెట్టింది. సాధారణ భాష ప్రశ్నపత్రం ఒక చికాకు పని. ఏది అడుగుతారో సరిగ్గా తెలియదు.

పరీక్షకుల తలలోని ఉన్నదాన్ని బట్టి ఈ ప్రశ్న పూర్తిగా ఆధారపడి వుంటుంది. మద్రాసు కళాశాలల్లో ఏం చెబుతారో అన్నదాని కంటే, మేము ఎక్కువగా చెప్పాలని నేను ఆయనకు చెప్పాను. మద్రాసు కళాశాలల్లోని ప్రొఫెసర్లు, విశ్వవిద్యాలయ పరీక్షకులు, కేలన్ వాక్యనిర్మాణం, స్కీట్ భాషా సరళిని బోధించడం లేదు. నాలుగైదు ఏళ్ళ క్రితం ఈ పుస్తకాల నుండి నేను నోట్స్ ఇచ్చాను. అది గత సంవత్సరం ప్రారంభం. ఈ సంవత్సరం స్కీట్ గురించి ప్రశ్నలున్నాయి. ఇంకా కేలన్‌ను ముట్టుకో లేదు. నేను బెంగుళూరు వెళ్ళిన పని గురించి ఆయన భోగట్టా చేశారు. మిస్టర్ బెయిట్ తమ ఉపన్యాసాన్ని వినడానికి నన్ను అనుమతించినట్టయితే, నేనెంతో ఋణపడి వుంటానని సూచన ప్రాయంగా అడిగాను. మూడవ గంటలో నేను సాధారణ ఇంగ్లీషు పాఠం చెప్పబోతున్నానని

ఆయన చెప్పారు. నేనడిగినది ఆయనకు నచ్చినట్టుగా లేదు. ఇక నేను ఆ విషయాన్ని వదలిపెట్టేసాను. లియోనార్డ్ పాఠం విన్నాను. ఆయన మంచి ఉపాధ్యాయుడు కాడు. మిస్టర్ కెయిట్ గురించి ఎక్కువగా చెప్పారు. ఆయన చికాకుపడే మనిషని, కోపిష్టని విద్యార్థులంటారు. మర్యాద, మప్పితం ఉన్నవారని నాకనిపించింది. ఆయన అదే పనిగా నాతో బాతాఖానీ వేశారు. కాని, ఎంత మాత్రం మాటల పోగు కాదు. విషయం గురించి మాట్లాడేటట్టుగా నేను ఆయన్ని చేసాను. ఆంగ్ల, ఆంధ్రభాషా విషయాలు, వచన భేదాలను గురించి ఆయనకు తెలియజేసాను. కన్నడ భాషా పండితునితో కూడ కొంత సేపు ప్రసంగించాను. సమావేశానంతరం వెళ్ళిపోవడం కోసం నేను మొదట లేచాను. ఆయన నాతో కరచాలనం చేశారు. చాలాసేపు ఆయనను శ్రమపెట్టినందుకు క్షమించమన్నాను. నా సంభాషణ చాల చాల ఆసక్తికరంగా ఉందని నా పరిచయం అయినందుకు తాను సంతోషిస్తున్నానని ఆయన అన్నారు.

** 11-4-1895 **
*గురువారం*

దళసరి కాగితం ఎరుపు మొరాకో లెదరు రెండు కాపీలు పన్నెండు కావాలని సూర్యనారాయణ గారు అడిగారు. మిగిలినవి అనేక రంగులవి. వీలరు వద్ద నుండి ఫొటోగ్రాఫులు తీసుకోండి ఇంకా ఎక్కువ కావాలంటే ఆర్డరివ్వండి. అవసరమైతే ఇంకా ఎక్కువ తీసుకోవాలి. జాగ్రత్తగా పుస్తకాలు పంపమని వీలర్ అండ్ కోకు చెప్పాలి. అన్నిటిని జాగ్రత్తగా సీలు వేసి, సంతకం పెట్టి పంపాలి.

☆

** 12-4-1895 **
*శుక్రవారం*

ఎడ్మిరాల్టీ భవనంలో సంగీత కచేరి. త్యాగయ్య గారి శిష్యులలో ఒకరు చాల బాగా పాడారు. ఆయన వృద్ధుడు. శ్రీనివాసాచారి రామచంద్రరావు సాహెబ్ అనుసరించారు. కె.నారాయణరావు, ఇంకా చాలా మంది హాజరయ్యారు. గాయకుడు కులాసాగా వున్న వృద్ధుడు. చాల ఉత్సాహవంతుడు. బాగా ఆరోగ్యంగా ఉన్నాడు.

☆

** 13-4-1895 **
*శనివారం*

రామస్వామి చెట్టికి ఇవ్వవలసినది 8 రూపాయలు, నిలువ 72 రూపాయలు. దానికి ముందర నా వద్ద 50 రూ.ల నోటు ఉండింది. నారాయణమూర్తి 30 రూపాయలు తిరిగి ఇచ్చేసారు.

ఒక రోజున కళ్యాణరామన్ శ్రీనివాసాచారిగారిని ఆయన ఇంట చూసినట్టుగా

ఉంది. నాటక విషయాల గురించి చాలసేపు మాట్లాడినట్టుగా ఉంది. ఆ రోజున ప్రదర్శనకు కళ్యాణరామన్ ఆహ్వానించారు. కాని, ఆ రోజు నేను లేకపోవడం వల్ల, ఇతర కారణాల వల్ల, ఆయన వెళ్లలేదు. ఈ వేళ సాయంత్రం అక్కడికి వెళతానని మాట ఇచ్చారు. కాబట్టి మేము వెళ్ళాము. ఆ రోజున మేము సూర్యనారాయణ పంతులును, ఒక కవి మిత్రుడ్ని తీసుకెళ్ళాము. ప్రదర్శన పాడుగా ఉంది. హాలు నిండలేదు. టౌనుహాలులో ప్రదర్శన జరిగింది. కుర్చీలు ఎక్కువ భాగం ఖాళీలు. రేట్లు 3 రూ, $1\frac{1}{2}$ రూ, 1 రూ. సభలో దిగువ కూర్చునేవారు కళ్యాణరామన్ అభిమానులు.

సభలో గమనించవలసింది ఒక్కటే. గౌరవనీయులు శంకర్‌నాయర్‌గారి కుటుంబ స్త్రీలు. అక్కడ మొదటి వరుసలో ఉన్నారు. పొడవాటి బెంచీ మీద నలుగురు కూర్చోడానికి తావు వుంది. వాళ్ళలో పెద్దావిడ లావుగా తెల్లగా ఉంది. ఒడిలో ఒక బిడ్డ. ఈ మలయాళీ స్త్రీలు చక్కని, ఖరీదైన చీరలు కట్టుకున్నారు. ఖరీదైన నగలు ధరించారు. చక్కగా ఉంది వారి అలంకరణ. మధ్యన కూర్చున్న ఆవిడకు పెద్ద కర్ణాభరణాలు లేవు. కాని, మిగతా యితర స్త్రీలకు పెద్ద కర్ణాభరణాలున్నాయి. చూడ చక్కగా లేవు. స్త్రీలకు ఈ అలవాటు తప్పించడానికి ప్రయత్నించడం వల్ల ప్రయోజనం లేదు. చెవులకు పెద్ద రంధ్రాలు చేసుకోవద్దని చెప్పినా లాభం లేదు. అందరిలోకి చిన్నావిడ చాల సన్నగా ఉంది. మీన నేత్రాలు. నాటకం పాడుగా ఉంది. స్త్రీల ముఖకవళికలు గమనిస్తున్నాను. అందరిలోకి చిన్నావిడ ముఖకవళికలు. ఆమె వినయంగా, అమాయకంగా ఉంది. రంగస్థలం మీద ఏదో ఒకటి జరుగుతూనే ఉంది. దృశ్యాలు పాడుగా ఉన్నాయి. రంగాలంకరణ మరీ పాడుగా ఉంది. ఇంగ్లీషు భాష ఎక్కువ భాగం అనుచితంగా ఉంది. ఇంకా ఏం చెప్పాలో నాకు తెలియటం లేదు.

మొదట అనసూయ, ప్రియంవదల విషయం. రాజకుమారికలను జ్ఞాపకం తప్పకుండా నాకు కలిగించారు. మొరటుగా, లావుగా వున్నారు. నాజూకుగా ఉన్న శకుంతల చెలికత్తెలు వీరు. కళ్యాణరామ్ మధ్యవయసులో నున్న స్త్రీలాగా ఉన్నాడు. అమ్మాయిలాగా కాదు. అతని ముఖం అమరికగా లేదు. గుండ్రని కళ్ళు. ఒక బొమ్మకు ఉన్నట్లుగా ఉన్నాయి. అవి ఒకే ఒక భావాన్ని తెలుపుతాయి. కోపం, అసహ్యం అస్పష్టంగా, అల్పత్వాన్ని ఎంతమాత్రం నెమ్మదిగా కనిపించవు. ప్రేమ, విషాదం ఎంత మాత్రం కాదు. నొసలు చిన్నవి. చివరలు మరీ చిన్నవి కనుబొమ్మలు బాగా లేవు. పెదాలు సన్నగా లేవు. పై పెదవి గుండ్రంగా ఉంది. రొమ్ములు చాల పెద్దవి. అమరికగా ఏవీ లేవు. అతను నోరు విప్పగానే అక్కడ నుండి వెళిపోదాం అనిపిస్తుంది. ఆయన గొంతుక బొంగురుగా ఉంది. పూర్తిగా పురుషుని గొంతుక. ఉచ్చారణ సవ్యంగా లేదు. సంగీతం ఘోరం. ఎంత మాత్రం నాజూకు లేని సంభాషణలు.

అన్ని రకాల వికారాలు. ఈ వేషం వేయడం ఆయన ఎందుకు మానడో? నా ఆలోచన వల్ల ఫలితం శూన్యం. సాధారణంగా మద్రాసీలు కళ్యాణరామన్ అంటే చాలా మెచ్చుకుంటారు. అతని గురించి అనుకోవడం వట్టి దండగ,

ఈయన మంచి వ్యాపారస్థుడు. ప్రదర్శనలు జరిగే చోట్లకు వెళ్ళి ప్రముఖులనందర్నీ కలుసుకుంటాడు. బాగా మాట్లాడి మంచి చేసుకుంటాడు. ఈయన దక్షిణాదికి వస్తే ఇంకా ఎక్కువగా అభిమానిస్తారు. ప్రజలకు ఆయనపట్ల ఉన్న ఆదరణ ఒకటి రుజువు చేస్తుంది. అదేమిటంటే మద్రాసీలకు మంచి చెడ్డల విచక్షణ లేదనిపిస్తుంది. విజయనగరంలో ఇంతకంటే చాల బాగా ప్రదర్శనలు జరుగుతాయి. బుచ్చిశాస్త్రి నాటక సమాజం ఎన్నో రెట్లు నయం. శ్రీనివాసశాస్త్రిగారి శిక్షణ ఇందుకు కారణం అయినప్పటికీ, కళ్యాణరామయ్య చేసే అసంబద్ధాలలో దేనినయినా కొండయ్య చేయడం అసాధ్యం. (పైని చెప్పిన వారు జగన్నాథ విలాసిని నాటక సమాజానికి చెందినవారు – సం.) ఎటువంటి మార్పు లేకుండా 'పంచ్' పత్రికలో హాస్య రచనగా వేసుకుంటే బాగుంటుంది. (సుప్రసిద్ధ ఆంగ్ల హాస్య పత్రిక ఇప్పుడు లేదు–సం) తాను అసాధారణమైన ప్రజ్ఞగల నటుడని కళ్యాణరామన్ చెప్పుకుంటాడు. ఇదొక దారుణమైన నిర్ణయం. తమిళులకు వింత వింత తీరులున్నాయి. సొంత డబ్బా ఎక్కువ. తెల్లవారికుండే లక్షణాలు వీరికి లేవు. ప్రతిచోటా తమ మిత్రులను తెగపొగుడుతూ ఎగతోస్తారు. కళ్యాణరామన్ ఇంచుమించు ఇటువంటివాడే. వెంకి వేశ్యకుండే తీరుతెన్నులు ఆయనకున్నాయి. స్త్రీ పాత్రధారణ చేయడం అతనికి ఎంత మాత్రం తగదు.

దుష్యంతుడు వేషం వేసిన వ్యక్తి ఈ సమాజంలో ఒక పెద్ద దండగ. ఇటువంటి వికారపు తలబిరుసు పాడురూపు దెయ్యాన్ని నాయక పాత్రకు కళ్యాణరామన్ ఎందుకు ఎంచుకున్నాడో నాకర్థం కాలేదు. అతను నలుపు కాదు. కాని, అతని రూపం పాడుగా ఉంది. ఇది అతనికి తెలియదు. బహుశా బాగు చేసుకోడం అవసరమని ఆయన ఎరుగడు. అతను మేజోళ్ళు వేసుకొని వస్తాడు. నల్లని షరాయి, కోటు, సైనికాధికారిలాగా తలమీద ఒక టోపీ పెట్టుకుంటాడు. అతని మీసాలు బొద్దుగా, కురుచగా ఉన్నాయి. మనదేశంలో అడుక్కుతినే సన్యాసికి ఉన్నట్టుగా. మొహం మీద వికారంగా తిరుచూర్ణం బొట్టు, నోరు ముందుకు చొచ్చుకొని ఉంటుంది. పై పెదవి గుండ్రం, పళ్ళు కూడ ఎత్తుగా ఉంటాయి. పెదాలు వాటిని కప్పి ఉంచవు. అటువంటివాడు దద్దమ్మ రూపంలో ఉండక తప్పదు. తన జుట్టు అతను పెద్ద ముడిగా తలపై చుట్టుకుంటాడు. అయ్యో! వీళ్ళు మొరటు మనుషులు, సున్నితంగా ఉండటం ఏమిటో తెలియదు. ఉచితానుచితాలు ఎరుగరు. అతను నిలబడి ఉన్నప్పుడు తల ముందుకు వంగి వుంటుంది. ఛాతీ వెనక్కుపోయి ఉంటుంది. దర్పం ప్రకటిస్తాడు. ఎంతటి తెలివితక్కువ మనిషి! మిగతా పాత్రలకు దుస్తులన్నవి ఏమీ లేవు. వాళ్ళు అనుచితమైనవి మాట్లాడతారు, పనులు చేస్తారు. ఇంతకు ముందర పాత్రలు జపం చేయడం, గొణగడం గురించి చెప్పాను. వారేమైనా చేస్తారుగాని, మాట్లాడరు.

నా స్నేహితుడికి భారతీయుడు గామా గురించి ఒక పొడవాటి ఊకదంపుడు ఉపన్యాసం ఇచ్చాను. నువ్వు 'గాడిద తోకను చూసావా లేకపోతే అదిలేనే లేదా!' ఎంత త్వరగా మాట్లాడితే తాను అంత తెలివిగా మాట్లాడుతున్నానన్న అభిప్రాయం కొందరికి ఉన్నట్లుంది. మరాఠీ నాటక సమాజాల వల్ల సంక్రమించిన వారసత్వాల్లో

ఇది ఒకటి. సంభాషణలు చెప్పేటప్పుడు వినడానికి చాల విసుగు పుడుతుంది. కృత్రిమత్వం కన్పిస్తుంది. సరే ఇప్పుడు ఎవరైనా ఇలా అడగవచ్చును. విషయాలు అంత పాడుగా వున్నట్టయితే, కళ్యాణరామన్ చెంగబజారులోని మురికిపేటను వదలిపెట్టి టౌన్‌హాల్‌లో సొంత డబ్బా వాయించుకోవటం ఎందుకో! దీనికి జవాబు ఏమిటంటే అజ్ఞానం, పొగరుబోతుతనం. అయ్యో పాపం! శకుంతల పాత్రను అద్భుతంగా నటిస్తున్నానని అతను అనుకుంటున్నాడు. చాల సంస్కృత శ్లోకాలు కాళిదాసువి అప్పగించి ఆ పరిస్థితులకు చాల ప్రాముఖ్యం ఇస్తాడు. ఈ సంభాషణలు ఎంతో అసహజంగా చెబుతాడు. నిజానికి ఈ నాటకంలోని అత్యంత అధ్వాన్న పరిస్థితి ఇదే. శ్లోకం తరువాత శ్లోకం. అవి నా అభిమాన పాత్రమైన శ్లోకాలు. ప్రపంచానికే అభిమాన పాత్రమైన ఆ శ్లోకాలు ఘోరంగా ఖూనీ చేయబడ్డాయి. నా ఓపిక నశించి పోయింది. నా అసమ్మతి ప్రకటనగా పాదం నేలకేసి కొట్టాను. హాలులోని అనేకచోట్ల నుండి ఇది మారుమ్రోగింది. హఠాత్తుగా శకుంతల తెలుగులో వేశ్యలు పాడే జావళి వంటిది పాడింది. శ్రీనివాసశాస్త్రి జుగుప్సతో తన కుర్చీని వదలిపెట్టారు. నేను కళ్యాణరామన్ మొదటి నాటకం గురించి కటువుగా వ్యాఖ్యానం చేసినపుడు, శ్రీనివాసాచారికి నచ్చలేదు. అయన కళ్యాణరామన్‌ని సమర్థించారు.

నా స్నేహితుల్లో ఒకరు 'కాళిదాసు ఇక్కడ వున్నట్టయితే, ఏమనుకునేవాడో'– అని వ్యాఖ్యానించారు. 'ఆయన ఆత్మహత్య చేసుకునేవాడ'ని అన్నాను.

ఒకటి రెండు సందర్భాలలో రంగాలంకరణ బాగుంది. స్నేహితులు రాజుగారితో మాట్లాడుతున్నప్పుడు అతడు నిశ్శబ్దంగా ఊరుకున్నాడు. శకుంతల ఇలా ఉంటుంది. ఇక్కడేమిటి అల్లరి చేస్తావు అంతా చూస్తారు. బహిరంగంగా (తెలుగు లిపిలో) అని ప్రక్క నున్న తెరవెనక్కు వెళ్ళి తలను వెనక నుండి ముందుకు చాచి 'మళ్ళా నేను ఎలాగ వెళతాను' నా కోపం తగ్గిపోయింది. చివరి సంభాషణ సాగదీయడం జరిగింది. వెతుక్కుంటూ ప్రవేశం. ఆమెకు ఏమి కావాలని అతగాడు అడుగుతాడు.

ఆమె – నా కోపం పోయింది
అతను – నువ్వు నా కోరికను తీర్చినట్లయితే దాన్ని నీకిస్తాను.
ఆమె – నేను అలా చేస్తాను.
అతను – నాకు వాగ్దానం చేయి.
ఆమె – అవును
అతను – నువ్వు ఇక్కడ కూర్చో
ఆమె – నీ చేతిలో చేయి వేస్తాను ఇవ్వు

(చేయి పట్టుకుని ఇలా అంటాడు) 'ఎంత మృదువుగా వుంది.' ఆడవాళ్ళు నవ్వుతున్నారు.

ఒక వ్యభిచారి ఒక వివాహిత స్త్రీ వేపు వెళ్ళినట్టుగా వెళ్ళడం మొదలు పెడతాడు.

☆ ☆ ☆

* 13-4-1895 *

1. తెనాలి రామకృష్ణ
2. హిందువులలోని ఇప్పటి వివాహ విధానం సంతృప్తికరంగా ఉందా?
3. మద్రాసులో విద్యార్థుల జీవితం సుఖంగా ఉందా?
4. జీవిత లక్ష్యాలు
5. పెద్ద స్థానంలో ఉన్నంత మాత్రం చేత ఒక మనిషిని గౌరవించాలా?
6. ప్రజల ఐకమత్యానికి కులవ్యవస్థ అడ్డంకిగా లేదా?

☆ ☆ ☆

* 14-4-1895 *

పాకీవానికి 2 రూపాయలు
రాజుకు 5 రూపాయలు
మొత్తం 122 రూపాయలు

సావర్సు దొరకు వీడ్కోలు. చేపాక్ వెళ్ళాను. అక్కడ గవర్నరుగారు విద్యార్థుల వసతి గృహానికి శంకుస్థాపన చేశారు. చాలమంది వచ్చారు. మిస్టర్ బిలిస్ (బ్రిస్) మొదట మాట్లాడారు. అతని తీరు బాగోలేదు. విసుగు పుట్టేటట్టుగా వుంది. ప్రతి వాక్యం దగ్గర ఏదో పడేసినట్టుగా వుంది. ఆయన మహారాజులుంగారు గురించి మాట్లాడారు. గమనించవలసినదేమిటంటే – మహారాజులుంగారి గురించి చెప్పేటప్పుడు ఆ బిరుదు (హెచ్.హెచ్). దీర్ఘమైన ఉపన్యాసం. తరువాత డా. డ్రంకన్ నాణేలున్న సీసాను వార్తాపత్రికను గవర్నరుగారి సతీమణికి అందజేశారు. ఆమె శంకుస్థాపన జరిపేటప్పుడు ఆ రాతి క్రింద అమర్చారు. మిస్టరు బాలయ్యనాయుడు గారు అందమైన ప్లేటులో సున్నం అందజేసారు. ఒక పాత్రతో నీరు కూడ ఇచ్చారు. ఆ పాత్ర కూడ బాగుంది. కమిటీ పక్షాన రాజా తుందు గుడ్డను బహూకరించారు. గవర్నరుగారి సతీమణి ప్లాస్టర్ రాతిమీద పరచి కార్యక్రమం ముగిసినట్టుగా ప్రకటించారు. దాని తరువాత గవర్నరుగారి సతీమణి వేదిక మీదకు వెళ్ళి ప్రసంగించారు. ఆమె ప్రసంగం బ్రిస్ కన్నా బాగుంది. సమావేశంలో ఉన్నవారి పక్షాన న్యాయమూర్తి సుబ్రహ్మణ్యంగారు గవర్నరుగారి సతీమణికి ధన్యవాదాలర్పించారు. ఈ ప్రసంగం బాగోలేదు. మరీ పొగడ్తగా ఉంది. పొగడ్త చెడ్డదేమీ కాదు. అందంగా చెప్పినపుడు. కాని, ఒక మద్రాసీ నుండి అందచందాలు ఆశించలేము.

☆ ☆ ☆

* 15-4-1895 *

పచ్చయ్యప్ప కళాశాల వార్షికోత్సవానికి వెళ్ళాను. ఎక్కువ మంది రాలేదు. కుర్చీలు చాల ఖాళీగా ఉండి పోయాయి. ఏర్పాట్లు బాగోలేవు. చాల మంది మనదేశపు పెద్ద మనుషులు ఒక అరడజను మంది యూరోపియన్లు వేదిక మీద కూర్చొని ఉన్నారు. కొంతమంది పెద్ద మనుషులు వేదిక సమీపంలో గుమికూడి ఉన్నారు. వాళ్ళు అడ్డదిడ్డంగా కూర్చొని ఉన్నారు. బిషప్‌గారి ఉపన్యాసం అద్భుతంగా

ఉంది. అందంగా ప్రసంగించారు. గొంతుక చాల బాగుంది. వారు తెలుగు భాషకు చక్కని ప్రశంస చేశారు. చాల హాస్యంగా మాట్లాడారు. తెలుగు ఆశీర్వచనంతో ఆయన ప్రసంగాన్ని ముగించారు. ఇద్దరి ప్రసంగాలు బాగాలేవు. మిస్టర్. కాపర్ఒక్కే విర్మాహామాటంగా మాట్లాడారు. స్వీయ విషయం చెప్పారు. చెప్పిన తీరు బాగోలేదు. ఎవరో కృష్ణమాచారట. తెలివి తక్కువగా మాట్లాడారు. విద్యా ప్రగతిని ఆశిస్తూ ఆయన ప్రసంగించవలసివుంది. ఆయన కొన్ని ఇబ్బందులువున్నాయని అన్నారు. వాటి అవసరముందని... అన్నారు. మానసిక ప్రగతి అవసరమని అన్నారు.

మిస్టర్ స్టోన్ విద్య తప్పకుండా స్వయం పోషకంగా ఉండాలని ప్రభుత్వం జోక్యం కలిగించుకోవడం నేరమని చెప్పారు.

పుస్తకాలు కొన్నాను. నాలుగు తుండు గుడ్డలు (1-8) ఖర్చు చేసాను. పెద్దవి 2 రూపాయలు, పుస్తకం మార్కువి 2 రూపాయలు, బనియమలు 2-4-0 ఇంటి నుంచి 16 రూ.లు తీసుకున్నాను. రాజుకు 3 రూ.లు ఇచ్చాను.

☆ ☆ ☆

** 16-4-1895 **

కోటకు వెళ్ళాను. విజయనగరం కుటుంబం గురించి చాలా ముఖ్యమైన భోగట్టా తెల్సుకున్నాను. శ్రీనివాసాచారి గారి అమ్మాయి గృహప్రవేశానికి వెళ్ళాను.

కపాలేశ్వరీ గుడి ఊరేగింపును చూశాను. డా. హాల్ట్స్‌దొర గురించి కొన్ని విషయాలు కనుక్కోవాలి.

కోటలోని వారి గురించి నీకేమైనా తెలుసా?

కృష్ణాజిల్లా సమాచార సంపుటం, వారు జైనమతం రాజులని చెబుతోంది. వారేమో తొలి చాళుక్య జైనులు కావచ్చు (?)

చోళరాజకుమారి జైనదేవాలయంలో ఏదీ స్థాపించలేదా?

పూసపాటి గురించి మీకేమైనా తెలుసా?

కాకతీయ గజపతికి మహామండలాధీశ్వర అన్న బిరుదుండేది కదా!

నెల్లూరు రాజుకు, ఇంకెవరికో మధ్య యుద్ధం జరిగింది. పుస్తకం చూడాలి.

నెల్లూరులో శాసనాలున్నాయేమో చూడాలి.

భారతీయ ప్రాచీన చరిత్ర సంపుటం VI పుట 226 జమ్మలమడుగుకు సమీపం. కావేరి వంతెన

ఏ వంశం, తిరువాంకూర్ గోత్రం, పాండ్య శంభురాజు తెలుగు రాజు.

చోళులను ఎంత వరకు అన్వేషించగలము? గొంక రాజ రాజ గంగ కావచ్చునా?

రెండు వర్గాల క్షత్రియులు. కృష్ణా, జగన్నాథ -

సీవెల్స్ కాగితాలు.

ఇలియట్ సల్వా శిలవంశానికి చెందినవారు.

మాధవ వర్మ - బుద్ధవర్మ - చిక్కభీమ, మైలవ భీమ - కంఠమ - అన్నలదేవ - వీరబసవరాజు.

శ్రీనివాసాచారిగారితో కలిసి శాకుంతలం చదవటం మొదలు పెట్టాను.

ఆశ్రమ బాలికల మాటలు నాటక ప్రారంభంలో అభ్యంతరకరంగా లేవా! రాజు నిరలంకార అందాన్ని మెచ్చుకుంటారు. శకుంతల కుచవల్కాం ధరించి ఉంది. పార్వతి పువ్వులు అలంకరించుకొని ఉంది.

వనజ్యోత్స్న నవమాలిక తీగ కేసరి. ఈ దృశ్యం ఎంతో కవితారమ్యంగా అందంగా ఉన్నాయి. దాక్కొని నాయకుడు సంభాషణలు వినడం మామూలే. ఉపభోగక్షమ అవసరమైన పదబంధం.

క్షేత్ర పరిగ్రహకమా

యధార్య మస్యమభిలాష తేమనః

తేనెటీగల నుండి నిన్ను కాపాడగలవారెవరు? రాజర్షి దుష్యంతుడు మాత్రమే. ఆయన ఆశ్రమ రక్షకుడు. మంచిరాజు. నా నిబ్బరం పోగొట్టుకోను. రాజుగారు అడిగిన ప్రశ్నకు శకుంతల జవాబు ఇవ్వకపోవడం చాల సహజంగా ఉంది.

ప్రభురివ దృశ్యతే – రాజుగారికుండవలసిన గుణాలు లేదా ఉండదగ్గవను కొన్నవి. ఈ సమయంలో విశ్వామిత్రుడు ఏం చేస్తున్నట్లు? 'పురాకిలా' అంటే ఇంకా ఎన్నెళ్ళు? దేవతలకు ఇతరులంటే భయం? సమాధి ఈ వ్యాఖ్యానం అనుచితం. నమ్మకం, విశ్వాసం తన పట్ల ఆయనకు కలిగేటట్లు మాత్రమే తెలుపుతుంది. వారిపట్ల సంభాషణ 'వైఖానసం' (?) – వ్యాఖ్యానంలో తేడా.

శకుంతల మొక్కలకు నీళ్ళుపోస్తున్న దృశ్యం. ఈ బాలికలకు చదవడం వచ్చును. ప్రియంవద తెలివైన పిల్ల, రాజరికపు హెుందా.

దురదృష్టవశాత్తు నా మనస్సు దేవరపల్లి మీదకు మళ్ళింది. మా మావగారు, యువకుడైన బావగారు మొదలైన వారి వైపు. తెలివితక్కువ, అల్లర చిల్లర బ్రాహ్మణ కుర్రవాడు శాస్త్రులు వైపు కూడ అహా! ఎటువంటి రోజులు! ఆ రోజులు మళ్ళీవస్తే బాగుండుననిపిస్తుంది. ఎంత ఆనందంగా ఉంటాయి అనుకోటానికి ఈ విషయాలు? కాని, ఆ రోజుల్లో ఇబ్బందులు నా మనస్సును కలవరపెట్టేవి. నేను ఆరోగ్యంగా ఉన్నంత కాలం. నా చిన్నప్పటి రోజుల్ని జ్ఞాపకం తెచ్చుకోలేదు. ఎక్కువ భాగం ఇబ్బందులు చిల్లర మల్లరవి. పూర్తిగా మాయం అయిపోయాయి. దేవరపల్లి ఇల్లు కూలిపోయింది. ప్రేమ, ఉత్సాహంతో కూడిన సంతోషదినాలవి. సంతోషం కల్తీ లేనిది. జీవితావసర వస్తువుల కోసం ఆరాటం లేనప్పుడు మాత్రమే ఈ సంతోషం ఉంటుంది. ఇతరులు సంపాదించిన దానిని ఒకరు తినడం అదే ఆరాటం.

అయ్యో పాపం నారాయణమూర్తి. అటువంటి తెలివైన వ్యక్తికి అనారోగ్యం.

చిరంజీవి వెళ్ళిపోయాడు. ఎంత మంచివాడు. అతగాడికి విద్యార్థి ఉపకార వేతనం సంపాదించగలనని ఆశపడుతున్నాను. మా అమ్మాయిని అతనికి ఇచ్చి సంతోషపూర్వకంగా పెళ్ళి చేద్దును. కాని, మా మేనల్లుని కివ్వడం తప్పనిసరి.

గడిచిన 15వ తేదీని హాస్యాస్పదమైన ఒక సంఘటన జరిగింది. పచ్చయప్ప కాలేజీకి వెళ్ళాను. మీటింగ్‌కు ఇంకా వ్యవధి వుంది కదాని 'ఈవినింగ్ బజార్'ల అంగడి వైపు పచారి చేశాను. ఏవేవో కొన్నాను. ఎక్కువ భాగం పుస్తకాలు. ఒక అంగడిలో వెధవాయి వంటివాడ్ని ఒకడ్ని చూసాను. ఒక అంగడివాడికి ఒక రూపాయికి కళ్ళద్దాలు అమ్మాడు. కాని, అమ్మినవాడు 3 రూపాయలు ఇమ్మన్నాడు.

నేను రూపాయిన్నర యిచ్చి కాస్తంత బేరం ఆడాను. వాడు నాకు అది ఇచ్చేశాడు. వెంటనే పెట్టుకున్నాను. కాని, నాకు అది సరిపోలేదు. ఎలా సరిపోతుంది? నాకు ఎక్కువ, తక్కువ దూరపు చూపులేదు. బూట్లు, కళ్ళద్దాలు తప్పని సరిగా ఘనతనిస్తాయి గదా. కాలేజీ భవనంలోకి వెళదామనుకున్నాను. కళ్ళద్దాలు రెండు ముక్కలుగా అమర్చి ఉండడం వల్ల (ఒకటి చదవడానికి, ఇంకొకటి దూరపు చూపుకి) అవి లేని దర్పం నాకు యిచ్చాయి. గుమ్మం దగ్గర గభాల్న కూలబడ్డాను.

రవివర్మ చిత్రించిన రాధ చిత్రం తెలివి తక్కువగా కనిపించింది. ఎడమ కన్ను చెవి మూలకి తక్కువగా ఉంది. పళ్ళు పై పెదవి మూలను చిత్రింపబడ్డాయి. మరీ అణచిపెట్టినట్టుగా ఉన్నాయి. మన దేవతలకి ఉండవలసిన దానికంటే అధికం. ఏమిటా కనురెప్పలు? కాని, భావం నెమ్మదిగా అమాయకంగా ఉంది. అది రాధ రూపానికి ఎంత మాత్రం తగదు. రాధ అతి శృంగారంతో కనిపించాలి కదా!

సూర్యనారాయణ పంతులు గారికి టెలిగ్రాము 2-12-0రూ.

☆

** 17-4-1895 **
బుధవారం

రాజుగారు విజయనగరానికి బయలుదేరారు.

శ్రీనివాసాచారిగారితో కలిసి చదువు సాగించాను. ఇది మనోగతానికి సంబంధించిన విషయం. ఒక ఇటాలియన్ కొండలలోని అమ్మాయిని తండ్రి పెంచి పెద్దదాన్ని చేశాడు. (మత గురువు) ఒక ఇంగ్లీషు పెద్ద కుటుంబీకులు విందు చేసుకునే హాలు చిత్రించడానికి పంపబడింది. ఆ పనిచేస్తూ ఆయన ఆమె ప్రేమలో పడ్డాడు. కాని, అది మరీ తాపీగా జరుగుతుంది. మొదటి విషయం ఆవిడ అతనికి బాగా నచ్చలేదు. ఆమె ఉద్రేకి, స్థిరం లేని మనిషి, అందగత్తె. చెప్పిందే పదే పదే చెప్పడం. 'ఉందామా, ఊడదామా' అన్నట్టు ఉంది. రాత ఆ రకపుది. మానసిక విశ్లేషణ ఎంత మాత్రం సహజమైంది కాదు. ఈ చిత్రకారుడు ఆవిడగారి సమీప బంధువు, ఆస్తికి హక్కుదారులు. చివరికి తేలింది ఇదే. ఇది ఉత్త కట్టు కథ. ఆవిడ గారు ప్రేమ ప్రతిపాదన చేస్తుంది. ప్రేమాయణం కుప్పకూలినంత వరకు వెళ్ళింది ఇక అతని మీద కోపం.

☆ ☆ ☆

** 18-4-1895 **
గురువారం

నౌఖరు రాకపోకలకు సొమ్ము పుచ్చుకున్నాను. ఇది భూపతి రాజుకు పనికి వస్తుంది. కాబట్టి నేను నాయుడిగారి దగ్గర నుండి తీసుకోవాలి.

బట్లరు దగ్గర 50 రూపాయల నోటు పెట్టాను.

☆ ☆ ☆

* 19-4-1895 *
శుక్రవారం

| | | |
|---|---|---|
| 57 రోజులకు భత్యం ఖర్చులు | – | 110 |
| నౌకరుకు రాకపోక ఖర్చులు | – | 20 |
| ఎక్స్‌ట్రా | – | 20 |
| హెచ్.హెచ్.ఖర్చులు | – | 100 |
| | | 250 |

కుంచెలు 3 రూ.లు, పుస్తకాలు రాజాకి 3 రూ.లు, నాటక ప్రదర్శనకు చెల్లించినది 4–12–0, బ్రౌన్ తెలుగు వ్యాకరణానికి 1 రూ. క్రిస్టియన్ కళాశాలలోని సభకు అధ్యక్షత వహించవలసినదిగా ఆహ్వానించారు. తెలుగు సంఘం క్రిస్టియన్ కళాశాల. సాయంత్రం 4.45 నిమిషాలకు 'వార్తా పత్రికల ప్రభావం.'

☆ ☆ ☆

* 20-4-1895 *
శనివారం

ఆ మధ్య రాకెట్టు ఆటస్థలంలో షణ్ముగం చెట్టియార్‌తో కలిసి కూర్చున్నాము. ఆయన వృద్ధుడు, ఆరోగ్యంగా ఉన్నాడు. కళ్ళు తళ తళ మెరుస్తుంటాయి. మంచి ఉత్సాహవంతుడు. తనకు 68 సంవత్సరాలని చెప్పాడు. తనకు 46 ఏళ్ళ క్రితం త్యాగయ్య చనిపోయారు. ఆయన గురువు రామబ్రహ్మం "ఆనంద సాగరమె" అన్న ఈ కృతికి అర్థమేమిటని అడిగాను కృష్ణయ్యగారిని. ఈ కృతిని "ఆనంద సాగర మీదని దేహము భూ భారము రామబ్రహ్మానంద సాగరము" అని చదువవలెను.

మన దేశంలో భాగవతం నశించిపోతుందని ఆయన అన్నారు. ఆయన చిన్న వయసులో చాలా మంచి నాటక సంఘాలు ఉండేవి. చెట్టియార్ ఏదో ఒక హరికథను మెచ్చుకున్నారు. త్యాగయ్యగారు పాట పాడుతూ మరణించారని ఆయన అన్నారు. ఆ పాట 'శ్యామసుందరాంగ'. ఆయన ముడికినాటి బ్రాహ్మణుడు. నారాయణ అనేది శివపరం.

పాలవాడికి 3 రూ.లు ఇమ్మని బట్లరుతో చెప్పాను. కూలీవానికి ఒక అణా.

తమిళంలో మూడు అక్షరాలతో ఉన్న పదాలు చాల ఉన్నాయి. ద్విత్వ హల్లుతో ముగిసే 'పరుప్పు' అన్న పదం ఉంది. అటువంటి రెండక్షరాల పదాలు చాల ఉన్నాయి.

యన్న సమాచారము? ఏమి సమాచారము?

ఒన్నుమిల్లే – యేమీ లేదు
ఒర్తురుమిల్లే – యెవరూలేరు
యప్పో – యెపుడు

కృష్ణంరాజు...యతి అన్న మాయా పురాణాలు మనుష్యుల్ని నరకానికి తోసి వెయ్యడానికి వచ్చాయి. అవి వినకూడదు. పురాణాలు అన్నీ ఏక కంఠ్యం చెయ్యవలెను. విష్ణు పురాణములు సాత్వికములు, బ్రహ్మవి రాజసములు, శివుడివి తామసములు, అంతర్ ముఖులు శివుడ్నిగాని, అన్యదైవములనుగాని పూజించరు. మాట్లాడుతున్నప్పుడు కళ్ళలో రవ్వంత అయినా కాంతి లేదు. మందకొడిగా, భయంకరంగా కనిపించే ఆకారం బాగా చైతన్యంతో కూడి ఉన్నది. సులభంగా ఉద్రేకం వస్తుంది. మాట్లాడేటప్పుడు ఆయనకు నెమ్మది కానరాదు. గడబిడిగా మాట్లాడతాడు. పదబంధాలు, వాక్యాలు చెప్పినవే చెప్తుకుపోతాడు. ఆయన ముందుకు, వెనక్కు నడిచి వెళ్తుంటాడు. మామూలు ధోరణిలోను, కోపంలోను ఇదే తీరు. ఖర్చులో ఏ మాత్రం వెనకడుగు వేయడు. స్వభావం మంచిది. కొన్ని సందర్భాలలో సానుభూతి ప్రదర్శిస్తాడు. మనిషి శుభ్రంగా ఉంటాడు.

'తెలుగు హార్పు' పత్రిక రెండు సంచికలు ఈ రోజు అందాయి. అప్పుడప్పుడూ దాని సంగీత ధ్వని వినిపిస్తుంది. నా మిత్రులు సంతోషంగా, ఉత్సాహంగా దీనిని నిర్వహిస్తున్నందుకు సంతోషంగా ఉంది. నా స్నేహితుడు వెంకన్నగారు మిస్టర్ నాయర్‌కి వ్యతిరేకంగా పత్రికలో ఘాటైన ఉత్తరం రాసారు. యువకులను ఉత్సాహపరుస్తూ రాసారు. మొదటి వ్యాసం కంటే యిందులో కృత్రిమత్వం లేదు. నిరసన మరీ తీవ్రంగా ఉంది. నాయర్ చిన్నవాడు. మహారాజులుంగారి కంటపడినప్పటి నుండి తనకు తాను అభివృద్ధి చేసుకోవాలనుకుంటున్నాడు. ఇక్కడ వున్నప్పుడు ఆయన కొన్ని పుస్తకాలు చదువుతున్నారు. ఆయన తన తీరును మార్చుకున్నట్టయితే ఒక మంచి వక్త కాగలరు.

కాలేజీ ఫోటో నేను లేకుండానే జరిగిపోయింది. అనారోగ్యంతో ఉన్నవాడికి ఈ బృందంతో ఉండటం అవసరమేముంది. అనాకారి ఫోటో తీయించుకోటానికి అర్హత లేదు.

నా ఉత్తరానికి జవాబు రాసే దయ మేనేజరుకి లేకపోయింది. బహుశా నాకు చెప్పడానికి మంచి విషయం ఏదీ లేదేమో, లేక వారి పరిస్థితి అనుకూలంగా లేదేమో.

మళ్ళీ నాయర్‌గారి విషయం చెప్పాలంటే ఆయనను వెంకయ్యగారే కాక విజయనగర వాసులందరూ అభినందించాలి. విజయనగరంలోని విషయాలు ఉత్సాహంగా ఉంటాయి. మిస్టర్ నాయర్ రాకతో విజయనగరంలో జీవితం చాల మెరుగైయుంటుంది. కుర్రవాళ్ళకు ఆయనంటే యిష్టం. ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. తెలివైన కలం, జోరుగా ఉన్న నాలుక.

పాపం రామ్మూర్తి పంతులు అతని కొడుకు మురుగులు ఎవరో దొంగలించారు. 'హార్పు' పత్రికకు ఒక వార్త దొరికింది. నా ఆరోగ్యం కూడ దానికి ఒక ముచ్చటే. దహనాలు, దొంగతనాలు, ఉపన్యాసాలు– ఇవన్నీ 'హార్పు' పత్రికలో హడావుడిగా ఉన్నాయి.

మా బావగారికి నా మీద కోపం వచ్చింది. నేను ఇక్కడకు వచ్చాక ఒక్క ఉత్తరం అయినా రాయలేదు. ఆయనకు మహారాజులుంగారు సొమ్ము అప్పు ఇస్తారని వాగ్దానం చేసినపుడు, నేను అడ్డం వచ్చానని ఆయన ఏదో విధంగా అవగాహనకు

వచ్చారు. ఈ విషయంలో ఒక ఫలితం వచ్చింది. అది నాకు, మా బావగారికి మధ్య విభేదం. నా భార్య, పిల్లలు మాడుగులలో ఉన్నారు. వారు క్షేమంగా ఉన్నారన్న సంగతి నాకు తెలియజేయటానికి మా బావగారికి కనీస ధర్మం. కాని ఆయన ఆ పని చేయలేదు. పరవాలేదు నేనే చొరవ తీసుకొని నా విధిని నిర్వహించాను. అందుకు ఎంత మాత్రం విచారించను. మహారాజులుంగారి దయకు నేను తగను. వారు అప్పును అనుకూలమైన షరతుల మీద ఇస్తానన్నారు. కొన్ని సంవత్సరాల క్రితం రెండు వేల రూపాయలు అప్పుగా తీసుకున్నాను. అప్పుడు నా పరిస్థితులు బాగా లేవు. ఒక్క రూపాయి కూడ తిరిగి చెల్లించలేక పోయాను. ఇస్తానన్నప్పుడు మహారాజులుంగారు బహుశా జ్ఞాపకం పెట్టుకొని ఉండరు. ఇస్తానన్నది నేను పుచ్చుకోలేదని నా స్నేహితులకు తెలుసు. మా బావ సబబుగా లేకపోయినా, నేనేమి అనుకోలేదు. మహారాజులుంగారి ఔదార్యం అసంఖ్యాకం. నాకు ఎంతో అవసరమైనపుడు మహారాజులుంగారు మనశ్శాంతిని ఇచ్చారు. నేనిక్కడ ఎన్నో నెలలుగా ఉంటున్నాను. నా ఆరోగ్యం చెప్పుకోతగ్గట్టుగా బాగుపడలేదు. ఇంకా బాగా నయమవుతుందనడానికి నాకుండిన ఆశ బహు స్వల్పం. అడ్మిరాల్టి భవనంలో బాగు కాకపోతే విజయనగరంలో అవకాశం బహుస్వల్పం. నా మనస్సు ప్రశాంతంగా లేదు. పురావస్తు జ్ఞానపు పిచ్చి పెరిగిపోతూ వుంది. ప్రత్యేకంగా మహారాజులుంగారి కుటుంబం సంబంధంగా. ఇందు కోసమే నేను బెంగుళూరు వెళ్ళాను. ప్రాచ్య విద్యా గ్రంధాలయంలో ఇందు కోసమే ఎన్నో గంటలు పనిచేసి అలిసిపోయాను. ఆరోగ్యం బాగాలేని మనిషికి తనకు చేతనయినది మాత్రమే చేయాలి. ఈ కుటుంబపు తొలికాలపు చరిత్ర గురించి కొంత సమాచారం సేకరించినట్లయితే, నాకు చాల సంతోషంగా ఉండేది.

ఇప్పుడు నా చేతిలో మూడు విషయాలున్నాయి. అవి మహారాజులుంగారి కుటుంబం, తెలుగు రంగస్థలం, క్షత్రియుల విద్య.

బట్లర్‌కు పది అణాలు. వంట మనిషికి జట్కా అద్దె.

రామస్వామి చెట్టి అండ్ కంపెనీ వారి నుండి ఒక రూపాయి తీసుకున్నాను. ఒక రూపాయి ఇచ్చి వేశాను. హాక్‌నె బండివాడికి ఒక రూపాయి ఇచ్చాను. 6 అణాలు జట్కావాలాకు ఇచ్చాను. సొంత గుర్రం దారిలో సమ్మె చేసింది. దానిని ఇంటికి పంపివేయవలసి వచ్చింది. జ్ఞాన సమాజం సమావేశానికి వెళ్ళాను. సంస్కృత పండితుడు, సంగీతం గురించి తెలుగులో ఒక ప్రసంగాన్ని చదివారు. ఎవరికీ అర్థం కాలేదు. లేదా అర్థం చేసుకోడానికి ప్రయత్నించలేదు. వచ్చినవారు బహుకొద్ది మంది. మిస్టర్ ఆడమ్ అధ్యక్షుడు. ఇద్దరు పిల్లలు చూడ ముచ్చటగా ఉన్నారు. అక్కడి నుండి రైలు స్టేషన్‌కు.

స్వామినాథ అయ్యంగారు తన భార్యతో మొదటి తరగతిలో ప్రయాణం చేస్తున్నారు. ఇద్దరు యూరోపియన్లు ఆయన పెట్టెలో ఎక్కారు. రైలు బయలుదేరుతుందనగా తన సామాన్లు మొదలగునవి అన్నీ రిజర్వు చేసిన కంపార్ట్‌మెంట్‌లో ఎక్కించవలసి వచ్చింది. మొదటే ఒక పెట్టెను ఆయన ఎందుకు రిజర్వు చేసుకోలేదు?

☆ ☆ ☆

* 21-4-1895 *

ముఖకవళికలలో కనుబొమల తీరు ముఖ్యమైనది. కనుబొమలు ముందుకు చొచ్చుకొని వస్తే బాగుండవు. లోతుకుపోయిన కనుబొమలు క్రూరత్వాన్ని వ్యక్తం చేస్తాయి. లేదా తుంటరితనాన్ని వ్యక్తం చేస్తాయి. సున్నితంగా అమరివున్నవి కుదురుగా ఉంటాయి. క్రమక్రమంగా వంగి ఉన్నవి బాగా దట్టంగా ఉంటాయి. కళ్ళకి బాగా దూరంగా ఉన్నవి, లేదా బాగా చేరువగా ఉన్నవి అందంగా ఉంటాయి. దీనికి మించి పైకి వెళ్ళినపుడు తెలివితేటల్ని, కులాసాను వ్యక్తపరుస్తాయి. దట్టంగా ఉన్నవి ముచ్చటగా ఉంటాయి. బహుశా ఉండవేమో! అనంతాచార్యులుగారి కొడుకు విషయం. వీణాధనం పాట విన్నాను. ఆమె రూపం మరీ ఆకర్షణీయంగా ఉండదు. కాని, జాగ్రత్తగా చూసినట్టయితే నమ్రతతో కూడిన శక్తిని వ్యక్త పరుస్తుంది. ఆమె వాయిస్తున్నప్పుడు తీరు బాగుంటుంది. పాండిత్యం కూడ. ఆమె పాడేటప్పుడు ఉదాత్తంగా ఉంటుంది. అప్పుడు కనుబొమలు విడివిడిగా ఉంటాయి. పాట పరమాద్భుతం. కటువుతనం అన్నది కనిపించదు. సున్నితత్వంతో మాధుర్యం మిళితమై ఉంటుంది. కాని, ఈ మద్రాసు మహిళ భావనను శ్రీనివాసాచారి గారి భావ వైవిధ్యాన్ని చూడము. కాని, శ్రీనివాసాచారిగారు ఆమె గానంలోని గాఢతను, సౌలభ్యతను అందుకోలేదు. ఆమెది చాల తక్కువ నాజూకుతనం. అటువంటి సంగీతాన్ని వినే భాగ్యం నాకెన్నడూ కలుగలేదు. స్వర ప్రస్థానం ఉండదు. రాగం, తానం, పల్లవి సున్నితంగాను, తీయగాను ఉంటాయి. సౌలభ్యంతో వ్యక్తమవుతుంటాయి. ఆమె గొంతు వీణా నాదం అంత మధురంగా ఉంటుంది. ఆమె వీణానాదం శేషన్న మొదలైన వారి సంగీతాన్ని మించి పోయింది. గానంలో తీవ్రత స్వల్పం. వాద్యం కచేరీ అంతటా కానరాదు. ఒక మహావ్యక్తి రూపంలాగా.

తిరిగి ఇంటికి వస్తున్నప్పుడు చెట్టియార్ల పెళ్ళి ఊరేగింపు చూశాను. అది ఎంతో బాగుంది. మంచి అభిరుచితో ఉన్నది. వారి వెనకాతల వందలమంది గొప్ప దుస్తులు వేసుకున్నవారు వెళుతున్నారు. చిన్నకుర్రవాడు, చిన్నమ్మాయి గుర్రం మీద వెళుతున్నారు. అమ్మాయి బట్టలు, నగలు తళతళ మెరిసిపోతున్నాయి. ఇది మనసుకు హత్తుకుపోతుంది. కొంతమంది యువతులు చాల చక్కగా ఉన్నారు. యంగ్ మెన్ ఇండియన్ అసోసియేషన్ అల్పాహారాలు చాల బాగున్నాయి.

☆ ☆ ☆

* 24-4-1895 *

గుర్రం నడవడం లేదు. జమేధార్ వద్దకు వెళ్ళాను. అక్కడ లేదు. ఒక జట్కా అద్దెకు తీసుకున్నాను. మొదట 'వెస్ట్స్' కంపెనీకి తరువాత నగరంలోనికి వెళ్ళాను. అక్కడి నుండి లిటరరీ సొసైటీకి వెళ్ళాను.

ప్రస్తుతం మత విశ్వాసం భారతదేశంలో పెరుగుతుందా! తరుగుతుందా! ఎవరు ప్రమాదకరమైనవాడు. దగా చేసే స్నేహితుడా! బహిరంగ శత్రువా!

వయసు మీరిన పెద్దవాళ్ళు ఆత్మహత్య ధైర్యశాలి చేసే పనా! లేదా పిరికిపంద చేసేపనా?

మద్యనిషేధమా! లేదా మితితో దానిలో స్నానం చేయడమా! విద్యావివేకాలు నేర ప్రవృత్తిని తగ్గిస్తాయా?

జీవిత పరిశుద్ధత సంఘంలో ఛాందసత్వం లేదా అదిలేని నడత?

* *25-4-1895* *

శ్రీనివాసాచారి గారు రామస్వామి అయ్యర్‌గారి ముఖం తేరిపార చూసారు. అయ్యర్‌గారు ఆయనకో సలాం పెట్టారు.

☆ ☆ ☆

* *26-4-1895* *
శుక్రవారం

జట్కా మనిషి బండిని సిద్ధం చేయలేదు. పెద్దగాలి.

☆ ☆ ☆

* *27-4-1895* *
శనివారం

విజయనగరం కాలేజీ విద్యార్థి ఒకడు ఉదయం పూట నా దగ్గరకు వచ్చాడు. అప్పుడు నేను పువ్వులు ఏరుతున్నాను. అతను సుందరం పంతులుగారి దగ్గరకు వెళ్ళి తన గురించి నన్ను మాట్లాడమన్నాడు. పరమేశ్వరం పిళ్లై ఒక స్నేహితునితో సాయంత్రం పూట వచ్చాడు. బిలియర్డ్స్ ఆడాము. చాలా ఉత్తరాలు రాశాను.

☆ ☆ ☆

* *28-4-1895* *
ఆదివారం

ఈరోజు చాలా ఉత్తరాలు రాశాను. నాయుడుగారి మిత్రుడు దుబాసీతో అన్నతను వచ్చాడు. చాలసేపు కాలక్షేపం చేశాను.

మా వంట మనిషి చెప్పుకోదగ్గ స్త్రీ. బాగా నలుపు. దీని తర్వాత ఆవిడ వర్ణన. మొదట ఆమె నాకు చాల మంచి అభిప్రాయం కలిగించింది. మత విశ్వాసం బాగా ఉన్నావిడ. మద్రాసులో ఎన్నో సంవత్సరాలుండినా పట్టణపు తీరుతెన్నులు ఏమీ అలవరచుకోలేదు. నాకు ఆశ్చర్యం కలిగింది. ఆమెది కమ్మని గొంతుక. పాటలు పాడుతుంది. అదీ మతానికి సంబంధించినవి మాత్రమే గాదు. కొన్ని శృంగారపు పాటలు కూడ. ఆమె అన్నదమ్ములు కరణీకం కోసం కోర్టులో పోరాటం సాగిస్తున్నారు. శ్రీ బి.యస్.పంతులుగార్ని చిత్తూరులో చూసినట్టుగా చెప్పింది. బి.యస్.గారు నెల్లూరుకి బదిలీ అయ్యారని, ఆమె అన్నదమ్ముల దావాను అనుకూలంగా తీర్పు చెప్పేస్తారని చెప్పారు.

ఈవిడకి కబుర్లు చెప్పడం మహాయిష్టం. ఆమె నడత గురించి చెడుగా ఏమీ వినలేదు. వి.యస్.ఆర్ కుటుంబాన్ని ఆమె బాగా ఎరుగును. వి.యస్.ఆర్. ఒక మధ్వులమ్మాయిని

పెళ్ళి చేసుకున్నాడు. ఆ అమ్మాయి అందగత్తె. యూరోపియనులలోగానీ, మన దేశస్థులలో గాని అటువంటి అందం లేదు. ఆమె 'శ్రీర' జమిందారుని కుమార్తె. ఆమె పెద్దమనిషి అయిన పదహారవ రోజున శోభనం జరిపించారు. ఆనాడే కాపురానికి ఇక్కడకు తీసుకొచ్చారు.

మా వంటలక్క ఈ ముచ్చటలను చెబుతుండగా, నేను 'ఆమె ఇప్పుడు ఉందా' అని అడిగాను. జవాబు– 'లేదు చనిపోయింది' హఠాత్తుగా. పది నెలలు మాత్రమే ఆయనతో కలిసి జీవించింది. ఒకరోజు ఆమెను బొంబాయి తీసుకువెళ్ళాడు. రోజుకు వంద రూపాయల అద్దెతో రూం తీసుకున్నాడు. ఆవిడ అద్దంలో చూస్తూ ఉంటే ఒక పులి రూపం కనిపించింది. పులి ఆవిడ్ని మింగేస్తుందా అన్నట్టుంది. ఉలికి పడేటట్టుగా ఉంది. ఆమె మూర్ఛబోయింది. మంత్రాలు తెలిసిన ఒక ముసల్మాను కోసం కబురు పెట్టారు. నూరు కుండల చన్నీళ్ళు తల మీద కురిపించి ఆమెకు తెలివి కలిగించమని ఆయన చెప్పాడు. అది అయ్యాక ఆమెకు తెలివి వచ్చింది. తరువాత వారు బొంబాయి వదలి ఇక్కడకు తిరిగి వచ్చారు. ఇప్పుడావిడ పూర్వపు మనిషి కాదు. ఆమె అందచందాలు మరుగున పడ్డాయి. ఆమెను 'శ్రీర' వద్దకు వెళ్ళమని ఆమె బంధువులు అనేకసార్లు చెప్పారు. కాని, ఆమె వెళ్ళలేదు.

దంపతులిద్దరూ సంతోషముగా ఉండేవారా! అవును, కాదు అని చెప్పలేను. అతని భుజాలపై ఆమె ఎప్పుడూ పడుతూ వుండేది. అతడొకరోజు కృష్ణా జిల్లాలో ఉన్న తన తోబుట్టువును చూడడానికి వెళ్ళాడు. ఒక రోజున ఆమెకు ఒంట్లో బాగుండలేదు. కొంచెం మజ్జిగా, అన్నమూ పెట్టమని అయిదారుసార్లు అడిగింది. ఆ రోజంతా అడుగుతూనే ఉంది. భర్త గ్రామము నుండి తిరిగి వచ్చాక, తనకు ఒంట్లో బాగుండలేదని, చికాకుగా ఉందని చెప్పింది. తాను లోపలకు రాకూడదని 'బయట' ఉన్నానని చెప్పింది. తన ఒంటి మీద చెయ్యి వెయ్యమని భర్తను అడిగింది. భర్త, భార్యను స్పృశించాడు. తన మెడను రెండు చేతులు దగ్గరకు తీసుకోమని అడిగింది. భర్త భుజాలపై తలవాల్చుకొని చనిపోయింది. అప్పటి నుండి అతని మనసు బాగుండలేదు. ఎప్పుడు ఏది మాట్లాడినా ఆమెను గురించే, తను భార్యను గురించి 'కథారత్నాకరం' అనే గ్రంథాన్నీ, ఒక నవలను రాశారు.

ఈ కథ నన్ను నిజంగా ప్రభావితుణ్ని చేసింది. ఎప్పుడూ అదే ఆలోచన, అవే తలంపులు, వంటలక్క బహుశా ఇదంతా చూసింది కాబోలు.

వి.ఎస్.ఆర్. స్కూలులో మాష్టరుగా చేరి తరువాత ప్లీడరు వృత్తి చేపట్టారు. అదృష్టం కలిసి వచ్చింది. సొమ్ము చేసుకున్నాడు. పి.యస్.యస్.ను ప్రారంభించాడు. అది ఫలించలేదు. జి.పి.లో వ్యవహార సరళి వ్యాసంగంలో పాల్గొన్నారు. మంచి వక్త, తెలివైనవాడు.

ఈ కథకు ఇంకో రూపం అనుమానం, హత్య. అది అబద్ధం అని నేను మనసారా ఆశిస్తున్నాను. అదే నిజమైతే దేవుడు రక్షించుగాక అతడు దెయ్యమై వుండాలి. పెద్ద దద్దమ్మ అయివుండాలి. ఇది అసాధ్యమేమీ కాదు. ఏదేదో రాతలు రాసే అల్పబుద్ధి గలవాడు. ఒక కొడుకు ఒక కూతురు ఉన్నవాడు. ఇంకో కులానికి చెందిన అమ్మాయి మరులలో పడ్డవాడు. చాల ఖర్చు చేసి

వెళ్ళాడాడు. అటువంటివాడు పెద్ద అసూయలో పడడం అసహజమేమీ కాదు. కొద్ది రోజులలో అతనాడ్ని చూడాలి. జె.ఎస్.ఆర్. ఈ కథకు కాల్పనిక రూపం ఇచ్చారు. స్పెక్యులేషన్‌లో ధనమంతా పోయింది. తరువాత ఆత్మవంచన చేసుకొని తాను తన భార్య ఆత్మహత్య చేసుకోవాలనుకున్నారట. గదిలో కూర్చొని తలుపులు వేసుకున్నారు. ఆమె త్రాగింది. అతను త్రాగే ముందర వారి కథ నలుగురికి తెలిసింది. అతని ఆత్మహత్య ప్రయత్నం విఫలమయింది.

దుబాసీకి ఓలియట్స్ కర్ర ఇచ్చాను. జలంత్ర దావాలు గురించి మాట్లాడటానికి వకీలు రంగాచారియర్ వద్దకు వెళ్ళాను. తరువాత సముద్రతీరం మీదుగా ఇంటికి.

☆ ☆ ☆

*** *29-4-1895* ***
**సోమవారం**

నాటకాలలో కథానాయిక పాత్రలు తక్కువ. వసంతసేన వేశ్య. కాళిదాసుని 'నాయికలు' శృంగారమునకు ప్రసిద్ధి. నాటకాలలో దాంపత్య శృంగారములు తక్కువ. నాయిక లేని నాటక పాత్రలు. గ్రీకు నాటక రంగం, ఇంగ్లీషులో ఆంగ్లేయుల జీవితము, భారతీయ నాటకములలో హిందూ దేశ పరిస్థితులు.

లీలావతి, సులోచన లేదా ఇద్దరు అక్క చెల్లెళ్ళు వి.సాంబనాథన్, బి.ఏ., రచించిన నాటకం.

రివరెండు డి.అనంతన్ బి.ఏ., హెడ్‌మాస్టర్. సి.ఎమ్.ఎస్. హైస్కూలు.

'ఎడ్మిరాల్టీ భవనం' ఇప్పుడు అందచందాలతో మెరిసిపోతూంది. ఉదయాలు ఆనందంగా ఉంటున్నాయి. అక్క పక్షులు ఇక్కడ మకాం పెట్టాయి. తమ తియ్యని పాటలు సాగిస్తున్నాయి. తోటలో ఎన్నోలతలు, లిల్లీపూలు, నందివర్ధనాలు, లతలు, సంపెంగ, సూర్యగంగరేణి, మందార.

టెలిఫోన్ల మ్రోతలు ఒకదానికొకటి అడ్డం వచ్చాయి. కేంద్ర కార్యాలయం పంపిన నౌఖరు బాగుచేశాడు.

అయాంబిక్ పెంటా మీటరూ, లాటిను డ్రమెటిక్ మీటరూ ఒకటేనా? యూరిపిడస్‌ను తమిళంలోనికి ఎవరు అనువదించారు. ప్రాచీన భారతదేశపు నాటకములు ముద్రించలేదు. ఎంత దౌర్భాగ్యము!

సిస్టర్‌ఇన్‌లా వయసు ఇరవై. ఆమె భర్త మెజిస్ట్రేట్. ఆవిడ గది ఆమె వస్తుజాలం ఉంది. అతని సోదరుని భార్య వచ్చి అతనితో వుంటుంది. వీరిద్దరికి ఆమె అంటే అసూయ. ఆమెకు విషం పెట్టి చంపివేశారు. ఎందుకు విషం పెట్టి చంపారో తెలియదు. కారణం ఎవరికీ తెలియదు. తానే విషం పుచ్చుకుందని కొందరంటారు.

ఒకరోజు రాత్రి అరుపు వినిపించింది. విషమిచ్చి కొళ్ళతా, మేడ మీద నడిచారు. ఆ అరుపు అతను కూడ విన్నాడు. ఎందుచేతనో అతనికి ఆ రాత్రి నిద్రపట్టలేదు. నౌఖరు కూడ విన్నాడు. ఉదయం ఆమె గది తలుపులు చాలా సేపు

మూసికొని వున్నాయి. బలవంతంగా తెరిచారు. ఆవిడ శవం కనిపించింది. ఆమె పక్క దగ్గర విషంతో గ్లాసు. పోలీసుల్ని పిలిపించారు. అతని వద్ద బాగా డబ్బు ఉంది. ఇది జరిగి ఏడాది అయ్యింది. వి.యస్. గురించి నేను అడిగాను. ఆమె ఆయన ఎక్కడున్నది అన్నీ చెప్పింది. అతనికి మంచితనం ఒకటి యెలాగూ వుంది. పెళ్ళాలకు సంగీతం చెప్పడమేమిటి? పై వాళ్ళ ముందర పాడించడమేమిటి? వి.యస్‌కు ఇది ఇష్టమేనా? ఔను.

నలుగురు కుటుంబీకులకు ఒక ఉత్తరం చెప్పి రాయించారు. వీళ్ళు కె.హెచ్.కు సంబంధించినవారు. వీళ్ళు ఎల్.సిలో చదువుతున్నారు. ఎన్. కృష్ణారావు వద్దకు వెళ్ళి చూపేరు. ఆమె ఇతరులను కూడ ఈ వ్యవహారంలో చేర్చుతుందేమోనని. తన స్నేహితులకు చూపుతుందేమోని ఉద్దేశం. నిజం కనుక్కోవాలని వై.ఎఫ్.ఎస్.ఎస్.చేత పాటలు రాయించాలని ఎన్.ఎస్ ఏమన్నారంటే క్షమాపణలు చెప్పారు. అయ్యో పాపం. నేను చాల బాధపడ్డాను. కాని, ముళ్ళమధ్యనే కదా గులాబీలు వికసించేది.

☆ ☆ ☆

** 30-4-1895 **
*మంగళవారం*

వెస్ట్ అండ్ కంపెనీకి వెళ్ళాను. మిస్టర్ శామ్యుల్ రాలేదు. మిస్టర్ బిషప్ మూడు రోజులలో బుక్కులను తయారుచేసి ఇస్తానన్నాడు. బైండరు ఊరు నుండి రాలేదు. ఆలస్యం అవుతుందని ఫోర్‌మెన్ చెప్పాడు.

అక్కడ నుండి పచ్చయ్యప్ప కళాశాల హాలుకు వెళ్ళాను. అక్కడ సత్యానాధన్‌గారు ఒక ప్రసంగ వ్యాసం చదివారు. విషయం 'హిందువులకు, యూరోపియన్‌లకు మధ్య సాంఘిక సంబంధాలు' అది శంకర్ నాయర్‌గారి కొత్త పత్రికకు ప్రచురణ కోసం ఇవ్వబడింది. రావు అధ్యక్షత వహించారు. ఇంగ్లీషు ప్రత్యేకించి ప్రసంగంగా లేదు. కొన్ని కొన్ని చోట్ల మరీ దౌర్జన్యంగా ఉంది. చాతుర్యం కనబరిచే విధంగా ఉంది. విషయం గంభీరంగా లేదు. యూరోపియన్లకు మనపట్ల సానుభూతి తక్కువన్న నానుడిలో ఆయనకు నమ్మకం ఉంది. వారికి సానుభూతి లేదు కాబట్టి. వారు మనల్ని అల్పంగా భావిస్తారు.

స్త్రీలను బయటకు తీసుకురారు. మనలో ఐకమత్యమేమీ లేదు. అధికృత భావం, దర్పం ఇంగ్లీషు వాళ్ళ లోపాలు. దేశీయులు వినమ్రులై ఉంటారు. కాబట్టి ఇంగ్లీషు వాళ్ళు వాళ్ళని గౌరవించరు.

నా భావాలు ఏమిటంటే– వేరు వేరుగా ఉండటానికి కారణాలు.

1. సాంఘిక స్థితిలో భేదం. మనం ఇతరులపై ఆధారపడే వాళ్ళం. ప్రభుత్వ సేవకులం, భక్తులం.
2. ఆచార వ్యవహారాలు భిన్నం.
3. మన రూపు రేఖలు బాగుండవు. ఇందుకు మహిళలను నిందించలేము. వాళ్ళు మనల్ని దరికి రానివ్వరు.

4. మనకు మన మధ్య ఒకే విధమైన ఆసక్తి ఉన్నట్టయితే పరస్పర సహాయం సాన్నిహిత్యం ఉంటుంది.
5. విద్యావంతుడైన దేశస్థుడు తనకు పరిచయస్థుడు కాడు. ఏవిధంగాను నచ్చినవాడు కాడు. అతన్ని బాగా ఇంకా తెల్సుకోవల్సి ఉంది. అతనికి సంస్కారం, సంస్కృతి అలవడినట్టయితే అతన్ని గౌరవించడం జరుగుతుంది. దీనికి తోడు అతనికి డబ్బు కూడ ఉండాలి.

గమనిక: గురజాడ జీవిత సరళిని చూపే సంగతులు దినచర్యలలో వేరువేరు చోట్ల కనిపిస్తాయి. వీటిన్నట్నీ ఏకరువుపెడుతూ పోవడం గ్రంథ విస్తర భీతి లేకపోవడమే. వీటిని కుదించడం మంచిది. ఎవరో ఆసామీకి రెండణాలో మూడణాలో యివ్వడం, మళ్ళీ వాటిని తీసుకోవడం వంటివి దినచర్యలలో అసంఖ్యాకాలు. ఇవి ఆయన సునిశిత పరిశీలనలను తెలుపుతాయి. వీటిని తొలిగించడం వల్ల వచ్చే నష్టమేమీ లేదు. పాఠకులు గమనించాలి. కథల సంపుటంలో 'మెటిల్డా' అన్న కథ వుంది. అది ఎంత వరకు నిజమో, ఎంత వరకు కల్పనో తెలిసినవారు లేరు. గురజాడ అప్పారావుగారి కుమారుడు రామదాసుగారు ప్రచురణకు హక్కు యిచ్చినప్పుడు సంకలితం చేసిన అవసరాల సూర్యారావు దానిలో ఏమీలేదని చెప్పి వెయ్యడం జరిగింది. వివరాలు 'ఆంధ్రజ్యోతి' దినపత్రికలో అవి ఆయన ఫోర్జరీలుగా చెప్పబడింది. ఈచర్చకు 'విశాలాంధ్ర'లో జవాబు వెలువడింది. (సంపాదకుడు)

పత్రికలు నిత్యం నిర్వహించాల్సిన పనులు.

1. బలహీనులు, నిరుపేదలు అవివాహితులుగా ఉండుట
2. పిల్లలకు సరియైన పోషణ, ఆరోగ్యకరమైన మందులు వాడకపోవడం, చెడ్డ అలవాట్లు మానడం.
3. క్షత్రియులు, శూద్రులు తమ బాలికలకు ఆలస్యంగా పెళ్ళిళ్ళు చెయ్యడం.
4. వార్తా పత్రికలలో– శైలిలో జాగ్రత్త తీసుకోవల్సిన అవసరం ఏముంది? మన వార్తా పత్రికలలో రాసేవారు ఇటువంటి అనుకూలం కాని పరిస్థితుల్లో పనిచేస్తున్నారు. మరి కొద్ది మంది అన్ని శాఖల మేనేజరు, సంపాదకుడు, యజమాని, బడిపంతులు, వకీలు ఇతర వృత్తుల బాధ్యతలు. చదవడానికి వ్యవధి లేదు. దేశంలో ఐక్యత లేకపోవడం లోపం.

హాస్యం ఎక్కువ ఆకర్షిస్తుంది. సరియైన రీతి కథాసాహిత్యం, గుడ్డి అనువాదం కూడదు. మాతృభాషను ప్రవేశపెట్టడం అవసరం.

☆ ☆ ☆

** 2-5-1895 **

కాస్మోపాలిటన్ క్లబ్‌కు వెళ్ళాను. అక్కడ మద్రాసు పట్టభద్రుల సంఘ పునర్విభజన జరిగింది. చిన్న చిన్న గుంపులుగా డాబా మీద సభ్యులు కొంత సేపు

పచారి చేశారు. అల్పాహారాలు ఆరగించారు. ముందు కాఫీ, రొట్టె, ద్రాక్షపళ్ళు, కమలాపండ్లు మొదలైనవి. రంగాచారిగారు ఒక ప్రసంగ వ్యాసం చదివారు. ఆయన చదివిన తీరు బాగోలేదు. ప్రతి వాక్యాన్ని అనవసరంగా నొక్కి చెప్పారు. ఆయన చెప్పినదాంట్లో చెప్పకోవలసినదేమీలేదు. ఆశ్చర్యయోగ్యమైనది ఏమీ లేదు. మణి అయ్యర్‌గారు అధ్యక్షత వహించారు. సుందరశాస్త్రిగారు నా ప్రక్కన కూర్చున్నారు. మంచి వ్యాఖ్యానం చేసారు. సబ్ జడ్జీ పదవి కోసం ఆయన ప్రయత్నిస్తున్నారు.

బాలారావుగారి ప్రసంగంలో హాస్యం ఎక్కువ. ఆ హాస్యం ఆయన కల్పించింది కాదు. ఎందుకనో పట్టభద్రుల్ని నిందించారు. స్వీయ ప్రతిభ లేదు. మాతృభాషా అధ్యయనం లేదు. సాంఘిక సంస్కరణ గురించి ప్రసంగించారు. ఒక జిల్లా మునసబుగారు చాలసేపు నిలబడి మాట్లాడారు. విదేశీయ భాష నేర్చుకోవడంలో ఉన్న కష్టాల్ని చెప్పారు. పనికి మాలినది బోధిస్తారు. ఉదాహరణకు గణితశాస్త్రం. ఈ విధంగా చెప్పిందే చెపుతూ సాగింది ప్రసంగం. సుబ్రహ్మణ్యం గారు ఇలా చెప్పారు. 'స్త్రీ విద్య గురించి మీకు ఖాతరు లేదు, కొడుకుల విద్య కోసం చాల డబ్బు ఖర్చు చేస్తారు. కుమార్తెల విద్య కోసం చేసే ఖర్చు బహు తక్కువ. మరొక పెద్ద మనిషి లేచారు. ఆయన పట్టభద్రులు చేసిన దాన్ని గురించి తాను బాగా సంతృప్తి పడుతున్నానని చెప్పారు.'

సభకు ముందర ఎటువంటి కార్యక్రమం లేదు. పట్టభద్రులుగా వారి మొదటి బాధ్యత విద్యా విషయాల గురించి ఉండాలి. తెలివితేటలు గల ప్రజాభిప్రాయం విద్య గురించి లేనేలేదు. చరిత్ర మొదలైన వాటి బోధన సాహిత్య కృషి స్వీయ ప్రతిభ గురించి ఎక్కువ ప్రసంగాలు.

మద్రాసు రంగస్థలం అవమానకరంగా ఉంది. మాతృభాషలు అధ్వాన్న పరిస్థితిలో ఉన్నాయి. కళ ఏమీ లేదు. విషయంలోను అంతే, నవలల ద్వారా, నాటకాల ద్వారా ఉన్నతరీతి నైతిక భావాల్ని ప్రాచుర్యానికి తేవాలి. విద్యా బోధన తప్పుల తడక, నాయకత్వం లేదు. ఇంగ్లీషుతో పోటీ, విప్లవ భావన భూతద్దంలో కన్పిస్తుంది. స్వభావం నైతికం, పట్టభద్రులు, సంస్థల్ని స్థాపించలేదు.

ఆస్థానంలో ఇంగ్లీషు, భారతీయ చరిత్రలు, మెట్రిక్యులేషన్ క్లాసు. ఇంగ్లీషు భాష చెప్పడానికి ముందర ఉండిన ఆధునిక భారతదేశ చరిత్ర లేదా ఇంగ్లీషు భాషా బోధన కాలానికి ముందర సారస్వతం ఇంతకంటే బాగా నేర్వాలి. మాతృభాష, పండిత పదవులు, మద్రాసు తెలుగు సాంఘిక భేదాలు, ఐక్యతావశ్యకత అన్నదాని సృష్టి, ఒక కట్టుకథ. విద్యాశాఖలో ఉద్యోగాల నియోగాల నియమాలకు పోటీ, యోగ్యులను ఆకర్షించడానికి మెరుగైన వేతనాలు, సౌకర్యాలు, వ్యక్తుల నిర్వహణకు విద్యా సంస్థల అప్పగింత చాలా చెడ్డది. ఇతర ఊర్లలో బడుల కళాశాలలో, నిర్వహణలో అవకతవకలు, కమిటీల పొగరుబోతుతనం. అవి ఇంకా నయంగా నిర్వహించడం నేర్చుకోలేదు. పచ్చయప్ప కళాశాలకు ఒక జాతీయ విద్యాశాల ఉంది. ఇది అర్థం చేసుకోలేం.

ఉపాధ్యాయుల దృష్టాంతం మంచి నడత, సాహిత్యంలో ఆసక్తి. మన విశ్వవిద్యాలయంలోని పరిస్థితుల్లో ఇంగ్లీషు విశ్వ విద్యాలయాలతో తేడాలు, భౌగోళిక

పరిమితి, రాజధాని నగరంలో ఉన్నవారు, అంటే సెనేట్ సభ్యులు. ఇతర చోట్ల పరిస్థితులు సాధారణంగా తెలిసినవే.

పదార్థవిజ్ఞానశాస్త్రం, అభివృద్ధి, జ్ఞానం, బ్రహ్మచర్యం, పరిశుభ్రత, పోషణ ఆసక్తి ఉన్న విషయాలు. కాలేజీలో ఉపాధ్యాయుల సిబ్బంది ఇంత కన్నా బాగా ఉండాలి. ఇంగ్లీషు పట్టభద్రులు ఎవరైనా, దేనినైనా బోధించగలరు. ఏ పరీక్షకైనా పరీక్షకులు అవ్వొచ్చు. స్థానికులు స్వయం ప్రతిభను ప్రదర్శించటం లేదు. ఇందులో ఉపాధ్యాయులు ఎలాంటి స్వయం ప్రతిభ చూపుతున్నారు? పాఠ్య గ్రంథాలను సరిదిద్దడం మాత్రమే.

భారతీయ విద్యార్థుల కోసం ప్రత్యేక గ్రంథాలంటే ఏమిటో, నాకు అర్థం కావడం లేదు. మాతృభాషా గ్రంథాలతోను ఏమీ తెలియరాని మాతృభాషా పద బంధాలతోను సహజంగా పోల్చి చూసుకోవాలి.

ఎఫ్.ఎ. తరగతిలో చరిత్ర పాఠం వింటూ కూర్చోవడం చాల విసుగ్గా ఉంది. ఇంగ్లీషు భాష ఘోరంగా వుంటుంది. చెప్పేతీరు ఎక్కువ. కొన్ని కొన్ని సార్లు వారికి తెలుసు. కాని, వ్యక్తం చేయలేరు. అప్పకవీయంలోని అక్షరాల వర్ణన నుండి మీరే నిర్ణయించుకోవచ్చు. అవి నకిలీవో, అచ్చమైనవో తెలుస్తుంది. రాయచూర్‌లో శాసనాలు ఉన్నాయి.

☆

** 4-5-1895 **

ఆర్.వి. సుబ్బారావుగారి కొడుకు హఠాత్తుగా చనిపోయాడని తెలిసింది. పాపం సాయంత్రం సముద్రతీరానికి అతడు వెళ్ళాడు. తిరిగి ఇంటికి వచ్చాడు. రాత్రి భోజనం చేశాడు. పడుకున్నాడు. ఉదయం పక్క మీద చనిపోయి ఉన్నాడు. ఆర్.వి.యస్.గారు దురదృష్టవంతులు.

మెరియనెట్ ప్రదర్శనకు వెళ్ళాను. అద్భుతం. దృశ్య వైభవం ఎంతో బాగుంది. బొమ్మలాట ఇలా ఉన్నట్టయితే మామూలు ప్రదర్శనం లండన్ నాటక ప్రదర్శనశాలల్లో ఎలా వుంటుందో.

క్లబ్బుకు వెళ్ళాను. అక్కడ శ్రీరామ శాస్త్రిగారితో మాట్లాడాను. ఉత్తర సర్కారులలో విద్యార్థుల సంఘం గురించి మాట్లాడాను.

క్లబ్బులో కూరెళ్ల సుబ్బారాయుడు కొడుకు వెంకటలింగం కనబడ్డాడు. మిస్టర్ కెల్లెట్‌ని, ద్రావిడ తత్త్వశాస్త్రం గురించి, నన్ను పెద్దగా పొగిడారు నేను దాన్ని గురించి అడిగినప్పుడు. అయ్యా! ప్రతిరోజు నేను క్లబ్‌కు వస్తాను అన్నాడు.

బట్లరు దగ్గర నుండి 5 రూపాయలు తీసుకున్నాను. యూరోపియనుల గురించి ఒక నాటకం రాయాలని ఉంది. వారి గురించి సానుభూతి కలుగజేస్తూ, ఈ వర్ణ సంకరులను చూసే తీరు గురించి ఇంగ్లీషు వాళ్ళను సిగ్గుపడేలా చేయాలని ఉంది.

☆

* *5-5-1895* *

దేశీయుల క్లబ్‌కు వెళ్ళాను. రాజామణి చెట్టియార్‌తో ఒక ఆట ఆడాను. మెల్లగా ఆడడం, పుష్, స్పిన్నూ ఇవీ అతని విజయానికి రహస్యాలు. ఎదురుగా బంతి వస్తున్నపుడు, దగ్గరపడినపుడు నీ బేటు కొంచెం వెనక్కు తీసుకొని, పై నుండి బంతిని మెల్లగా కొట్టి, గిరుక్కున వెనక్కు తిరగాలి.

☆

* *6-5-1895* *

నా రచన నా రూపురేఖల వలె ఉంది.

రామ్మూర్తి పంతులుగారి దగ్గర నుండి 10 రూపాయలు తీసుకున్నాను. రంగాచారిగార్ని చూసి ఆయన్ని హైకోర్టుకు తీసుకువెళ్ళాను. స్మిత్ అంగడి వద్ద పెప్సిన్ పొడరు నాలుగణాలకు కొన్నాను. ఒక రూపాయి జట్కావాలాకిచ్చాను.

☆

* *7-5-1895* *

భాషలు ఎలా మారతాయి? చాలా చోట్ల కొంత భాగం ఒకే విధంగా ఇతర చోట్ల కొంత భిన్నంగా అవి ఎందుకు మారాలి? ఉదాహరణకు మూల ద్రావిడ భాష దక్షిణాదిన తమిళంగాను, ఉత్తరాదిన తెలుగుగాను ఎందుకు మారాలి? తమిళ భాషలో చాల వివరాలతోను, మూల భాషకు చేరువుగాను ఉందని అన్నది బర్నలు దొరే అనుకుంటాను. అన్నిటికంటే పాత సారస్వతం ఎక్కువ పూర్వపు రూపం ధరించి ఉండాలి. దాని సోదర భాష కంటే. కాని, తమిళ సారస్వతం, తెలుగు సారస్వతం కంటే ఖచ్చితంగా పూర్వపుది కాదు.

పైనున్న విషయానికి బహూశా జవాబు ఇది – కొద్దిగా కనిపించీ కనిపించినట్టుగా మార్పులు రీతులు వాచికంలో కొందరు కొన్ని ప్రాంతాలలో పలుసార్లు చేస్తారు. ఈ మార్పులు వాటిపై ఆధారపడి ఉంటాయి. కాబట్టి అంచేత ప్రజల ఆచారవ్యవహారాలు, పాటలు, సంగీతం, సాహిత్యం, భాషలు మారుతూ వుంటాయి. ఒకే కుటుంబంలో భేదాలున్నాయి.

☆

* *8-5-1895* *

పచ్చయప్ప కళాశాలలో గణితశాస్త్ర ఆచార్యులను చూశాను. ఆయన నన్ను పలకరించారు. కాని, నేను ఆయన్ని ఎరుగను. ఇది అసంబద్ధంగా ఉంది.

☆

* *10-5-1895* *

నాలుగణాలు పూరి
నాలుగణాలు బండి వానికి
ఒక రూపాయి సోడా సీసా, జింజరు.

☆ ☆ ☆

* *11-5-1895* *

బ్యాంక్వెటింగ్ హాలుకు టిక్కెట్టుకు నాలుగు రూపాయలు. ట్రిప్లికేన్ నాటకశాలకు 1రూ.

షేక్స్‌పియర్ నాటకంలోని దృశ్యాలు. మిస్టర్ అండ్ మిసెస్ బి.క్రాఫ్టన్, విల్మర్ (ప్రదర్శకులు)

ఫాల్‌స్టాఫ్ (షేక్స్‌పియర్ నాటకంలో ఒక విదూషక పాత్ర) తగినంత పెద్ద వయసువాడు కాదు, తీరు ఏదో ఒకలాగుంది. ఎక్కువ అప్పగించినట్టుగా ఉంది కాని నటనగా లేదు.

పోర్షియో పాత్రధారిణి చక్కగా ఉంది. (షేక్స్‌పియర్ నాటకం 'మర్చెంట్ ఆఫ్ వెనిస్'లో) మొదటి పాత్ర కంటే బాగుంది.

'మర్చెంట్ ఆఫ్ వెనిస్'లో కల్నల్. సూయిల్ తాను చెప్పవలసిన మాటలు కంఠస్థం కాదు. టేబిల్ మీద నున్న కాగితం నుంచి చదివాడు.

షైలాక్ పాత్ర పరవాలేదు. కాని, పోర్షియో పాత్ర (శ్రీమతి సి.విల్మర్) బహు చక్కగా ఉంది. ఆమె చాల అందగత్తె. వేషధారణ అభిరుచితో కూడినది. రంగస్థలాలంకరణ సహజం. సంభాషణలు స్పష్టంగా అందంగా ఉన్నాయి.

ఒథెల్లో దుస్తులు ఎబ్బెట్టుగా ఉన్నాయి. ఆకారం బాగాలేదు. నటన పాడుగా ఉంది. డెస్డెమోనా ఏమీ బాగాలేదు. శ్రీమతి క్రాఫ్టన్ విల్మర్ ఎమిలియా పరమాద్భుతం. ఇక దుస్తుల సంగతి ఏమి చెప్పాలో తెలియదు. ముచ్చటగా ఉంది. ఇక నటన విషయం ఆమె ఒక్కతె నటించగలదు. మిగతావారి గురించి చెప్పవలసిన పనిలేదు.

ప్రేక్షకులు బాగా వచ్చారు. దేశీయులైన పెద్ద మనుషులు, యువజనులు, వకీళ్లు మొదలైన వారు దండిగా వచ్చారు. ఇంటికి పోతూ పోతూ మేము ట్రిప్లికేన్ నాటకశాలకు వెళ్ళాము. లోపలకు మేము ప్రవేశిస్తుంటే శ్రీనివాసాచారిగార్ని ఎరుగున్న వారెవరో మొట్టమొదటి వరుసలోకి వెళ్ళి సోఫాలో కూర్చోమని మర్యాదగా చెప్పారు. మేము డబ్బు చెల్లించనక్కరలేదని వారు చెప్పారు. కొంతసేపుండి వెళ్ళబోయే ముందు రూపాయి చెల్లించాము. నాటకశాల ఏమీ బాగోలేదు. తెరలు బాగా హీనం. ఆహార్యం, నటన పరమ అధ్వాన్నం, దుస్తులు సిగ్గు చేటుగా ఉన్నాయి. హిరణ్యాక్షుని దుస్తుల వీధిలో అడుక్కునే బిచ్చగాని దుస్తుల కంటే అధ్వాన్నంగా ఉన్నాయి.

ఆమె ఎంతో అనూహ్య పద్ధతిలో నాట్యం చేస్తుంది. పాటలు పాడుతుంది.

ఉత్తరాది ప్రాంతానికి అనుకరణ, మేనేజరు చక్కగా ఉన్నాడు. కొంత సంగీతం సంభాషణ మొదట భాగవతంలోని తెలుగు పద్యాలలో జరిగింది. తరువాత అర్థం తెలుగులో బోధ పర్చారు. ఇది కల్యాణరామన్ శకుంతల సంస్కృతం, తమిళం లాంటిది.

రైల్వేస్టేషన్ నుండి పుస్తకాలు వచ్చాయి.

యూరోపియన్ నాటకం. ఒక పెద్ద ఉద్యోగస్థుడు ఒక కొండజాతి స్త్రీని పెట్టుకుంటాడు. ఇద్దరు పిల్లలు కలిగారు వాళ్ల పెంపకం.... జరిగింది.

ఆమె నోరు మూయించడానికి పెళ్ళి చేసుకుంటాడు. ఆమెను, పిల్లల్ని పోషిస్తాడు. తరువాత ఆమెతో సంబంధాలను తెంచుకుంటాడు. మహమ్మదీయ వర్తకుడుగా ఉన్నప్పుడు, ఆమెకు అతడి గురించి తెలియదు. వరుసగా పైకం ఇచ్చేవాడు. యువకులు, అతని అక్క చెల్లెలు తిరిగి వస్తారు. తన తల్లి కొండ స్త్రీ అని అతనికి తెలియదు. తండ్రి చనిపోయాడనుకుంటాడు. కాని, ఇండియా తిరిగి వచ్చేటప్పటికి అంతా తారుమారైంది. అతని స్నేహితుడు... ఆమె ఇందుకు చింతించడం లేదని అనుకుంటాడు. ఆమె చింతించడం లేదు. సప్లయిలు కొన్ని రోజులు ఆగిపోతాయి. ఆమె పని చేస్తుంది, చదువుతుంది.

యూరోపియన్ పిల్లను పెళ్లాడాడు. పిల్లలు కలిగారు. దగుల్బాజీ! అతగాడు మరొక యువతిని ప్రేమిస్తాడు.

☆

** 12-5-1895 **

భారతీయ గ్రంథావళి అనేక సంపుటాలు చదవటం ముగించాను.

☆

** 14-5-1895 **

కెల్లెట్‌గార్ని చూశాను. క్రిస్టియన్ కళాశాలలో ఆయన ఆచార్యుడు. ఆయనతో గంటకు పైగా మాట్లాడాను. కళాశాలలో ఆంగ్ల భాషా బోధనలో గల తప్పుల గురించి మాట్లాడాను. విమర్శాపూర్వకంగా ఉండదు. దేశీయ భాషా సారస్వతం గురించి, చరిత్ర రచన, ఉద్యోగాల వేట, తెలుగు పాఠ్యగ్రంథాల ఎంపిక, పరీక్షకులు, ఆధునిక తెలుగు, మద్రాసు తెలుగు. పెద్ద దేశంలో ఒక విశ్వవిద్యాలయం వ్యాపించి వుండటం వల్ల వచ్చే చెడుగులు రామానుజాచారి, మాధవరావు, వెంకటరాయశాస్త్రి, శ్రీరామ శాస్త్రి గురించి మాట్లాడాను. ఈ ఏడాది చాలా ఆలస్యమైపోయింది. వచ్చే ఏడాది చడీచప్పుడు లేకుండా జరుగుతుందని ఆయన చెప్పారు. వ్యక్తిగతంగా నేను పరీక్షాధికారిగా ఉండటానికి లక్ష్యపెట్టను. ఈ విధంగా నా కాలాన్ని దండగ చేసుకోలేను. కాని, మంచి పండితుల్ని నియమించాలని చెప్పాను. ఎంచేతనంటే పరీక్ష పేపర్లు అధ్యయన మార్గాన్ని నిర్ణయిస్తాయి. చరిత్ర బోధన గురించి మాట్లాడుకున్నాము. రోము, గ్రీకు దేశాల చరిత్ర గురించి

మీరు ఎందుకు తులనాత్మకంగా రాయరని ఆయన అడిగారు. అది నా శక్తికి మించిన పనని నేను చెప్పాను. 'కాదు మీరు చేయగలరు' అవి అన్నారు. ప్రపంచ వ్యవహారాల నెన్నింటి గురించో మాట్లాడుకున్నాం.

ఒంట్లో బాగుండలేదు. అందుచేత మొత్తం సంభాషణను రాయలేకపోయాను.

పది పదకొండు రోజుల నుండి ఒంట్లో బాగుండటం లేదు. 'బ్రోంకైటీస్'తో బాధ పడ్డాను. మహారాజులుంగారి పుస్తకాల గురించి రాయడం ఒక్కటే జరిగింది. మామిడిపూడి వెంకట రంగయ్యగారు నన్ను చూడటానికి వచ్చారు. ఆయనంటే నాకు చాల ఇష్టం. సాహిత్యాభిరుచి గల ఈ దేశపు యువకులలో ఆయన ఒకరు.

☆

*** 28-5-1895 ***

వేదం వెంకటరాయశాస్త్రి, 212 తంబు చెట్టి వీధి, బ్లాక్‌టౌన్, మద్రాసు.

బెల్టు కొలతలు టాపుతో 32, అంగుళం కైవారము. అంతకు కొంచెం తక్కువగా ఉంటే మరొకటి వేస్తే బాగుంటుంది.

బి.సూర్యనారాయణరావు గారి కోసం సంస్కృత గ్రంథాలు.

1. శంకర నారాయణ నిఘంటువు
2. చర్మపు బెల్టు
3. ముత్తెపు గుండీలు ఒక జత
4. జాకెట్టు గుడ్డలు
5. ఫేన్సీ వస్తువులు
6. అలారం గడియారం.

☆

*** 3-7-1895 ***

చివరకు ఇల్లు చేరాను. బెజవాడలో మావాళ్ళ అజాగ్రత్త వల్ల రాసుకున్న స్థానిక కైఫీయతుల పరిశోధనకు సంబంధించిన రాత పుస్తకం పోయింది. అంచేత నెలల తరబడి పడిన శ్రమ నష్టమై పోయింది. రాజమండ్రిలో ఒకరోజు ఆగాను. కొన్ని గృహప్రాంగణాల్లో శిలాశాసనాలు చూశాను. వాటి గురించి సరియైన శ్రద్ధ తీసుకోవడం లేదు. ఒక రాత్రి పిఠాపురంలో ఆగాను. మా మేనత్తగారి కుటుంబ పరిస్థితులు బాగోలేవు. ఆమె భర్త రోగిష్ఠి, కోపిష్ఠి, దుస్సాహసి. ఆమె పెద్ద కొడుకు పనికిమాలినవాడు. వాడి సంసార జీవితం ఏమీ బాగుండడం లేదు. మా మేనమామను నాతో ఇక్కడకు తీసుకువచ్చాను. 20 రూ.లు చేతిలో పెట్టి ఇంటికి పంపించివేశాను. ఆయనకు భద్రాచలం వెళదామని వుంది. వ్యవసాయపు పని మొదలు పెట్టాలని.

గత సాయంత్రం మహారాజులుంగారు ఇతరుల పట్ల ఆర్ద్రత గురించి, కోపతాపాలు,

నిగ్రహం గురించి మాట్లాడారు. దీనికి సందర్భం ఏమిటంటే– క్రిందటి రోజున మహారాజులుంగారి ఎదుట కుర్రవాళ్ళని పరీక్షిస్తున్నప్పుడు 'నో, ఎనీ' అన్న ప్రయోగాన్ని లక్ష్మాజీ పండిట్‌గారు వాడుక చేశారు. వెంటనే శర్మగారు తన సహజ రీతిని అది చెడు ఇంగ్లీషు అని కుర్రవాళ్ళ ఎదుట అన్నారు. నేను అప్పుడు అక్కడ లేను. కాని, రామ్మూర్తి పంతులుగారు కూడ పోట్లాటకు దిగారని నాకు తెలిసింది. సుందరరావు పంతులుగారు అక్కడ నుండి వెళ్ళిపోడానికి ముందర క్షమాపణ చెప్పారు. ఈ సాయంత్రం మహారాజులుంగారు ఏమని అన్నారంటే– 'నా దగ్గర ఉన్నవాళ్ళకు నిగ్రహం ఉండాలని ఇతరులకు మనసు నొప్పించకుండా చాలా జాగ్రత్త తీసుకోవాలని, వృత్తిరీత్యా గృహకార్య కలాపాల రీత్యా ఇది జరగాలని' అన్నారు. అప్పటికే మనసుకు కష్టం కలిగిన వారికి మనం ఎందుకు బాధ పెట్టాలి. ఒకరు తప్పు చెప్పినప్పుడు దాన్ని కటువుగా చెప్పడం తగదు. ఈ విషయంలో ఇది ఎప్పుడు జరుగుతున్నదీ గమనించుకోవాలి. చెప్పే పద్ధతులు పాటించాలి. ఒక తప్పు మర్యాదగాను, కోపం తెప్పించకుండాను చెప్పవచ్చును. ఉత్తరాది పండితులొకరు (ఆయన పేరు మర్చిపోయాను) ఉండేవారు. ఈ సంస్కృతం మనుషులు నిందారోపణ చేస్తారు. మహారాజులుంగారు ఇతరుల ఇబ్బంది గురించి ఒక ముచ్చట చెప్పారు. 'గతంలో ఒకప్పుడు సుందరరావు పంతులుగారితో ఇలా అన్నారు. అప్పుడు తన తండ్రి వద్ద కూర్చొని వున్నారు. మహారాజులుంగారికి చాల అసౌకర్యంగా ఉందప్పుడు. చెమట పడుతూ వుంది. సుందరరావు పంతులుగారు నెమ్మదిగా నవ్వి ఇలా అన్నారు. గొప్పతనం ముందర అసౌకర్యం అన్నది ఉండదు.'

ఒకానొక యూరోపియన్ (అతని పేరు కూడ మర్చిపోయాను) మహారాజులుంగారితో ఇలా అన్నారు. ఒక నౌకరుపైని తాను మండిపడ్డానని. భరించరానంత కంగాళి చేస్తుంటాడని అన్నాడు. వాడ్ని చంపుదామనుకున్నాడు. కాని, గొప్ప ఓర్పుతో ఆ పెద్ద మనిషి తన పడక గదిలోకి వెళ్ళి ఒక తాడుతోనో, దేనితోనో తన కోపం తగ్గేవరకు బాదుకున్నాడట.

తాను భోజనం చేస్తున్న మేజా బల్ల వద్దకు తిరిగి వస్తున్నపుడు కీర్తిశేషులైన మహారాజులుంగారు మిస్టర్ అండర్‌వుడ్‌తో ఇలా అన్నారు. మీరు ఎందుకు అలా మండిపడతారు? మనుషులు సరిగా ప్రవర్తించరు. అంత కంటే మంచి పని తెలియదు. ఇదంతా అజ్ఞానం వల్ల వస్తుంది. అప్పుడు అండర్‌వుడ్ ఇలా అన్నాడు. కోపగించడం మంచిది కాదని నాకు తెలుసును. కోపం వల్ల ఉపయోగం లేదు. కోపం అలసట కలిగిస్తుంది. అసౌఖ్యం కలిగిస్తుంది. కోపగించకుండా ఉండలేను. నా స్వభావం సులభంగా కోపం తెప్పిస్తుంది.

శకుంతల నాటకాన్ని రేపు చూడడానికి వెళ్ళాలి. కల్యాణరామ అయ్యర్ నట బృందాన్ని బాలామణి నట బృందంతో పోల్చి చూడగలుగుతాను.

మహారాజులుంగారు గడిచిన కొద్ది రోజుల నుండి లెక్కలేనన్ని వ్యాకరణాలను చదివి చూస్తున్నారు. 'నో,ఎనీ' అన్న ప్రయోగం తప్పా? అయితే ఎందువల్ల అన్నది తెలుసుకోడానికి పరిశీలిస్తున్నారు. ప్రామాణిక రచయితల గ్రంథాల్ని కూడా. షేక్స్‌పియర్, వర్డ్సువర్తు మొదలైనవారి రచనలలో ఈ ప్రయోగం ఉందా లేదా అని

తెలుసుకోడానికి. ఇవాళ మహారాజులుంగారు న్యూమన్, ఫ్రూడ్ దొరకవచ్చునని నాతో చెప్పారు. సూర్యనారాయణ పంతులుగారు పది పేజీలు న్యూమన్ చారిత్రక వ్యాసాలు మొదటి సంపుటం చూసారో లేదో 'నో, ఎనీ' దొరికింది. ఈ విషయం దీనితో ముగిసింది. మహారాజులుంగారు ఈ విధంగా బరువు తగ్గించుకున్నారు.

మా కజిన్ ఎస్.ఆర్. సూర్యనారాయణ పంతులు, వృద్ధులు సంజీవరావు పంతులు ఒకప్పుడు నాకో సహాయం చేశారు. మా పూర్వీకులలో ఒకరు తనను గురించి 'మండలేశ్వర' అని చెప్పుకోవడం జరిగింది. అది నాకు ఎంతో ఉపయోగం. నేను పరిశోధనలు చేశాను. 'సంధి'(ట్రీటీ) గురించి రాసాను. మన సొంత తప్పులు దిద్దుకోవచ్చు. చనిపోయిన మనిషి చెప్పింది మనం వెనక్కి వెళ్ళి చూసుకోనక్కరలేదు. మా నాన్నగారు ఒకసారి కుటుంబానికి 'మహామండలేశ్వర, సుబదార్' అన్న బిరుదులు ఉండేవని చెప్పారు. ఇది నిజం కాదేమోనని నేను సందేహించాను. ఇప్పుడు నిజమనిపిస్తుంది. మా నాన్నగారి గౌరవానికి దీనితో సంబంధం ఉంది. వృద్ధులు సంజీవరావుగారి పత్రం 'మహామండలేశ్వర' బిరుదును ధ్రువపరుస్తున్నది. ఇటీవల అప్పారావు పంతులు తెచ్చిన పుస్తకం ఒకటి 'సుబదార్' అన్న బిరుదాన్ని ధ్రువపరచింది. మంచి తండ్రిగారి మంచి కుమారుడులాగా 'నో,ఎనీ' అన్న ప్రయోగం మా కోసం వెదికి పట్టుకున్నారు.(ఇందుకు మెప్పు మహారాజులుంగారికి చెందుతుంది. ఆయనే ఈ పుస్తకాన్ని గురించి చెప్పారు.) ఈ సమస్యకు పరిష్కారం అయ్యింది. 'న్యూమన్' అధికారాన్ని ఎవరూ ప్రశ్నించలేదు. గుర్తింపబడిన రచయిత ఆయన. ఒకప్పుడు రామానుజాచార్యుల గారికి నాకు భేదాభిప్రాయం వచ్చింది. అది ఈ ప్రయోగం సరియైనది కాదా, అవునా అన్నది. ఈ విషయం నా మనసులో ఐదేళ్ళు బట్టి ఉంది. చివరకు ఈ విషయం వాడుక 'న్యూమన్' గ్రంధంలో దొరికింది. 'నో, ఎనీ' అన్న ప్రయోగం గురించి ఒక ఉదాహరణ కనుక్కోవడం మహత్కార్యమని గాని ఈ పరిశోధనకు ఈ ఘటన బట్టిగాని, ఉత్కర్ష పొందదగినదని గాని నేను అనుకోవడం లేదు. 'నో, ఎనీ' అన్నది సరియైన వాడుక అని చెప్పడానికి నేను ఒప్పుకోను. తాను చెప్పింది పూర్తిగా నిజం, ఇంకోరు చెప్పింది తప్పు. అది కాదు విషయం. ముఖ్యంగా లక్ష్మాజీ పంతులు వంటి వృద్ధుల్ని తప్పు అని చెప్పేటప్పుడు జాగ్రత్తగా చెప్పాలి. నెమ్మదిగా, మృదువుగా చెప్పాలి. లక్ష్మాజీరావు గారు కాలం గడిచిన వారు. ఆయన పెద్దవారు కాబట్టి కొంచెం కటువుగా వున్నారేమో. కాని, చిన్నవారు ఆయన్ని గౌరవించాలి. ఆయన చెప్పినదాన్ని ఒప్పుకొని వార్ని సంతోషపెట్టాలి. తప్పులు చెప్పేటప్పుడు మృదువుగా చెప్పవలసిన పద్ధతులున్నాయి. గట్టిగా చెప్పవలసిన అవసరం లేదు. ఈ పరిస్థితిలో ఇతరుల తప్పులను కనుక్కోవలసిన అవసరం ఏమీ లేదు. ఎంతో గొప్పవారైనా సరే.

ఈ సందర్భంగా మహారాజులుంగారు 'ఒక బిషప్ లేదా ఆర్చిబిషప్ కథ చెప్పారట. మహారాజులుం గారు మిల్ (మిల్లుదొర) మతం గురించి రాసిన మూడు వ్యాసాలు చదువుతున్నారట. వారికి ఏదో ఒక ఇబ్బంది వచ్చింది. కాళిబాబుని ఏమైనా చేయగలరా అని అడిగారు. కాళి ఇలా అన్నారు. నేను ఖాతరు చేయను. వృద్ధుడు కామరాజు (బట్లర్) రాజపుత్ర నౌకరు వెన్న తినేస్తాడు. ఉత్తపాలు ఇతరులకు

ఇస్తాడు. ఇతగాడి పనులు నౌకరు పని. మీరు ఎంత చదువుకున్నా అతగాడితో మీరు వ్యవహరించలేరు. మీ కష్టాల గురించి నెత్తి బాదుకోవలసిందే. మీలా నేను చదువుకున్నవాడ్ని కాను. అందుకు నేను విచారించడం లేదు. రేపటి నుంచి పాలు ఉన్నవి ఉన్నట్టుగా ఇవ్వండి. నేను వాటిని మరగ పట్టించి దాని మీగడతో పాటు తాగేస్తాను. పలానా స్థలమని బట్లర్ దొరకి మీరు బోధపరిచారనుకుంటాను. ఎక్కడో వివరింపబడిందని అతను అంటాడు. ఆయన ఇంగ్లీషు వారు. దైవాంశ సంభూతుడు. బట్లర్ జ్ఞానం ఇటువంటిదేనా, సంభాషణ ముగించిన తరువాత మహారాజులుంగారు బట్లర్ దొర పుస్తకం ప్రతిని పుస్తకాలు అమ్మేవాడి దగ్గర కొన్నాను. చెప్పవలసిన చోట సరిగ్గా బిషప్ చెప్పినట్టుగా ఉంది. ఆశ్చర్యం వేస్తుంది. మహారాజులుంగారు ఏం అనుకున్నారంటే– 'తాము చెప్పవలసి వున్నది దానితోపాటు వినయం వ్యక్తం చేస్తారు.' మహారాజావారు ఇంకా ఏమిటి అన్నారంటే 'యువకులతో మీరు వ్యవహరించే తీరును గురించి జాగ్రత్తగా ఉండాలి. ఒక కుర్రాడి విషయంలో మీరు కటువుగా ఉంటే, తీవ్రంగా చివాట్లు పెడితే, వాడు ఇక మీదట ఎప్పుడూ మీ దరికి రాడు. అయితే వెళ్ళక తప్పదు కూడ. మీ దగ్గర ఉండటం అతగాడికి ఇష్టం ఉండదు. ఇతరులు తనను తప్పు పట్టకూడదని జాగ్రత్త పడతాడు. ఆయన నా గురించి ఏమి అనుకుంటున్నాడు. నా దుస్తులు గురించి, నా రూపం గురించి, నా నడత గురించి, నా తెలివితేటల గురించి, నేను చిన్న వయసులో ఉన్నప్పుడు నా వద్ద ఎటువంటి వారు ఉండేవారన్న విషయం నేను పట్టించుకునే వాడ్నికాను. అయితే నా గురించి ఎవరు చెడుగా అనుకోకూడదు. నా ఆలోచనలన్నీ నా గురించే. ఎవరో ఒకరు ఏదో ఒకదానిని గురించి తప్పుగా అనుకోవడమో, లేదా ఎదురుగా అనుకోవడమో జరిగితే నేను లక్ష్యపెట్టను. నేను క్షమించేసేవాడ్ని.' (మహారాజావారి ప్రవర్తనలో ఒక వింత లక్షణం ఉంది. యువకులకుగాని, వయసు వచ్చిన వారికి గాని ఇలా ఉండదు.) కాని, ఒక మనిషి పెద్దవాడు అవుతున్న కొద్దీ ఒక లక్షణం వస్తుంది. ఎలా అంటే– 'తాను పట్టించుకోకూడదు, తాను పట్టించుకోడు. ఇతరులు ఏమి అనుకుంటున్నారు? ఇతరులతో ఉన్నప్పుడు మంచి చెడ్డలు తెలుసుకోడానికి సిద్ధపడాలి. అలానే తన మంచి చెడ్డలు ఇతరులు తెలుసుకోడానికి సిద్ధపడాలి. తాను కలిసినవారి ప్రవర్తనను అతను తెలుసుకోవాలి. ఆ మనిషి అనబడే పుస్తకాన్ని అధ్యయనం చేయాలి. లేకపోయినట్టయితే, అతను లెక్కలోకి తీసుకోవలసిన మనిషని అనుకుంటారు. ఇతరుల్ని సంతోష పెట్టటానికి అతను ఏ విధంగా ఓపిగ్గా వివరిస్తాడో, సహిస్తాడో, మనస్థితి ఎలా వుంటుందో తెలుస్తుంది. అటువంటి మనిషి దగ్గర నుండి మనం తప్పుగా దేన్నీ గ్రహించలేం. నాకు తెలిసినంత వరకు సంభాషణ ఈ తీరులో సాగింది. ఏదో ఒక చోట తెలియకుండానే తప్పుగా చెప్పివుండవచ్చును. ఉన్నది ఉన్నట్లుగా చెప్పడమేకాదు విషయం. సంభాషణ ఈ దిశకు వచ్చేటప్పటికి నేను శెలవు తీసుకొని వెళ్ళవలసి వచ్చింది.'

☆

వృద్ధులు కృష్ణంరాజుగారి దగ్గరకు ఈ వేళ ఉదయం వెళ్ళాను. విన్నటి కంటే నేడు కాస్త నయంగా ఉన్నారు. ఆయనకు రెండు విరోచనాలు అయ్యాయి. అక్కడ నుండి వీనమ్మ దగ్గరకు వెళ్ళాను. మద్రాసు ఎలక్ట్రిక్ ట్రామ్ కంపెనీ కుదురుగా ఉంది కదాని ఆమె అడిగారు. ఆమెకు సంతోషంతో చెప్పవలసిన వార్త నా దగ్గర లేదు. కాని, దానికి భద్రత ఉన్నట్లుగా ఆమె వాదించారు. న్యాయచట్టం గురించి ఆమెకున్న జ్ఞానం చాల తక్కువ. టెక్కలి ప్రోనోటు దావా వేయటానికి మా నాన్నగారు మేనేజర్ని పంపారు. ఆమె బాధ్యతను చూపలేదు. కాని, నాలుగువేల రూపాయలు ఇవ్వడం ఉచితమా కాదా అని మా నాన్నగార్ని అడిగావని చెప్పింది. ఆయన ముందుగా ఆ పైకం ఇవ్వమని సలహా చెప్పారు. జమీందారు మేనేజరు ప్రోనోటు, ఇంకో పత్రం వ్రాసి ఇచ్చాడు. జమీందారు మేనేజరు ఇంకో దివాళాకోరు పత్రం వ్రాసి ఇచ్చారు. ఈ మేనేజరును తొలగించడం జరిగింది. రాజా అప్పలేదని అన్నాడు. తరువాత హెడ్ మేనేజరు సాహెబ్ వద్దకు వెళ్ళాను. ఆయన విచారంగా కూర్చొని ఒక మాదిరి రెవెన్యూ ఆదాయం దావా చరిత్ర చెప్పకుపోయాడు. అతని విషయం అంతా బాగానే ఉంది. కాని అధిక ప్రసంగం చేస్తున్నాడేమోనని నా భయం.

అక్కడ నుంచి సుందరరావు పంతులు వద్దకు వెళ్ళాను. ఆయన తన వినోదం గురించి నాతో మాట్లాడాడు. దేశీయ వైద్యం గురించి క్రమబద్ధం చేయడం గురించి, దానికి ప్రోత్సాహం ఇవ్వడం గురించి ఆయన మాట్లాడారు.

అక్కడ నుంచి ఇంటికి, తరువాత కోటకు వెళ్ళాను. మహారాజులుంగారు, మేనేజరుగారు గురించి అడిగారు. నేను సంతోషం కలిగించే వార్త చెప్పినందుకు నాకు ధన్యవాదాలు అర్పించారు. నేను అక్కడ లక్ష్మాజీ పంతులుగార్ని చూశాను. ములగచారు మానివేయడం మంచిదని రాజావారు సలహా యిచ్చారు. పిత్తం, అజీర్ణం కలిగిస్తుందని వారు చెప్పారు. కోదండరావు పంతులుగారి ఆహారం మరీ... నల్లమందు కడుపులో పడందే వొక్క గడియ గడవదు. పాలు తాగరు, పెరుగు వేసుకోరు. గోధుమ, ద్రాక్ష, పంచదార తీసుకోరు అని మహారాజావారు సెలవు యిచ్చారు. జబ్బు మనిషికి ఇవి మంచి ఆహారపదార్థాలు. వైద్య గ్రంథాలు ప్రస్తావించారు. మహారాజులుంగారు చెప్పినది ఇవి ఋజువు చేసాయి. కోడి ఇగురు మరణిస్తున్న వారికి మంచి ఆహారం. చనిపోతున్నవారికి పక్క, అదీ తలుపుకి చేరువు. అదంతా ఇటుకలతోను, సున్నంతోను చేసినది. చనిపోతున్న వార్ని పక్కమీంచి నేలపైకి దించవలసిన పనిలేదు. ఇదంతా హఠాత్తుగా ప్రమాదం జరిగితే, ఇది అవసరం. (దేవుడు జరుగకుండ చేయాలి) వారు చిరంజీవిగా జీవించినంత కాలం సుఖంగా జీవించెదరుగాక. ఆయన ప్రత్యేకమైన నడత గలవారు. తాను జీవిస్తున్నప్పుడు ఆయన మనల్ని నవ్వించేవాడు. చనిపోయిన తరువాత కూడ మనల్ని నవ్విస్తున్నాడు.

నిన్న రామ్మూర్తి పంతులు గారు వచ్చారు. మహారాజులుం గారు ఆయనకు కొంత పైకం ఇవ్వాలనుకున్నారు. అంచేత వారు జాయింట్ మేనేజరుగార్ని పిలిచి స్టీవెన్సు దొర పర్యవేక్షణకు లేదా ఏదో కాలువ పరీక్ష చేయడం కొరకో తీసుకువెళ్ళమన్నారు.

ఈపని ఎవరైనా చేయగలరు. స్టీవెన్స్ దొరగారికి పైకం ఇవ్వదలచుకున్నారు. స్టీవెన్స్ మహారాజులుంగారి పట్ల ప్రవర్తన ఎంత మాత్రం తెలివితేటలతో ఉండేది కాదు, ఉచితంగాను ఉండేది కాదు. మహారాజులుంగారి పట్ల ఔదార్యంతో ఉన్నట్లుగా మాట్లాడేవాడు. మర్యాద, మప్పితం ఉండేది కాదు. ఇంకోరెవరు ఆ విధంగా యూరోపియన్‌గాని, దేశీయుడు గాని చేసేవాడు కాదు. ఇటువంటి ప్రవర్తన అసహ్యించుకోవలసింది. అంతా ఏక పక్షంగా ఉండేది. స్టీవెన్స్ లేకుండానే ఈ రోజు అన్నింటిలోను మహారాజావారు వ్యవహరించారు. ఎల్లప్పుడూ ఇలాగనే జరుపగలిగేవారు. స్టీవెన్స్ అది గ్రహించలేదు. మహారాజులుంగారి నుండి తాను పొందిన ఔదార్యం గ్రహించలేకపోయాడు. వారి తీరు అతను అర్థం చేసుకోలేదు. స్టీవెన్స్ డెమోక్రట్ అయినట్లయితే, అతని ప్రవర్తన సమర్థనీయంగా ఉండేది. ఆయనకు కొన్ని కన్‌సర్వేటివ్ దుర్బుద్ధులు ఉండేవి. ఈ లోపాలన్నిటితో స్టీవెన్స్‌కు మంచి లక్షణాలున్నాయి. ఆయన మహారాజుగార్ని ప్రేమించేవాడని నేననుకుంటాను. తనకు సాధ్యమైనపుడు ఎవరికైనా సాయపడటానికి ఆయన ఇష్టపడేవాడు. సర్వీసులో ఉన్న ఇతర యూరోపియనులు కొద్దిగానో లేదా అసలు లేకుండానో పని జరుగుతుంటే వారు తమకు తమ కుటుంబాలకు పెద్దగా కోర్కెలు ఉండేవి. మహారాజులుంగారు వెళ్ళమన్నారు. ఈ పని ఎవరైనా చేయగలరు. మహారాజులుంగారి నుండి తాను పొందిన ఎంతో దయగా మిస్టర్ డేనిస్ ఉద్యోగంలో ఉన్నప్పుడు ఆయనకు కూడ ఇతర ఆదాయం కల్పించేవారు. ఎంచేతనంటే డేనిస్ దొరకు పెళ్ళి అయింది. ఆవిడ ఇంగ్లండు నుండి ప్రయాణం చేసి వచ్చింది. మహారాజావారు డేనిస్ దొర ఆదాయం ఒక వివాహితునికి సరిపడేదికాదు. అంచేత అన్ని విధాల ఉపకారం చేసేవారు.

'నో, ఎనీ' అన్న పదబంధం గురించి మాట్లాడుతూ మహారాజులుంగారు ఇలా అన్నారు. న్యూమన్ గ్రంథం ఒకే ప్రమాణంగా ఉందా లేదా అని ఆలోచించాలి. మహారాజులుంగారు తన అభిప్రాయాల్ని చెప్పడానికి ముందర మిస్టర్ స్టీవెన్సు ఎవర్నీ మాట్లాడనివ్వకుండా 'నేను ఇంగ్లీషు వ్యక్తిని, నా భాష మీ కన్నా నాకు బాగా తెలుసును. మిస్టర్ అండర్‌వుడ్ కూడ నాతో అంగీకరిస్తారు. ఇద్దరు ఇంగ్లీషు వాళ్ళు తమ అభిప్రాయాల్ని తెలిపారు. అక్కడితో ఈ విషయం పరిష్కారమైంది. మిస్టర్ ఆడం కూపరు ఓక్లీ వంటి సమర్థులు ప్రస్తావించారు.' కాని, ఆయన కారణాలను చెప్పరు. వ్యాకరణం గురించి చర్చించడు.

ఈరోజు సాయంత్రం శర్మగారు వచ్చారు. ఆయనకూ లక్ష్మాజీ పంతులుగారికి మధ్య వివాదం జరిగింది. మహారాజులుంగారికి వ్యాకరణంలో ఇంతటి పరిజ్ఞానం ఉండడం ఆశ్చర్యమేస్తుంది. ఆయన గంటల కొద్దీ ఆలోచిస్తూనే ఉన్నారు.

☆

** 11-7-1895 **

మహారాజావారు జాయింట్ మేనేజరుగారిని డి.జె.బి శర్మగారిని, ప్రిన్సిపాల్‌గారిని కూర్చోబెట్టి శర్మగారి సోదరుడికి సంస్థానపు దావాలు అప్పగించవచ్చునా అన్న

విషయం నిర్ణయించేందుకు మాట్లాడారు. మహారాజావారు చాల నేర్పుగా మాట్లాడారు. ఇది నిజంగా అద్భుతంగా ఉంది. ఒక పాలకుని విషయంలో ఆశ్చర్యకరంగా ఉంది. కాని, వారు మేనేజ్‌మెంట్‌ను ఆదేశించరు. ఇందుకు వారి కారణాలు వారికున్నాయి. వాటిని నేను తెలుసుకున్నాను. జమీందారులు ఎందువల్ల స్వయంగా తమ ఎస్టేట్‌ను నిర్వహించకూడదో తెలుసుకున్నాను. ఒక జమీందారు మంచి పాలకుడు అవనక్కరలేదు. నిజానికి తన జీవితం పరిసరాలు వీటిని పెంపొందించనివ్వవు. ఇందువల్ల పరిపాలన చేసే జమీందారు కంగాళీ చేయడం జరుగుతుంది. జమీందారు కర్తవ్యం సాధారణంగా ఉత్తముడైన మేనేజర్ని ఎంచుకోవడంలో ఉంది. తన తాబేదారుల విషయంలో పొరపాటు పూర్తిగా జరుగుతున్నప్పుడు ఈ విధి నిర్వహణ మరలి వస్తుందని నా అభిప్రాయం.

శర్మ గారు తాను చెప్పవలసింది వ్రమతతో చెప్పారు. ఇది విని నేను ఆశ్చర్యపడ్డాను. జగన్నాధరావు పంతులుగారు ఇది చాల అద్భుతంగా చెప్పారు. మహారాజులుంగారు వ్యవహారం నడిపిస్తారు. సూచనలు చేస్తారు. కాని, ఎన్నడూ అధికారం చెలాయించరు. డి.జె.గారి కొడుకు అర్హతలు చిదులు శర్మగారి అన్నగారి అర్హతలు ఎంపిక చేశారు. ఎస్.ఆర్‌కు లాభం చేకూర్చడానికి ఇంకో పైకం ఖర్చు చేయడానికి మహారాజావారు సిద్దంగా ఉన్నారు. జాయింట్ మేనేజరుగారు పేర్కొన్న వారి కంటె డి.జె.గారు, జె.బారిష్టరు వీరి తండ్రి మహారాజావారి స్నేహితులు. మహారాజావారు దయతో మా నాన్నగారి సమాచారం అడిగారు.

☆

** 12-7-1895 **

ఈవేళ రాజావారు బుద్ధిలేనితనం, అపరిశుభ్రత స్థానిక నౌఖరుల నడతలో క్రమం లేకపోవడం గురించి వ్యాఖ్యానం చేశారు. ఏ ఒక్కటీ దాని స్థానంలో అది ఉండదు. సక్రమ పద్ధతిలో ఉండదు. ఎవరైనా తన కోపాన్ని చూపకపోతే వాళ్ళు సరిదిద్దుకోరు. కాస్త కాస్తగా మనం వార్ని బాగుచేయాలి. ఒక చెడ్డ అలవాటుంది. “బెంచీ బల్లలు ఎందుకు పెట్టుకోకూడదు? హిందూ స్త్రీలు రోజులో సగం ఏ పని చేసినా వంగి వండడం, వంటపని, వడ్డన మొదలైనవి. పాత్రలు శుభ్రం చేస్తున్నప్పుడు మొదలైనవి. పాత్రలు శుభ్రం చేస్తున్నప్పుడు లోపలి భాగం అపరిశుభ్రంగా ఉంచుతారు. వెలుపలి భాగం తళతళ మెరిసేటట్లు తోముతారు. ‘ఇ’ దొర ఒకసారి మహారాజులుంగారి స్టూడియోలోకి వెళ్ళారు. దాన్ని వారు దర్పంతో చూపుతున్నారు. పీసాలన్నీ నేలమీద ఏర్పాటు చేసారు. ‘ఇ’గారు మహారాజావారి వైపు చిరునవ్వుతో చూసి ఇలా అన్నారు. ‘నేను ఇక్కడ పని చేయలేను. క్రిందకి వంగి పీసాలు తీయలేను.’ ఇది దెబ్బకొట్టినట్టయింది. అప్పటి నుంచి నేను మేజాబల్లల్లో పెట్టుకున్నాను.”

**తరువాత చేసిన చేర్పులు:**

మహారాజులుం గారు ఎంతటి నిరాడంబరులు! మహారాజులుంగారు తాను తన

మనుషులు భోజనం చేసే మేజాబల్లలు, వారు కూర్చొనే బల్లలు ఏవో కర్రతో చేసినవి. చాలా నిరాడంబరమైన వస్తువులు. ఆయన వేసుకున్న దుస్తులు చాలా సాదాగా ఉంటాయి. పరిశుభ్రంగా ఉంటాయి.

మా నాన్నగారు ఉపయోగించిన టోపీని నేను ఉపయోగిస్తున్నాను.

వీటిని ధనికులు ఇష్టంగా వాడుక చేస్తారు. రాజావారు దాన్ని వదలి పెట్టేశారు. ఆయన తలకు వేసుకునే టోపీని కల్పించారు. అది సగం టోపీ, సగం తలపాగ అది అందంగా తలకు ఉండేది. శిరస్సుకు పెట్టుకునే దుస్తులను చాలా మంది జమీందారులు, ప్రొప్రైటర్లు, ధనికులు ఆమోదిస్తున్నారు.

☆

* *29-7-1895* *

ఆరోగ్యం మళ్ళీ చెడింది. మహారాజులుంగారు ఎంతో దయగలవారు.

వీరేశలింగంగారి కవుల జీవిత చరిత్రలు ఆయన రాసిన పీఠికలలో మొట్టమొదటి వాక్యం తెలుగు కవుల జీవితాలందరిని నిరసించింది. కవుల కాలం ఇది కీలకం. వారి వారి కాలాలు ఆయనకు సర్వమూ.

తుర్స్టటన్ నుండి ఉత్తరం వచ్చింది. మ్యూజియంలో (?) శాసనాలకు ప్రతులు తీయడం గురించి ఉత్తరం వచ్చింది.

☆

* *3-6-1895* *

డాక్టరు కీల్హారను దొరకు ఉత్తరం వ్రాశాను. సుబ్రహ్మణ్యం, విజయ రాఘవాచారి, శ్రీనివాసాచార్యుల గార్లకు గర్శిలూరు శాసనాల గురించి ఉత్తరాలు రాయాలి. సీతారామయ్య ఇత్యాది.

☆

* *4-6-1895* *

డాక్టరు భండార్కారుకు, డాక్టరు ఫ్లీటు దొరకు ఉత్తరాలు రాశాను.

☆

* *5-6-1895* *

'వెస్టు అండ్ కో'కు వెళ్ళాను. మిస్టరు బిషప్ అన్నారు. కూర్చిన అచ్చు అక్షరాలు మేము విడదీసి, తరువాత వాటిని మీకు పంపుతాము. మాకు చెందినవి మేము పెట్టుకుంటాము.

1. దయ చేసి వాటిని విడగొట్టవద్దు. అచ్చు అక్షరాలన్నిటికి సంబంధించినంత డబ్బు మా దగ్గర పుచ్చుకోండి.

చట్రాలు, ఇతర వస్తువులు మావి. ఇప్పుడు వాటన్నిటిని ఇచ్చి వేయవచ్చునా.

2. మహారాజులుంగారికి అన్ని చిత్రాలు కంపెనీ వారి అచ్చు+అక్షరాలు సర్వమూ అమ్మగలిగితే మీకు ఋణపడి ఉంటాను.
చూడండి. మొదటి భాగంలో ఉన్న అచ్చాక్షరాలన్నీ మావి. మార్జిన్ నోట్సులో ఉపయోగించనవన్నీ మావి.
3. అవును. మీరు మా కోరిక నెరవేర్చుతారనుకుంటాను. తాజా వస్తువులు వారు కొనగలరు. ఏదో ఒక రోజున తమకు కావల్సినప్పుడు.
చూద్దాం. అన్నిటికీ మేము డబ్బు పుచ్చుకోవల్సి వస్తుంది.
4. అవును, మీరు అలా చేయవచ్చును.
కానీ, అన్ని చిత్రాలు, టైపులు, అచ్చాక్షరాలు మహారాజా ఏం చేసుకుంటారో నేను చెప్పలేను. స్టీరియో టైపింగ్ కోసం మహారాజా వారికి అవి కావాలన్నారు. అది చేశాక అది మీ కార్యాలయంలో జరుగుతుంది. బహుశా ఆ పుస్తకాన్ని వారు అక్కడక్కడ అచ్చు వేస్తారేమో. "కాకపోవచ్చు. అక్కడ మంచి పనివారు ఉన్నారు. ఆ పుస్తకం ముఖ్యమైనది కాబట్టి వారు దానిని స్టీరియోటైపులో చేయవలసి ఉంటుంది. మహారాజులుంగారు ఇక్కడ కంటే విజయనగరంలో చేయవచ్చును. లేనట్టయితే మీకు కొంత ఇబ్బంది కలిగిస్తుంది. ఇక్కడ స్థలం ఆక్రమించుకుంటుంది."

"సరేనండి పసుపుపచ్చగుడ్డ మాటేమిటి మీకు అది దొరుకుతుందా. మీరు దాన్ని సంపాదించినట్టయితే మీకు ధన్యవాదాలు."

"అది ఎక్కడ దొరుకుతుందో నాకు తెలియదు. నాకు అది దొరకదేమో."

"అయితే మన దేశీయ కంపెనీల దగ్గర ఉందేమో ప్రయత్నిస్తాను."

"వారి దగ్గర లేదు. మేం ఎప్పుడూ వార్ని అడగం. కాని, పసుపు పచ్చ రంగు మీద గిల్టు అందంగా కనిపించదు."

మళ్ళీ కొటేషన్లు చెప్పకూడదు. చెప్పతరం కాదు.

అబ్బయ్య శాస్త్రి బాబుగారి గురించి డాక్టరుగారిని అడగాలి. చెంగయ్యకు, నరసింగరావు పంతులుగారికి ఉత్తరాలు రాయాలి.

డాక్టరు హూల్ట్జ్ దొర గారు రాసిన ఉత్తరం నకలు.

☆

* 5-6-1895 *

*ప్రియమైన అప్పారావుగారు!*

3వ తేదీన మీ ఉత్తరం అందింది. వచ్చే ఏడాది ప్రారంభం నుండి మీ పై విలాసం దయ చేసి నాకు తెలుపండి. మూడు శాసనాలు (రెండు ఉదయగిరివి, ఒకటి పాలకొల్లుది) నేను చూసి ప్రచురణ కోసం మీకు పంపుతాను. బెంగుళూరు నుండి తిరిగి వచ్చాక. మీరు ప్రస్తావించిన కృష్ణరాయలు కాలపు శాసనాలు రెండింటిని ప్రొఫెసరు కీల్హార ప్రచురించుడానికి ఇష్టపడటం లేదు. శాసనాల గురించి ప్రస్తావించిన ప్రభువుల గురించి పంపండి. నేను సంతోష పూర్వకంగా ఆయనకు పంపుతాను. శాసనాల్ని ఆయన ప్రచురించవచ్చును. లేదా నాకు తిరిగి

పంపించవచ్చును. అది జరిగితే మీరు వాటిని సంస్కరించవచ్చును. మీరు సూచించినట్టుగా, నాసిక్ కాగితాన్ని అమ్మి పెట్టగలననుకోను. స్థానికుడు ఎవరి ద్వారానైనా సంపాదించడం నాకు కష్టమేమికాదు.

భవదీయుడు
(సం) హాల్ట్సుదార.

☆

* 7-6-1895 *

రామస్వామి చెట్టిగార్ని ముతక కాగితం గురించి అడగండి. వి.వి. కృష్ణమచెట్టిగార్ని కూడ. ఒలియోగ్రాఫ్‌ను చట్రం కట్టించాలి. ఒక వ్యాకరణం కొనాలి.

అంగడి... కొరకు ఫైల్‌లో చూడాలి.

నాలుగు వాగరికతలు

| | | |
|---|---|---|
| వేదాంతసారం | – | 2–0–0 |
| జానపద గీతాలు | – | 2–0–0 |
| భారతప్రభుత్వం గురించి | – | 0–12–0 |
| భారతదేశం | – | 1–0–0 |
| భారతదేశానికి వర్తించే వలసపాలనా విధానం | – | 4–0–0 |
| ప్రాచ్య భారతదేశ చరిత్ర | – | 1–0–0 |
| ఒరిస్సా జగన్నాథ దేవాలయం | – | 0–12–0 |
| గ్రీకు | – | 3–0–0 |

* 10-6-1895 *

బజారులో కొనవలసిన వస్తువులు పసుబియ్యం, పట్కి పంచదార, పాత బియ్యం, నెయ్యి, పట్టిపేప బెతంపెట్టి, నాల్గు (?), అగ్గి పెట్టెలు, స్టౌవ్ మీది సన్నపాటి గిన్నెలు రెండు, బుడ్లి–లాంతరు.

☆

* 17-6-1895 *

కృష్ణానదికి ధరణికోట దక్షిణాన ఉంది. అక్కడ భీముని పరిపాలన ఉండేది. ఆ దేశంలో ఆరువేల గ్రామాలుండేవి. షట్‌సహస్రావనీ వల్లభాః (ఇది) వేంగీలో పదివేల గ్రామాలు.

విషయం.

వేశ్య తల్లి చనిపోయింది. నాయనమ్మ జీవించి వుంది. తండ్రి చనిపోయాడు. డబ్బుంటే ఖాతరు లేని తల్లి దగ్గర నుండి తండ్రి తిరిగివస్తాడు. ఒక బ్రాహ్మణ వ్యభిచారి అతన్ని భార్య వదలి పెట్టేస్తుంది. ఆవిడ మేనమావ ఉపాధ్యాయుడు. తండ్రిలేదు పెళ్ళి కాలేదు. బి.ఎల్. చదువుతూ వదలి పెడతాడు.

జ్ఞాపిక, ఒక పడక కుర్చీ కొనాలి.

** 18-6-1895 **

మద్రాసు నుండి బయలు దేరాను.

| | | |
|---|---|---|
| రగ్గు | – | 1–12–0 |
| టిక్కెట్టు | – | 16–6–0 |
| సి. హెచ్ | – | 8–11–0 |
| బైండింగ్ కోసం ఫోర్‌మన్‌కు | – | 2–4–4 |

గుఱ్ఱం మీద స్వారీ చేసే రక్షక భటునికి 2రూ. ఇవ్వమని బట్లర్‌కు చెప్పాను.

☆

** 19-6-1895 **

ఆకాశం మబ్బులతో ఉంది. కులాసాగా ఉంది. అప్పుడప్పుడు మరీ విసురుగాను, చలిగానూ ఉంది.

☆

** 20-6-1895 **

పని చేయడానికి అనుకూలంగా ఉంది. ఫోటోలు తీయడం కష్టం. మంగళగిరి దేవాలయ గోపురం చూశాను. విజయనగరం రీతిలో ఉంది. దక్షిణాదిన దేవాలయాల్లో చాలవాటికన్నా ఇది పరిశుభ్రంగా ఉంది.

☆

** 21-6-1895 **

శ్రీమాన్ కిళాంబి శేషాచార్యులుగారు మా ప్రిన్సిపాల్‌గారి కజిన్.
వరుసకు సోదరుడు చేసిన దానం

1. దొంగనావి కథ
2. ముసల్మాను, వైశ్యుడు
3. ఉలవలు
4. రెట్టింపు...

## 1896

** 1-1-1896 **

విజయనగరం పూర్వ చరిత్ర సిద్ధ పరచాలి.

☆

** 27-1-1896 **

హెచ్.ఎస్. నుండి పైకం రావాలి. రాయడ్ శాస్త్రిగారి నుండి కవులుకు పుచ్చుకొనడం జరిగింది.

☆

* 31-1-1896 *

ఇంకొకరి భూమిని బాగు చేయడంలో నష్టపోవడం పెద్ద విషయమేమీకాదు. ఇటువంటి భూములు మా సొంత భూముల విషయంలాగే ఆసక్తి తీసుకోవడం ఉచితమైన పని అవుతుంది. ఇది ఋణపడి ఉండటం అవుతుంది. అది జరక్కపోయినా నిజమైన విధి నిర్వహణగా చెప్పాలి.

☆

* 3-2-1896 *

డైరెక్టరాఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ మద్రాసు నుండి వచ్చాడు. ప్రిన్సిపాల్‌గారు ఆయనకు రైలుస్టేషన్‌లో స్వాగతం చెప్పారు. జాయింట్ మేనేజరుగారు డాబాతోటలోకి ఆయన్ని తీసుకొని వచ్చారు. ఆయనను ఫూల్‌బాగ్‌కు వాహనంలో తీసుకువెళ్ళారు.

☆

* 4-2-1896 *

కాలేజీలో చేసిన ఉపన్యాసంలో అక్కడకు రావటం తనకు ఎంతో సంతోషంగా ఉందని డైరెక్టరుగారు చెప్పారు. తత్త్వశాస్త్రం మార్గమని అది ఎవరైనా అనుకున్నట్టయితే, నూతన విషయాల గురించి తెలుసుకుంటూ ఉండడం లేదని అనుకోవాలి. తిరిగి వచ్చేటప్పుడు నేను మళ్ళీ ఈ ప్రసంగాన్ని కొనసాగిస్తాను. నా విద్యార్థులు విద్యార్థి వసతి గృహాలు మహారాజులుంగారి పట్ల గౌరవాదరాలతో మాట్లాడుతుంటే నాకు ఆశ్చర్యమేమీ కలుగలేదు. మహారాజులుంగార్ని ఎరిగిన వారు ఎవరైనా సరే ఆయనను ప్రేమించకుండా వుండడం సాధ్యం కాదు. ఆయనలో ఏదైనా తప్పిదం ఉన్నట్టయితే అది ఆయనకున్న అతిమంచితనం, ఔదార్యం. కాని, ఈ విద్యార్థులు ఎక్కువ బుద్ధిమంతులయినట్టయితే నైతికంగా కూడ వికాసం చెందినట్టయితే, మంచి పౌరులయినట్టయితే ఈ తప్పిదం ఒక సద్గుణం అయివుండాలి. అది తప్పిదం అయినట్టయితే ఆ తప్పిదం ఒప్పుకోవాలి.

☆

* 8-2-1896 *

సొందర కంపెనీ లిమిటెడ్, బొంబాయి ఆటోహార్ప్ ఐదు నుంచి ఏభై రూపాయలు ఒక్కొక్కటి.

* 14-2-1896 *

వెన్లక్ మెమోరియల్ స్మారక చిహ్నం గురించి జాయింట్ మేనేజరుతో మాట్లాడాను. నేను ఎవరికి వ్రాయాలనుకుంటే ఉత్తరాలు వ్రాయటానికి అనుమతించారు.

☆

* *28-2-1896* *

బాలరామరావుకు రెండు రూపాయలిచ్చి సలహాలు మొదలైనవి తీసుకురావడానికి శ్రీకాకుళం పంపించాను.

☆

* *29-2-1896* *

బలిజేపల్లి సూర్యనారాయణ పంతులుగారు విశాఖపట్నంలో వెన్లక్ స్మారక చిహ్న సమావేశాన్ని బలపరిచేందుకు తీవ్ర ప్రయత్నం చేశారు. వెంకన్న పంతులుగారు ఈ విషయం గురించి నాతో ఎక్కువ అనుకూలంగా మాట్లాడారు. రామానుజచార్యులు గురించి మాట్లాడిన దాని కంటే అధికంగా మాట్లాడారు. అధ్యక్షత వహించమని ఆయన్ని అడిగాను. కాని, తనకు అభ్యంతరం లేదు కాని మిస్టర్ ముల్లర్‌గార్ని అధ్యక్షత వహించమని కోరతాను. కథలు చెప్పే ఒక బ్రాహ్మణునికి రూపాయిచ్చాను. $1\frac{1}{2}$రూ.లు కార్డులకు.

☆

* *1-3-1896* *

| | |
|---|---|
| ఒక స్వెట్టర్ | 2–2–0 |
| సోడాలకు | 2–0–0 |
| బిస్కట్లకు | 3–1–2 |
| బండి ఖర్చులు | 0–6–0 |

☆

* *2-3-1896* *

శ్రీకాకుళంలో స్మారక సమావేశం బాగా జయప్రదం అయింది. గుజరాతీపేటలో ఒక చిక్కు వచ్చింది. అరసవెల్లి పిక్నిక్ వెళ్ళాం. చివరి క్షణంలో ఒక యిబ్బంది వచ్చింది. అక్కడ పెద్ద వకీలు బాపిరాజు మాపట్ల శత్రుభావంతో ఉన్నారు. ఆయనతో నేను చర్చ చేసి తీర్మానం ప్రతిపాదించమని కోరాను. దీర్ఘోపన్యాసం చేశాక నా వద్దకు వచ్చి మీరు నన్ను మార్చి వేశారు అన్నారు.

☆

* *4-3-1896* *

సోంపేటకు బయలుదేరాను.

* *6-3-1896* *

సబ్–మేజిస్ట్రేటును, రిజిస్ట్రార్‌ను, తహశ్శీల్దారును చూసాను. వారిద్దరూ చాలా ఆదరభావంతో బలపర్చుతామని మాట ఇచ్చారు. జమాబందీ జరిపే ప్రయత్నంలో ఉన్నారు. ఛత్రపూర్ నుండి తిరిగి వచ్చేటప్పుడు రమ్మన్నారు.

☆

** 12,13-3-1896 **

యజమాని అకౌంట్ ఏమిటి?
ఆత్మవిశ్వాసం ఉన్నవాడు.
మరామత్తులు లేవు.

☆

** 14-3-1896 **

సామర్లకోట వద్ద హీటింగ్.
వంటమనిషి కూరలకు $\frac{3}{4}$.
కొబ్బరికాయలు 50.

☆

** 15-3-1896 **

చిన్న కొబ్బరితోట ఉందక్కడ.
ఒడ్డున $13\frac{1}{2}$ గజాలు అడుగున కొలత.
178 ఎకరాలు.

☆

** 16-3-1896 **

అసర్ల చెరువు 20 మైలు
దోణంకి మల్లానాయుడు (?)
1000 నారకట్టు
1000 మరామత్తులు.

☆

** 17-3-1896 **

ఏదో రేఖా చిత్రం వుంది.

** 18-3-1896 **

పొర్లు ప్రభుత్వం
నగ్గు గంతరాని మెట్టు
నాలుగు గరిశల(?)

** 21-3-1896 **

యలమంచిలికి బయలుదేరాను. పెద్ద చెరువు కట్టనుండి. అక్కడ ఒక అల్లుడు ఉన్నాడు. వ్యవహారాలు చెప్పాడు. వియ్యన్న పంతులు, చలపతిరావు పంతులుగార్కి 43 వేలు ఇస్తానన్నాడు. 75 వేలు పైకం ఇస్తానన్నాడు. 'బోసందు' అనే పదం ఈ ప్రాంతంలో వాడుకలో ఉంది. బోసందు అంటే భూసంధి అయివుంటుంది.

☆

* 22-3-1896 *

కాపగొాద వలసను కొన్నాడు. కాపగోధముడు వేమూరి వెంకటేశ్వర్లు ఆదాయం 600. దానికి వెయ్యి వస్తుందని వారన్నారు. కాని, 24 వేలకు కొన్నారు. గరిసె ఆదాయం 40 రూపాయలని ప్రభుత్వం ఆజ్ఞ వేసింది.

☆

* 16-5-1896 *

గతరాత్రికల. చిన్న మహారాణి మరణం. మహారాజులుం గారికి ఏదో ప్రమాదం వచ్చినట్లు గతరాత్రి కల. నేను విలపిస్తున్నాను. ఆ కలలో మహారాజావార్ని చూసాను. ఉదయం నా మనసు ఏమీ బాగోలేదు. ఉదయం పదకొండు గంటలకు సూరీడు విషాద వార్త పట్టుకొని పరుగు పరుగున వచ్చాడు. అది చిన్న మహారాణిగారి మరణవార్త. మొదట అది నేను నమ్మలేదు. ప్రతాప్‌సింగ్‌గారి ఇంటి నుండి ఏడుపు వస్తూ వుంది. ఆయనను ఓదార్చడానికి వెళ్ళాను. ధైర్యంగా ఉండమని సలహా ఇచ్చాను. మళ్ళీ సాయంత్రం వెళ్ళాను.

* 17-5-1896 *

కుమార్ సాహెబ్‌గారు మద్రాసు వెళ్ళారా! ప్రతాప్‌సింగ్‌గారి ఇంటికి ఉదయం వెళ్ళాను. మళ్ళీ భోజనం అయ్యాక వెళ్ళాను. కొన్ని అల్పాహార పదార్థాలు వారి ఉపయోగానికి తోవలో పోతూ పోతూ తీసుకువెళ్ళాను.

* 27-5-1896 *

సగ్గుబియ్యం, పంచదార, బేడలు, కంబారు తాళ్ళు, తంబాకు గొట్టు, తుళ ఇంగువ, ఉల్లిపాయలు.

☆

* 31-5-1896 *

వంశవృక్షం. భూమిని బాగు చేయడానికి ఖర్చయిన డబ్బు కుమార్తెలది.

☆

* 5-6-1896 *

సంస్థానం హుజూరు ఆఫీసులో పని చేయడం ప్రారంభించాను.

☆

* 8-4-1896 *

బాలయ్యగార్ని పంపాలి.

☆

* 13-4-1896 *

పి.వి.ఆర్ సన్స్‌వారి హార్మోనియం.

☆

* 26-4-1896 *

ఉదయం రైలులో బరంపురానికి బయలుదేరాను.
కామేశ్వరరావుకి 5 రూ.
శాస్త్రికి 5 రూ.
బంట్రోతుకు 1 రూ.
బండివానికి $1\frac{1}{2}$రూ.

☆

* 1-5-1896 *

రోడ్డు మీద బంగారంతో చేసిన నగ పడి ఉంది. చెరువు దక్షిణ గట్టు మీద ఆకుపచ్చని వెదురు పొదలు. చింతలు కొన్ని, మొదళ్ళవలె కొన్ని. ఆ నీటిపైన అవి అంటీ అంటకుండా ఉన్నాయి.

☆

* 2-5-1896 *

క్రోంపేటలో పెద్ద జమిందారును చూశాను.

☆

* 3-5-1896 *

క్రోంపేటలో బస. జలంతర మేప్ సంపాదించాలి. విజయనగరానికి క్రోంపేట నుండి బయలుదేరాను. రాముడికి $2\frac{1}{2}$ రూ.లు.
రంగస్వామినాయుడికి 1 రూ.

☆

* 12-5-1896 *

శుభం
చి॥ నాన్నమ్మ వివాహం
చి॥ బాబు ఉపనయనం.

☆

* 15-6-1896 *

రిఫ్రెష్‌మెంట్ రూం, కూపర్ బిల్లు

☆

* 24-6-1896 *

రీవా మహారాణిగారు కొందరు రైతులను తగాదా పరిష్కారం కోసం మేనేజరుగారి వద్దకు పంపించారు. మేనేజరు వద్దకు వెళ్ళినపుడు చాలసేపు వేచి ఉంచారు.

తరువాత డబ్ల్యు నన్ను రమ్మనమని చెప్పారు. నేను వెళ్ళి తిరిగి ఇది ఏమిటని అడిగాను. ఈ రైతుల్ని మేనేజరుగారి వద్దకు తీసుకువెళ్ళమని చెప్పారు. ఈ విషయం గురించి నాకేమి తెలియదు.

డబ్ల్యు:– ఎందుకు మీరు నన్ను చూడాలనుకున్నారు.

నేను:– మిమ్మల్ని నేను చూడాలని అనుకోలేదు.

డబ్ల్యు:– ఈ విషయంలో చర్య తీసుకోవలసింది నేను. మేనేజరు కాదు. మీరెందుకు ఆయన దగ్గరకు వెళ్ళారు. ఇటువంటి పన్లు నేను సమ్మతించను.

నేను:– (వారికిది ఇష్టం) అయ్యా ఈ విషయం గురించి నాకేమీ తెలియదు. రీవా మహారాణిగారు ఈ రైతుల్ని మేనేజరుగారి వద్దకు తీసుకు వెళ్ళమన్నారు. నేను చేసింది అదే.

డబ్ల్యు:– నాకు తెలుసు దీనికంతటికి కారణం మీరే.

నేను:– అయ్యా మీకు హామి ఇస్తున్నాను. . దేవుని ప్రమాణంగా నాకేమీ తెలియదు. మీరు ఇటువంటి అభిప్రాయానికి వచ్చినందుకు నేను చాలా విచారిస్తున్నాను.

డబ్ల్యు:– మీరు వెళ్ళవచ్చును.

** 7-7-1896 **

జమాఖర్చుల పుస్తకం తనిఖీ చేశాను. అది కోటపల్లి చలపతిరావు పంతులుగారి వద్ద ఉంది. పద్దులు బాగా మార్చబడ్డాయి. పద్దులు ఒకదానికొకటి దగ్గరగా ఉన్నాయి. చికాకు పుట్టిస్తాయి. ఇది సరిచూడడం అన్నది కష్టమైన పని. రిజిస్ట్రార్ ఆఫీసుకి ఆంగ్ల ప్రభుత్వ అధీనంలో ఉన్న పిఠాపురం జమిందారీ పద్దులు గురించి రిజిస్ట్రేషన్ ఆఫీసుకు రాశాను. దీనిలో 'శీర్షికలు మరీ ఎక్కువ.

☆

** 10th to 15-7-1896 **

పతకాలు.

☆

** 20-7-1896 **

7.15 నిమిషాలకు 'తిలారి'కి బయలుదేరాను. స్టేషన్ ఊరికి దూరం.

పిల్లలు అంత మందీ సవారీ చూసి ఆశ్చర్యపోయారు. ఒకడు భయం వేసి పారిపోయాడు. ఒక ముసలమ్మ వెనుకబడింది.

☆

** 21-7-1896 **

1.10 ని.లకు జరజంగికి బయలుదేరాం.

☆

* 22-7-1896 *

గంగారాం గ్రామము తాలూకు రాజు ధాన్యం అచ్చారు. మారలచోళ్ళు, కుంచెడు చోళ్ళు వగైరా తొలకరి. ఎంత బాగుండేది...నీటిసాగు ఉపయోగకరమైన భోగట్టా.

☆

* 23-7-1896 *

వనవిష్ణుపురం వెళ్ళాను. భూమి సారవంతమైనది. ఎక్కువగా ఉంది. గ్రామంలోని నీటిసాగు క్రింద ఉన్న పెద్ద భూముల్లో ఎప్పుడూ నీరు ఉంటుంది. కొన్ని ఏళ్ళు తక్కువగా ఉంటుంది. మేము ఇక్కడ నుండి జరజంగికి వెళ్ళాం.

☆

* 24-7-1896 *

ప్రభుత్వ శిస్తు, ఇనాం శిస్తు భూములకు మధ్య మూడో వంతు తేడా వుంది. దీని మీద జరజంగిలో 35 వేలు ఇస్తామన్నారు.

☆

* 11-9-1896 *

మిస్టర్ గిల్ మెన్‌ని చూసి కె.వి గురించి, ఇతర వివరాల గురించి మాట్లాడాను. హంపీ శిధిలాలకు ఆయన చేసినది ఎక్కువే. చాల చక్కని ఫోటోగ్రాఫులు చూశాను. ఫోటోగ్రాఫ్ కెమెరా తనకు ఎరువు కావాలన్నారు. సంస్థానం పక్షాన ప్రోనోట్ రాశాను. సొమ్ము పుచ్చుకున్నాను.

☆

* 7-11-1896 *

గార్డ్సు 10, సికింద్రాబాద్ 5.30 గంటలు.
గవర్నమెంట్ ప్లీడరు విల్సబడ్‌తో వచ్చారు.

☆

* 18-11-1896 *

నోరి వైద్యనాధ శాస్త్రి.
గయపుత్రవార సీతారాం.

☆

* 3-12-1896 *

షేర్‌మార్కెట్‌లో ఈ వారంలో పెద్ద చర్యలేమి జరుగలేదు. దాని ఘటనలు ప్రభుత్వం పత్రికల వైపు మళ్ళాయి. సరిహద్దులో ఇబ్బందుల వల్ల. ప్రియమైన పైకం ఇక్కడా లండన్‌లోను అవసరం. ముందు ముందుకు చలనాలు జరుగవచ్చును.

షేర్ల బజారులో వ్యవహరించేవారు గత ఏడాది వారికి ఉండిన ఆశలను మనసులో పెట్టుకొని ఇప్పుడు ఎక్కువ లాభాలు ఆశిస్తున్నారు.

☆

# 1897

** 1-1-1897 **

విందు, ఫ్యాన్సీడ్రస్, మహారాజులుంగారు చేసిన ఉపన్యాసం అద్భుతంగా ఉందని అందరూ మెచ్చుకున్నారు. మిస్టర్ హోం. ప్రశంసలతో ప్రత్యుత్తరం ఇచ్చారు.

☆

** 2-1-1897 **

మహారాజులుంగారు కంటోన్‌మెంటల్ నాటక ప్రదర్శనకు నన్ను తీసుకువెళ్ళారు. వాల్‌కార్ మహారాజులుంగారి రాక.

మహారాజులుంగారు నన్ను తన వాహనంలోనే తీసుకువెళ్ళారు. నేను కొత్త నల్లకోటు తొడుక్కున్నాను. అది మహారాజులుంగారు నాకు ఇచ్చినది. కుట్టుపని బాగుంది.

మిస్టర్ రాసన్, మన సివిల్ జడ్జీ తాగుబోతు, దుండగులు, వదరుబోతు వేషం. నాయిక పాత్రధారి తండ్రి వేషం అద్భుతంగా ఉంది. దేవతా వేషం, ఆమె భావాలు, హృదయం దేవతల తీరువి.

☆

** 3-1-1897 **

మేనేజరు సాహెబ్‌గారు చేయించిన సంగీత కచేరి, పింఛను పుచ్చుకుంటున్న జిల్లా మునసబు, జాయింట్ మేనేజరుగారి గౌరవార్థం. ప్రభుత్వం దివాను బిరుదు ఇవ్వబడిన సందర్భం.

జాయింట్ మేనేజరుగారికి నా నాటక ప్రతి ఒకటిచ్చాను. అల్పమైన పారితోషికం. ఇచ్చినందుకు క్షమాపణ చెప్పాను. అలా అనకండి మీ హృదయాన్నే ఇచ్చారు. అదే గొప్ప పారితోషికం అన్నారు.

☆

** 5-1-1897 **

విజయనగరంలో ఒక పావు శతాబ్దం.

'ఆయన వ్యక్త పరచిన దానిలో ఘనత స్వల్పం'

** 6-1-1897 **

| | | |
|---|---|---|
| జూలై | – | మూడవ తరగతి |
| | – | నాలుగవతరగతి |
| 75 | – | ఎగువ నాలుగు |

76 – ఐదవ తరగతి
77 – జనవరి ఆరవ తరగతి
1878 – ఏడవ తరగతి
79 – ఎనిమిదవ తరగతి

☆

*19-1-1897*

ఇంటి గురించి

☆

*21-1-1897*

మహారాజులుంగారు మిస్టర్ విల్లక్‌ని కలుసుకోటానికి తిలారికి వెళ్ళారు.

☆

*22-1-1897*

యు.బాపిరాజు పంతులు దగ్గరకు వెళ్ళాను. అక్కివరస దావా తీర్పు ప్రతులు

1. మిస్టర్ టర్నల్ రాక
2. 'భారతదేశం మనకు నేర్పేదేమిటి' మ్యాక్స్‌ముల్లర్ గ్రంథం.
3. చిరంజీవితో సాయంత్రం కార్యక్రమం.
4. బలరామస్వామి అకౌంట్స్

☆

*23-1-1897*

దీనబంధు ఒక మద్రాసు పత్రిక 77. అన్నాపిళ్లై వీధి. మీనాక్షి విలాసం, ముద్రాక్షర శాల.

☆ ☆ ☆

*27-1-1897*

1. రాజామణి చెట్టియార్ మహత్తర వ్యక్తి. రేపు ఉదయం రైలులో వస్తున్నారు.
2. మాధవరావు వ్యవహారం.
3. ప్రొప్రైటర్‌గారి ఉపాధ్యాయుడు.
4. పబ్లిక్ కచేరి పద్దుల కాగితాలు.
5. మిస్టర్ స్టీవెన్స్‌కు కబురు చేయాలి.
6. చెరుకుపల్లి జగన్నాథానికి ఉత్తరం రాయాలి.
7. శివరావు పంతులు గారికి కూడ.
8. కాలేజీకి, హిందూ స్కూల్‌కి, ఆఫీసులకు నోటీసులు.

☆

** 28-1-1897 **

బొబ్బిలి గురించి. జాయింట్ మేనేజరుగారితో మాట్లాడాను. డా. బెన్నెట్.

1. రామస్వామి విషయం ధృవపడింది. కాకినాడ వారు,
2. బొబ్బిలి గురించి దివాన్ బహదూర్ గారితో మాట్లాడాను.

టెక్కలి తాలూకా 2వ తరగతి మేజిస్ట్రేట్ కచేరి. కేలండర్ సి.ఆర్.ఎన్.డి. 406/1888 పైని చెప్పిన తన గుమాస్తా ద్వారా కోర్టుకు పంపాలి.

☆

** 29-1-1897 **

హోల్కార్ మహారాజులుంగారు.

పీతల అప్పయ్య. ఆయన గురించి మున్సిపాల్ కార్యదర్శిగారితో మాట్లాడారు.

డా. బెన్నెట్‌ను చూశాను.

శ్రీమతి స్టాక్ వద్ద నుండి టీ పొట్లం ఒకటి తీసుకున్నాను. సన్యాసిని జరజంగికి పంపాను.

☆

** 30-1-1897 **

మద్రాసులోని రివ్యూ అన్న వార పత్రికకు కన్యాశుల్కం పంపాను.

☆

** 1-2-1897 **

గంగాధర బాలకృష్ణ గాడ్రే పాఠశాల యజమాని శారదసదన్.

** 2-2-1897 **

విట్‌నెస్:

1. లక్ష్మీకాంత పట్నాయక్, – కోటబొమ్మాళి
2. నంబూరివాసినాయుడు – యలమంచిలి
3. తల్లి అప్పలనాయుడు – యలమంచిలి
4. కవిటి చినజోగులు – యలమంచిలి
5. కవిటి అప్పలనాయుడు – గుంజలోవ
6. ఎన్నిచేదని నాయుడు – అంపహనుమ మండపర్రు
7. ఉద్దండరామ – నారప్ప పాలవంగాం

☆

** 3-2-1897 **

మరమత్తు లెక్కలు.

☆

# 1898

** 10-1-1898 **

కె.సి. నరసింగ పంతులుగార్కి 35 రూపాయలు. ఆయన దగ్గర నుండి కొన్ని గుఱ్ఱం ఖరీదు.

☆

** 11-1-1898 **

విశాఖపట్నం జిల్లా సమాచార గ్రంథం ప్రతిని మిస్టర్ విల్లర్ దొరకు ఉపయోగపడుతుందని ఇచ్చాను. శ్రీ బి. సూర్యనారాయణ పంతులు తిరిగి ఇచ్చారు (?)

☆

** 14-1-1898 **

మిస్టర్ విల్లాకు టెలిగ్రామ్ ప్రతిని బాలయ్య నాయుడుగారికి ఇచ్చాను.

☆

** 15-1-1898 **

దర్జీ విభాగం వెంకటస్వామి నుండి మైనర్ మహారాజా ఉపయోగానికి మూడు షర్టులు.

☆

** 16-1-1898 **

కోట పరిసరాలు పరిశుభ్రంగా ఉంచాలని ఆజ్ఞ వచ్చింది. మాలీ గురించి సంజీవరావు పంతులుగారికి పాకీ పనివాని కోసం కబురు పంపటం అయ్యింది. ఒక గరిసె ధాన్యం. గంధకం మందు తెమ్మని పాపయ్యకు పావలా.

కంద బ్రాహ్మణ దేవాలయ వీధి. వి. శాస్త్రి పైవిలాసం 32, శివరావు వీధి, ట్రిప్లికేన్.

☆

** 17-1-1898 **

ఎమ్. గారికి 8–0–0 ఇవ్వడం జరిగింది. ఏదో పని కోసం ఒక రోజున ఆ పైకం నాకు ఇవ్వబడింది.

☆

** 20-1-1898 **

పిట్టగూడ్ల విషయములు

☆

** 21-1-1898 **

ఇ.జి.సి.వి. శ్రీనివాసాచార్యులగారికి మైలాపూర్, మద్రాసుకు 32రూ. మనిఆర్డర్ పంపాను.

☆

** 22-1-1898 **

సూర్యగ్రహణం. ఇద్దరు బంగారపు పనివారు ఉంగరాలు గ్రహణం రోజుల్లో చేయడానికి నియమింపబడ్డారు. అవి బంగారం, వెండి, రాగితో చెయ్యాలి. గ్రహణకాలంలో ఎన్ని కావలిస్తే అన్ని తయారు చేయాలి. 12.20 ని, 12 సెకండ్లు, విశాఖపట్టణం, సాని గురించి మొదటి భోగట్టా. గ్రహణం 12 గంటలకు ముగుస్తుంది.

☆

** 26-1-1898 **

ఎస్. అండ్ కో మద్రాసు వారికి 21–7–0 లకు మనిఆర్డర్ పంపాను. నరసింగరావు పంతులు మావగారికి నా యోగ్యతా పత్రాల ప్రతిని పంపాను.

☆

** 1-2-1898 **

36 రూపాయలు ఒక హిందూస్థానీ మహిళకు ఆరు నెలలకొకసారి ఇవ్వబడుతూ వుంది. చెల్లింపు 18 రూపాయలు.

☆

** 17-2-1898 **

విశాఖపట్నం నుండి ఎగువకు వెళ్ళే ట్రైన్లు.

| రాక | పోక |
|---|---|
| 1–42 | 2–2 |
| 18 | 18–22 |
| లోకల్ | |
| 9–47 | 10–7 |

విజయనగరం నుండి దిగువకు

| | |
|---|---|
| 17–54 | 18–1 |
| 23–2 | 23–22 |
| లోకల్ | |
| 13–30 | 13–50 |

☆

* *18-2-1898* *

సీటిపన్ను సరఫరా అయ్యేంత వరకు వాయిదా వెయ్యాలి. వైజాగ్ హార్బరుకు అద్భుతమైన స్థలం. (కాని దక్షిణానికి తిరిగి ఉంది) గవర్నర్ విశాఖపట్టణానికి 7.15 ని.లకు సాయంత్రం చేరారు.

☆

* *19-2-1898* *

డా. బ్రౌనింగ్‌ను చూశాను. గవర్నరు హార్బరు కోసం అనుకున్న స్థలాన్ని పరీక్షించారు. నేను అక్కడ ఉన్నాను.

☆

* *20-2-1898* *

గవర్నరుగారు ఇక్కడకు వచ్చిన రైలులో విజయనగరానికి తిరిగివచ్చాను. కోటకు డా. బ్రౌనింగ్‌తోపాటు తిన్నగా వాహనంలో వెళ్ళాను. వారిని ఫూల్‌బాగ్‌కి తీసుకువెళ్ళాను.

1. ఫోటోగ్రాఫ్ నెగటివ్‌లు
2. భూమికి సంబంధించిన పత్రం.

☆

* *21-2-1898* *

రాజభవనంలో గవర్నరుగారు మధ్యాహ్నం మూడు గంటలకు తిరిగి బయలుదేరారు.

☆

* *24*th to *26-2-1898* *

అకౌంట్స్.

☆

* *27-2-1898* *

I. 1. తీగ 2. నున్న కడియం 3. కెంపులతో తాపిన పతకం గల మూడు పేటల పలకసర్లు. 4. పతకం లేకుండా మూడు పేటల పలకసర్లు.

II. 1. కంటె 2. వడ్డాణం 3. తీగ 4. తీగ 5. తీగ 6. కంకణాల జత 7. బాజుందుల జత. రూ. 775/-

☆

* *24-4-1898* *

బిదు భూషన్ దాస్.
అచ్చు వేయడానికి కాగితం
శ్రీనివాసాచారి.

☆

** 26-4-1898 **

బరంపురానికి వెళ్ళటానికి బయలు దేరాను.

☆

** 27-4-1898 **

మిస్టర్ టెయిలర్ దొర బరంపురానికి వస్తాడని డిప్యూటి కలెక్టరు ద్వారా తెలిసింది.

☆

** 28-4-1898 **

మిస్టర్ ఉల్ఫ్ ముర్రేను ఉదయం చూశాను.

☆

** 29-4-1898 **

మిస్టర్ టెయిలర్ దొరను చూశాను.

☆

** 30-4-1898 **

మిస్టరు ఉల్ఫ్ ముర్రేను చూశాను.

☆

** 1-5-1898 **

కంచిలిలో మకాం, సోనార్ గొచ్ఛా, పతకంతో పాటు అది బంగారం పూలగుత్తితో చేసినది. రోడ్డు మీద పడి ఉంది. చింతలు కొన్ని మొదళ్ళు కొన్ని, ఆకుపచ్చ, వెదురు పొదలు దక్షిణ గట్టున నీటి ఉపరితలాన్ని అవి అంటీ అంటకుండా ఉన్నాయి.

☆

** 3-5-1898 **

సోంపేటలో మకాం. జలంతర మేపు సంపాదించాలి. సోంపేట నుండి విజయనగరానికి బయలుదేరాను.

☆

** 4-7-1898 **

ఎన్.సి. 1200+200+58−13−0 చెల్లించి నగలు తిరిగి తీసుకున్నాను. అవి 1896 ఫిబ్రవరి నెలలో మేం తీసుకున్నాము.

☆

* *20-7-1898* *

మూడు తులముల తొమ్మిది అణాపరకకు ఒక గురువింద గింజ తక్కువ.

☆

* *27-7-1898* *

20 రూపాయలు తీసుకొని ఆ రోజునే అమ్మకు పందొమ్మిది రూపాయలు పంపాను. ఈ వేళ 5–6–0 పోస్టు జవానుకు ఇచ్చాను. ఇది అముద్రిత గ్రంథ చింతామణి చందా.

☆

* *29-7-1898* *

షరీఫ్‌కు 12,000 రూ. ఇచ్చాను.

☆

* *31-7-1898* *

ఒక ప్రోనోటు చేతితో రాసినది. రాసిన వారు మిస్టర్ విల్లక్. మహారాజు కుమారికకు ఇవ్వడానికి అక్షరాల ఇరవై అయిదు వేల రూపాయల ప్రోనోటు ఇది. మహారాజా కుమారికా వారు సంవత్సరానికి 6రూపాయల వడ్డీ చొప్పున ఇచ్చారు.

☆

* *3-8-1898* *

మహారాణి సాహెబువారు చెప్పిన ప్రకారం పాచిపెంటలో వున్న సకినేటి జగన్నాథ రాజుకు పంపటం జరిగింది.

☆

* *1-9-1898* *

మిస్టర్ గిల్‌మన్ దొరను చూశాను. సంకు అప్పన్నతో ఫోటోగ్రాఫర్ గురించి మాట్లాడాను.

☆

* *15-10-1898* *

పోలో టోర్నమెంట్

☆

* *24-10-1898* *

విజయదశమి, రాజావారికి నౌఖర్లు అనేక బహుమతులను ఇచ్చారు.

☆

*** 28-10-1898 ***

రామానుజాచారిగార్ని డవేజరు మహారాణి చూశారు.

☆

*** 4-11-1898 ***

కీర్తిశేషురాలైన డవేజరు మహారాణివారి వీలునామా.

☆

*** 5-11-1898 ***

ఉదయం 9.50 నిమిషాలకు బెనారస్ బయలు దేరాను.

☆

*** 7-11-1898 ***

వాడి

☆

*** 9-11-1898 ***

భూసవల్

☆

*** 13-11-1898 ***

బెనారస్‌లో బాబుమోహన్‌దాస్ మిత్రాను మహారాజులుంగారు చూశారు.

☆

*** 30-11-1898 ***

బెనారస్ రాజకుమారుడు కబురు పెట్టారు.

☆

*** 4-12-1898 ***

శ్రీ నారాయణ సింగ్ గార్ని చూశాను.

*** 17-12-1898 ***

బింగా కుమార రాజావారు చూడటానికి వచ్చారు. స్వామి భాస్కరానందాను మహారాజావారు దర్శించారు.

☆

*** 29-12-1898 ***

మిస్టర్ టర్నర్ గురించి బి.ఎస్. వ్రాసిన ఉత్తరం అందింది.

☆

# 1899

* *1-1-1899* *

$\frac{AA}{35}$ 06 901–100
కలకత్తా నెం.18.1896
06902 మరొక వంద.

* *4-1-1899* *

మిస్టర్ టర్నర్ ఓ.ఎన్.గారికి రాసిన ఉత్తరం

* *6-8-1899* *

బుక్కా అప్పుడు
పెన్ పేక్ భూములు.

* *10-8-1899* *

శ్రీకాకుళం తోట
ఆంధ్ర భూములు
చెళ్ళాయ్యమ్మ పచ్చిక భూములు

* *12-8-1899* *

ప్రతాప్‌సింగ్
గుఱ్ఱం
ఫోటోగ్రాఫర్
చందర్
రామశాస్త్రి పంతులు
కామశాస్త్రి, గాడిఖానే.

* *13-8-1899* *

పి.కి. గుఱ్ఱం.

* *16-8-1899* *

డి.ఎన్. బిన్‌ట్‌కు పుస్తకాలు.

* *19-8-1899* *

ఎల్. వ్రాయాలి. హంపి శాసనం – ఇవ్వడమైంది.

* *29-8-1899* *

మ్యూజియంలో ఎపిగ్రాఫికల్ ఇండియా

* *10-9-1899* *

విశాఖపట్నానికి, బిషప్‌గార్ని చూశాను.

* *23-9-1899* *

సన్‌వాణి పుస్తకం
మహారాజా జతీంద్ర మోహన్.

* *9-10-1899* *

అంకెలు స్వీకరించడానికి మహారాజులుంగారి అనుమతిని కోరాలి(?)
పోలిక్ ఎంట్రీ నుండి (?)

* *18-12-1899* *

మద్రాసులో చుక్క టి.హెచ్.ఎస్.గార్ని బిషప్‌గారు దర్శించారు.

# 1899

'ట్రేటి' పుస్తకాలు
1. పండిట్ రామమిత్రశాస్త్రి
2. ధారా గున్నయ్య
మహారాణి పరిశోధన మందిరం, అలహాబాద్.

# 1899

కీ. లైన మహారాజులం కోసం గయకు
1. అన్నమ్మ సువర్ణదానం 2. విశ్వనాథ శాస్త్రి 3. సుబ్రహ్మణ్యం పర్వము రావాలి. 4. సాంబయ్య 5. చిన్నరాజు.

# 1899

హకీమ్ పత్రాలు
అడ్డాకులు
కీర్తిశేషులు ఆనంద రాజుగారు.

# 1900

* *17-3-1900* *

మదరాసులో మేనేజరుగారికి ఆకాశరామన్న ఉత్తరం రాశారు. దశరా. 3-10-1900. ఈ దిగువ రాసిన వారిని మహారాణివారు భోజనానికి దాట్ల రామసుందర రాజుగార్ని ఆహ్వానించమని ఆజ్ఞాపించారు. మహారాజ కాకర్లపూడి రామచంద్రరాజు, పూసపాటి జోగురు రాజు, కాకర్లపూడి విజయరామ రాజుగారి కొడుకు గణపతి రాజు, పెనుమచ్చ సీతారామరాజు గార్లను భోజనానికి రమ్మనమని ఆహ్వానించడం జరిగింది. మధ్యాహ్నం 4 గంటలకు మహారాజా వారు నాజర్ మొదలైన వారికి నిలబడి దర్శన మిచ్చారు.

* *9-4-1900* *

తేదీ 9-4-1900 మద్రాసు ప్రభుత్వము వారి కార్యకలాపాలు. మహారాజశ్రీ

జి.వి. అప్పారావుగారు ప్రధాన  కార్యదర్శి వర్గం గ్రంథాలయంలో అంతరంగికంగా తాను పేర్కొనని రికార్డులను చూడడానికి అనుమతించాలి. ఈ  విషయం పైని జనరల్ రికార్డ్సు డిపార్టుమెంట్ వారి సూపరింటెండెంట్‌కు తెలియజేయాలని విజ్ఞాపన జరిగింది.

*12-10-1900*

ప్రత్యేకమైన ట్రైన్‌లో బెనారస్‌కు బయలుదేరాను.

*16-10-1900*

బెనారస్ చేరాను.

*17-10-1900*

నేపాల్ దేశపు జనరల్ అంబర్ జంగ్ గారు డా. ప్రేమ్‌చంద్ర బెనర్జీ కాషీ ప్రేమ్‌చంద్ర బెనర్జీ, పరమానంద జోషి  కలిశారు.

*19-10-1900*

మహారాజులుం గారు ఘాట్‌ను పరిశీలించారు. పండిత మదన్ మోహన్ మాలవ్య చూడడానికి వచ్చారు.

*21-10-1900*

మండపంలోని శాసనాలు.

*24th నుండి 29-10-1900*

కేంద్ర హిందూ కళాశాల వార్షికోత్సవాలు చూడడానికి వెళ్ళాను.

*27-10-1900*

మిస్టర్ ఫిలిప్స్, శ్రీమతి ఫిలిప్స్ వచ్చారు. మహామహోపాధ్యాయ స్వామి రామమిశ్ర శాస్త్రిని చూడవచ్చారు.

*14-11-1900*

శ్యామబాబు, రామ సర్దార్ వెళ్ళారు.

*16-11-1900*

మాతా మహారాణి.

*23-11-1900*

నల్ల గడియారం వెనుక (?)

*25-11-1900*

మహారాజులుంగారి శోభనం.

*29-11-1900*

కలకత్తా చేరాను. ఉదయం నుండి వరి పొలాలే కనిపించాయి. మేము నగరానికి చేరువ అవుతున్న కొద్దీ, మైళ్ళ  కొద్దీ తోటలు, ఈత చెట్లు కనిపిస్తున్నాయి. గత సాయంత్రం బీహార్‌లో చదునుగా ఉన్న ప్రదేశాల్ని దాటి వెళ్ళాం. నిండుగా సేద్యం జవారు, శనగ చేలు, చెరకు, పసుపు కన్పించాయి.

సీల్దా భవనం చక్కనిది, విశాలమైనది. కాని, పరిసరాలు కంగాళిగా ఉన్నాయి. ( రైల్వేస్టేషన్, ఫాక్టరీలు మొ॥నవి ) నిర్మాణం ఇంపైనది. కాని, వెలుపలి ఇళ్ళు విశాలమైనవి. చాలమంది వాటిలో నివసించవచ్చును. నివాస గృహాల  నిర్మాణం

కలకత్తాలో సంకరమైనవి తప్ప వేరేవి కావు. విదేశీయుత ఫెర్గ్యూసన్ చెప్పినట్టుగా రాతివాడకం అరుదు. మున్సిపల్ మార్కెట్ అతి చక్కని వాటిలో ఒకటి.

☆

*** 30-11-1900 ***

షాపుకు వెళ్ళి వస్తువులు కొన్నాను. న్యూమన్ పాత పుస్తకాల కేటలాగులో ప్రాచీన భారతదేశ భూగోళ చరిత్ర, ఒక నిఘంటువు, వాటి ప్రతి కొనాలి. పుస్తకాల షాపులో మల్లేసన్ 'ది ఫ్రెంచ్ యిన్ ఇండియా' అన్న పుస్తకాన్ని చూశాను.

చటర్జీ కుటుంబాన్ని చూశాను.

☆

*** 1-12-1900 ***

అంగడికి వెళ్ళి వస్తువులు కొన్నాను. హారిసను రోడ్డులో విద్యుత్ దీపాలు ఉన్నాయి. ఒక దానిని తప్పించి యింకొక వైపు పోస్టులకు దీపపు చిమ్నీలున్నాయి. వీధి వీధి అంతా ధగ ధగ మెరుస్తూ వేయి చంద్ర బింబములు ఉదయించినట్లున్నాయి. వెన్నెల దూరినట్లు ఉన్న వీధి.

*** 3-12-1900 ***

మ్యూజియం చూశాను. ముఖ్యంగా గృహ నిర్మాణ వాస్తు సముదాయాన్ని దాని బౌద్ధ శిల్పాలు పుష్కలంగా ఉన్నాయి. ఇవి అసాజై (?) లోనివి. వస్త్రధారణ విషయంలో గణనీయమైన చిహ్నాలు కన్పిస్తాయి. శరీర నిర్మాణము, జుట్టు, తీర్చిదిద్దినట్లు గ్రీకుల శిల్ప ప్రభావము పొడ గట్టుతున్నట్లు నాకు తోచినది. ముఖ విన్యాసములో సైతము గ్రీకుల ప్రభావము కద్దు.

ప్రాకారము అమరావతిలో వలె కాక డాబు దర్పములు లేకుండెను. అక్కడ కొన్ని స్థూపములున్నాయి. బుద్దుని విగ్రహాలు, బోధిసత్త్వులు, పదిల పరిచి ఉన్నాయి. వింతగా చెప్పవలసినదేమిటంటే శ్రీ కొవిల్లి వెంకటరామయ్య బహూకరించిన దక్కను శాసనం ఉంది. జైను విగ్రహాలు కూడ ఉన్నాయి. వాటిలో నాలుగు విగ్రహాలు నిలబడి ఉన్నాయి. బుద్ధ విగ్రహాలకు, బోధిసత్త్వుల విగ్రహాలకు నాకు తెలిసినంత వరకు తేడా ఏమిటంటే బోధిసత్త్వుల విగ్రహాలకు ఆభరణాలున్నాయి. బుద్ధ విగ్రహాలకు లేవు.

బెనారస్‌లో రాజభవనానికి చేరువలో పార్శ్వనాథుని దేవాలయాలున్నాయి. రోడ్డుకు ప్రక్కన వున్న గుడి ఇటీవలది. దీని నుండి పాత దేవాలయానికి తోవ వుంది. వివిధ విభాగాలలో చాల మంది స్త్రీ పురుష యాత్రికులు భోపాల్‌కు చెందిన వారున్నారు. మూడు దేవాలయాలున్నాయి. ఒక్కొక్క దానిలో పెద్ద పీఠములున్నాయి. వీటి మీద తీర్థంకరుల విగ్రహములున్నాయి. తెల్ల పాలరాతితోను, నల్లపాల రాతితోను చేసినవి. గుట్ట ఊయల (చాందిని) అష్టముఖాలున్న చౌకు మీద

స్త్రీ విగ్రహాలు చిత్రించి ఉన్నాయి. ఈ విగ్రహాలు గానము చేస్తూ, నృత్యము చేస్తూ ఉన్నాయి. పాత గుడికి చదునైన పైకప్పు ఉంది. గోపురం కాదు. అధునికమైనది. బెనారస్ దేవాలయాల్లా ఉన్నాయి. గతరాత్రి జాతీయ నాటకశాలకు వెళ్ళాను. ప్రేక్షకులతో క్రిక్కిరిసి ఉంది. ఇంచుమించు అర డజను మంది నిల్చోడానికి స్థలముంది. ధరించిన వస్త్రాలు సహజంగా ఉన్నాయి. దుస్తులలో ఆడంబరం లేదు. రంగాలంకరణ బాగుంది. అప్పుడప్పుడు ఇందుకు భిన్నంగా విదూషకత్వం, ఎక్కువగా ఉంది. ఇది విషాదాంతానికి ఎంత మాత్రం అనుగుణమైనది కాదు. ఈ సంగతి నాకు తరువాత తెలిసింది. బెంగాలీ నాటకానికి కూడా వెళ్ళాను. నాటకశాల చిన్నది. ఒకమ్మాయి ఛామన చాయ దుస్తులు వేసుకుంది. అమ్మాయికి, అబ్బాయికి మధ్య ప్రేమ ఘట్టం. మొద్దు మొహంతో ఉన్నాడు. అయితే పరాక్రమశాలి. ఆవిడ తియ్యగా పాటపాడింది. చూడటానికి సొంపుగా లేదు.

మిగతా రంగాలు హాస్యమే. ఒక నృత్య ఘట్టం తప్పితే సర్వం బాగుంది. కాని, చాలా మంది బాలికలు అందవికారంగా ఉన్నారు.

☆

** 4-12-1900 **

హై కోర్టు భవనాలు చూశాను. వాకిలి చిన్నది. తోట అందంగా ఉంది. తలుపులు బాగా ఎత్తు. చాల వెలుతుర్ని, గాలిని లోపలికి రానిస్తాయి. మద్రాసు హై కోర్టు భవనాల్లో ఇవేమి లేవు. తెలివి తక్కువ అలంకారాలు.

☆

** 5-12-1900 **

ఉదయం కలకత్తా నుండి బయలుదేరాను. హుగ్లీ దృశ్యం బహు చక్కగా ఉంది. ముఖ్యంగా సీతాపూర్ తోటలు. పొగఓడలు, పడవలు, మిల్లులు మొదలైన వాటి అవసరం లేదు.

☆

** 6-12-1900 **

విజయనగరానికి ఉదయం పూట చేరాను. దారిలో భువనేశ్వరాలయాన్ని చూశాను. నది ప్రవహిస్తున్న చోటల్లా దేవాలయాలు ఉన్నాయి. పల్లపు భూమి.

☆

** 7-12-1900 **

మద్రాసు చేరుకున్నాను. గవర్నరు గారి అంగరక్షకుడు, ఒక వాహనం మా కోసం కాసుకొని ఉన్నాయి. ఇతర జమిందారులు ఎవరూ లేరు. జయపూర్ 6 గంటలకు.

☆

** 10-12-1900 **

రీవా మహారాజు బయటకు వెళ్ళారు. హాస్లీరాజుగారు సాయంత్రం చూడటానికి వచ్చారు.

☆

** 11-12-1900 **

వైస్రాయిగారు వచ్చారు. రీవా మహారాజులుం గారు వంటకాలు పంపించారు. గిల్మన్ వచ్చారు.

☆

** 12-12-1900 **

మైనర్ మహారాజులుంగారు స్వాగత సమావేశానికి హాజరయ్యారు. రీవా మహారాజులుం గారు విందు ఆరగించారు. గవర్నరు గారికి 'విక్టోరియా ప్రశస్తి' ప్రతులు వైశ్రాయిగారికి, సతీమణికీ పంపారు. అడ్మిరాల్టీలో పిట్టలు కిలకిలమని పాడుతున్నవి. విరుచుకుపడుతున్న తరంగాలతో సముద్ర తీరం ధగధగ ప్రకాశిస్తుంది. తరంగాలు ముందుకు విరుచుకుపడి వొడ్డు నుంచి వెనకకు తగ్గుతున్నప్పుడు నలుపు వర్ణము కన్పిస్తుంది. ఎర్రరంగు క్రమక్రమంగా తగ్గిపోతుంది. గట్టు దిగువగాను నేలకు సమంగాను ఉంది. గట్టుకు అవతల ప్రక్క నీరు సమానంగా పరచి ఉంది. వాటికి దిగువ స్థలంలో మరికొంత దూరంలో సరుగుడు, కొబ్బరితోటలు కన్పిస్తున్నాయి. సముద్ర తీరాన్నుంచి ఒక ఒడ్డు మీదుగా వెళితే అక్కడ శ్మశానం. అడ్మిరాల్టీ నుండి మరొక రోడ్డు మీదుగా వెళితే సముద్ర తీరం తగులుతుంది.

వాకిలిలో ఇరు ప్రక్కల గోళాలలో చక్కని పూల మొక్కలు, ఆకులున్నాయి. వెదురు తీగలు, మధ్యలో నీరు వెదజల్లుతున్న గొట్టం, రెండు విదేశీ తాటిచెట్లు. ఇవన్నీ కొబ్బరి ఆకుల వంటి పోలికతో ఆకులున్నాయి. అందమైన ఆకులతో నున్న మొక్కలు నీటి గొట్టానికి చుట్టూరా ఉన్నాయి. వాకిలికి ఆనుకొని ఉన్న స్తంభాలు దానికి ఆధారంగా ఉన్నాయి. అవి చాలా పెద్దవి. అవి బాగా ఎత్తుగా గుండ్రంగా ఉన్నాయి. మొదళ్ళలో చతురస్రపు గొట్టాలు, స్తంభాలకు రంగులు వేశారు. రెండు గజాల వరకు ఆకుపచ్చని రంగులు ముదురు ఎర్రరంగు పువ్వులు. చలువరాతి మెట్లు ఎత్తుగా ఉండి డ్రాయింగ్ రూంకు వెళతాయి. ఆ గది ఆకుపచ్చ రంగుతో ఉంది. రకరకాల రంగుల పూతలు పక్కలలో పువ్వు మొక్కల బోర్డరు దానిపైని కాస్తంత లతలు, పూల మొక్కలు. పై కప్పు కూడ రంగు పూతతో ఉంది. డ్రాయింగ్ రూంలో ప్రవేశానికి మూడు ద్వార బంధాలున్నాయి. అవి ముదురు రంగు పూతతో ఉన్నాయి. వాటికి అందమైన తెరలు తూర్పు ప్రక్క నున్న ఒక గుమ్మం సముద్రానికి ఎదురుగా నున్నది. మరొక వైపున ఇంకొక గేటు. అవి తలుపులతో మూయబడి ఉన్నాయి. దిగువను చిన్న ప్రవేశమార్గం పైని పెద్ద అలంకారాలు. అది ఇంగ్లీషు వారి రాచరికపు గృహం, గిల్టు పూతతో ఉంది.

పొడవు, వెడల్పులు రెండు గజాలు, గజం గోడలకు అద్దాలు అమర్చి ఉన్నాయి. కిరీటం పైని ముదురు రంగులో సింహం బొమ్మ. అర్చీలున్న తోవ అందమైన నడవకర్రతో కట్టినది. పువ్వుల అంచులు.

దీనికి ఎదురుగా ఒక గేటు. ఇటు వంటిదే ద్వారబంధం. ఇంకా ఎక్కువ నగిషీలతో అలంకరించబడి ఉంది. మరీ అమితంగా ఉంది. విజయనగరం రాజముద్రిక అమర్చి ఉంది. ఇరు ప్రక్కల సింహాల బొమ్మలు.

పక్కనున్న కర్ర స్తంభాలకు రెండు కలశాలు అమర్చి ఉన్నాయి. త్రికోణాకారంలో పొడవాటి స్తంభాలు. అవి మెట్ల వరుస ఈ గేటు దగ్గర నుండి పై అంతస్థుకు ప్రారంభమై ఉన్నాయి. కుడివైపుగా మెట్లు పైకి పోతున్నాయి. దాని ముందర గోడకు రవివర్మ చిత్రించిన బొమ్మ ఎడమ ప్రక్కన ఊయలలో ఇంకొకటి.

మేజా మీద ఒక కంచు విగ్రహము. ఇంచుమించు నగ్నంగా ఉంది. ఎడమ చేత్తో ఒక డాలూ, కుడిచేత్తో ముందుకు విసురుతున్న బల్లెమూ పట్టుకొని భయంకరమైన భంగిమలో నిలబడి వుంది.

☆

* *15-12-1900* *

నమూనా క్షేత్రానికి వెళ్లాను. మొక్కల నుండి మొలకల్ని ఎప్పుడు తీసి వేస్తారు? అరటి మొక్కలకు బూడిద ఎరువు. చెరుకు పంట పాడవకుండా, చెదపట్టకుండా ఉండటానికి ఎముకల పొడి. తెలగపిండి తెల్ల ఆముదం. భూమిని స్వేచ్ఛగా సాగుచేయాలి. మట్టిలోకి సున్నం జల్లాలి. ఎకరానికి అరటన్ను పినాయిలు రెండు గేలనులు. చక్కని నీటి పారుదల.

వడ్లు మొదలైన మొక్కలు రక్షణకు కాలువల్లో మన్ను చేరకుండా నిరోధించడం ఎలాగ?

కాలువలు మేట వేయకుండా ఆపడం ఎలాగ?

☆

* *16-12-1900* *

శ్రీ భాష్యంఅయ్యంగారు పిలిచారు.

☆

* *17-12-1900* *

మైనర్ మహారాజులుం గారు వైస్రాయిగార్ని దర్శించారు.

☆

* *18-12-1900* *

**ఉదయం:**

గతరాత్రి కొద్దిగా చినుకులు పడ్డాయి. పొగమబ్బులు. అవి దక్షిణాదిగా

పోతున్నాయి. తూర్పు దిశ నుండి క్షితిజం వద్ద మబ్బులు అటు ఇటూ కదలాడి మిగిలిన ఆకాశమును అక్కడక్కడ లేత రంగుతో కప్పినట్లుగా ఉంది. చల్లని చిరుగాలి అప్పుడప్పుడు కొబ్బరి తోటల మీదుగా నీలాకాశం మీదుగా వీస్తూ వుంది. నెలవంక, ఒకే ఒక నక్షత్రం మూడు లేదా నాలుగు గజాల దిగువని. నిలువ నీరు. రాజ భవనానికి ఎదురుగా జాలరులు వలలు పట్టుకొని ఉన్నారు.

☆

* *20-12-1900* *

గవర్నరు సర్ ఆర్థర్ హేవ్‌లక్ చూడటానికి వచ్చారు. ఆ రాక కొంత వరకు సొంతానికి జరిగినది. ఈ సందర్భన సుమారు ముప్పావు గంట జరిగింది. చాల విచారంతో అన్న మాటలివి. ఆమె పట్ల గౌరవభావంతోను వెళ్ళిపోతున్నాను.(?)

**చేయువలసిన పనులు:**

పాతపుస్తకాలు పాఠ్యగ్రంథాల వేలం, నా తమ్ముని కోసం ఒక గడియారం, ఒక కలం. మా అమ్మ కోసం చంద్రహారపు గొలుసు, ఒక చక్కని జంబుఖానా, మూడు చక్రాల బండి.

లిటరరీ సొసైటీ గ్రంథాలయం నుంచి ప్రాచీన భారతదేశ చరిత్ర తీసుకోవాలి. ఎపిగ్రాఫికా ఇండికా. కృష్ణాజిల్లాలోని బౌద్ధ శిల్పములను, శాసనములను తెలిపే భోగట్టా. వింటర్ బాటమ్ (?) భార్యా భర్తలు మహారాణి వార్ని దర్శించారు.

* *26-12-1900* *

మహారాణివార్ని బిషప్ ప్రభువు, ఆయన తల్లి దర్శించారు.

* *30-12-1900* *

మహారాజా వారు టాకర్స్ దగ్గరకు వెళ్ళారు. జె.జె.ఎస్.ఐ.ఆర్ ఒక బహుమతి తీసుకున్నారు.

* *31-12-1900* *

ఈ తేదీని దినచర్యగా ఏం రాస్తాను? ముఖ్యమైన ఘటన ఏ ఒక్కటీ జరుగలేదు. కనుక ఒక విషయం మాత్రం పేర్కొంటాను. పాత సంవత్సరంతో పాటు 19వ శతాబ్దం వెళ్ళి పోయిందని మాత్రం రాయాలి.

☆

# 1901

* *1-1-1901* *

కొత్త సంవత్సరం, కొత్త శతాబ్దం. అయ్యో! మహారాజులుం గారు జీవించి లేరు.

☆

* *5-1-1901* *

గౌరవనీయులైన గవర్నరు గారు, హెచ్.ఇ.ఎల్.ఆమీట్ హిల్ చూడవచ్చారు.

☆

* *6-1-1901* *

మధ్యాహ్నం 11 గంటలకు మదరాసు వదలి పెట్టాను.

☆

* *7-1-1901* *

మార్గ మధ్యంలో

☆

* *8-1-1901* *

రాత్రి ఒంటి గంటకు విజయనగరం చేరాను.

☆

* *9-1-1901* *

నేంద్రకాయ మలబారు అరటి మొక్క.

☆

* *13-1-1901* *

చెరకు తోటలో ఏడు రోజులు గొర్రెలను ఉంచాము. నాలుగు రాత్రుళ్లు ఉంచాము.

గత రాత్రి ఒక దుక్కివాన కురిసింది. అడ్డుకట్టు ఉత్తరము వైపుగా తెగింది. అక్కడ చిన్న చిన్న రాళ్ళు ఉన్నాయి. అవి చాల చోట్ల మన్ను తీసుకుపోయాయి. మన్నుకట్ట ఎత్తులో బాగానే ఉన్నాయి. బహుశా ఆవేపు పెద్దగా వానపడలేదు. చెరువులోకి నీటిని పంపించాలి.

☆

* *18-1-1901* *

పదిహేనో తేదీని వానపడింది. ఇప్పటి వరకూ ఆకాశం మబ్బులతోనే ఉంది. ఊటగెడ్డలో పెద్దగా వరదలు.

కొద్దిగా కట్టలు కట్టవలసివుంది. బహుశా పెద్ద తోటవేయడం మంచిది. అది జిరాయితీ భూమి. బహుశా ఇది అన్నిటి కంటే ఎక్కువ లాభదాయకం. ఫలసాయం త్వరగా రాకపోవచ్చు. పంట తరువాత పంట వేయాలి. నువ్వులు, చోళ్ళు, వరి ఒకదాని వెంబడి ఒకటి వేయాలి. పొలాలు తవ్వాలి (?)

**జ్ఞాపిక:**

బుధవారపు మాజీ, స్వామి, శాస్త్రి, మునసబుగారి భార్య, వెంకన్న పంతులు, బ్రహ్మాజెముడు.

శిస్తుకి భూమిని (పాతది) ఇవ్వడంలో కంకరదిబ్బ ఉన్నది ఉన్నట్లుగా ఉంచేయాలి.

☆

** 19-1-1901 **

చోళ్ళు వేశాం. మాధవధార నుండి అనాస విత్తనాలు తెచ్చి నాటాలి. లేత విత్తనాలు ఐదువందలు ఐదు రూపాయలు వెయ్యి ఒక్కంటికి. తోట గెడ్డకు ఇరుప్రక్కల వెయ్యాలి. కొన్ని కొన్ని వేళల్లో తెల్లని మబ్బులొస్తాయి. తరువాత అవి నల్లని రంగుకు వస్తాయి. ఆకాశానికి పైగా దూరంలో మతారుబొందు.

**జ్ఞాపికలు:**

శిక్కదోస గింజలు చెరువు గట్టు మీద వెయ్యాలి. కర్బూజ కూడ గెడ్డ మీద వేయించాలి. ఇందువల్ల వరదల వల్ల జరిగే నాశనం నుండి తప్పించుకోవచ్చు.

☆

** 20-1-1901 **

నువ్వులు వేయడానికి పొలాలకు నీరు పెట్టాలి. చెరుకుకు ఎరువు అవసరం.

** 14-6-1901 **

మిడతల దండు విజయనగరం మీదుగా వెళ్ళాయి.

** 29-7-1901 **

జోత్పూర్ మహారాజా అర్జునసింగ్జీ. ఆయన పరిపాలన చేసే మహారాజుగారి తమ్ముడు ఇక్కడకు వచ్చాడు.

** 31-7-1901 **

నేను వారిని చూశాను. ఆయనకు బహుమతులివ్వబడ్డాయి. వాటిలో ఆరువేల రూపాయల నగదు మరికొన్ని బహుమతులు ఆయనకు ఇచ్చారు.

** 1-8-1901 **

సాయంత్రం మహారాజా అర్జునసింగ్జీ వెళ్ళారు.

** 9-8-1901 **

వెంకన్న పంతులు నిన్నరాత్రి చనిపోయినారు. ఆయనలో పాశ్చాత్య నాగరికత లక్షణాలు మంచివీ, చెడ్డవీ ఉన్నవి. వాటిని అతిశయోక్తులుగా చెప్పకుంటారు. ఆయన ప్రజాశ్రేయోభిలాషి, ధైర్యశాలి, స్వతంత్రుడు, కార్యనిమగ్నుడు. కాని, మనస్థితి ఉండవలసినదిగా ఉండదు. కొందరు ముఖ్యంగా ఆయనంటే గిట్టని వాళ్ళు ఆయన లొసుగులను పెంచి చెప్పకుంటారు. కాని, ఇటువంటి లొసుగులు తప్పని సరిగా ఉంటాయని గ్రహించలేము. ప్రస్తుత మేధో పరిస్థితులలో ఈ తప్పని సరి పాత కాలపు సాంఘిక లోపాలు మత విశ్వాసాలు ప్రజాజీవితంలో నిజాయితీని పెంపొందించవు.

వ్యక్తిగత నైతిక ప్రమాణాలలో కొంత ప్రభావం చూపుతాయి. లేనట్టయితే విద్యావంతులుగా వారిపై ఉండే స్థానిక ప్రభావము పాశ్చాత్య జీవితం అలవర్చిన ప్రభావము మధ్య పొత్తు కుదరదు. ఒక ఫ్రెంచి దేశీయుడు చెప్పినట్లు ప్రాచ్య యూరప్ ఖండ ప్రజలు రెండు నాగరికతలను ప్రస్తుత తరాలవారు చూస్తున్నారు. వాటిలో సరిపడని సంగతులు, వైవిధ్యాలు.

పాశ్చాత్య నాగరికత సాంఘిక ప్రగతిని గమనించకుండా బోధించడం స్వేచ్ఛను లాభదాయకంగా స్వీకరించడం ఇందుకు భిన్నమైన ధోరణిని గట్టిగా వ్యతిరేకించడం ఇప్పటి విద్యా సమస్యకు అవసరం. వి.గారు హెచ్చు మోతాదులలో వాటి శక్తికి, బలహీనతలకు ప్రాతినిధ్యం వహించాలి.

☆

*** *15-11-1901* ***

పి.టి. శ్రీనివాస అయ్యంగారు ఈ మధ్య ఒక రోజున ఇక్కడకు వచ్చారు. ఆయనది చాల వింత ప్రకృతి. స్వేచ్ఛా జీవితం. థియొసోఫిస్టుగా మారిపోయాడు.

☆

## 1902

*** *4-3-1902* ***

ఉదయం 7 గంటలకు విజయనగరం నుండి మద్రాసు చేరుకున్నాము. మహారాణివారు, డవేజర్ మహారాణివారు, రీవాసర్కారు, మైనరు మహారాజా, చిట్టి మహారాణి సాహెబ్, బాబూ సాహెబ్, ప్రతాప్‌జీ పెద్దకుమార్తె, ట్యూటరు, డాక్టరు లీపింగ్ బయలు దేరారు.

☆

*** *5-3-1902* ***

ఉదయం 7 గంటలకు మద్రాసు చేరాను. ప్రభుత్వపు వాహనం భటులు రాలేదు. కావలసినట్టుగా కోరినది ఆలస్యంగా అందినది. గవర్నరుగారు పర్యటనకు వెళ్ళారు. స్వామి పరమహంస, బాలసుబ్రహ్మణ్యం కూడ మహారాణితో పాటు వచ్చారు.

(?) స్వాముల వారి శిష్యులు కొందరు ఆయన కోసం ఒక శునక వాహనం తెచ్చారు. ఒక పూలదండ, చందనం మొదలైనవి తెచ్చారు. ఆయన తలపై ఛత్రము పట్టారు.

☆

*** *7-3-1902* ***

ఈ ఉదయం పూట ఒక మొదలియార్ యువకుడు పట్టభద్రుడు చూడ వచ్చాడు. అతను హిందూమతానికి, తత్త్వశాస్త్రానికి సంబంధించిన పుస్తకం రాశాడు.

స్వామికి గౌరవాంజలి ఘటించడానికి వచ్చాడు. విద్యావంతులైన హిందువుల మత తాత్త్విక విషయాల గురించి చాలా మాట్లాడాడు. అయన నాకు పెద్దగా ప్రశంసలర్పించాడు. నన్ను ఉదార భావకుడని అన్నాడు. ఈ సన్యాసిని (?) దేవుడు రక్షించుగాక.

☆

*** 9-3-1902 ***

బొబ్బిలి మహారాజులుం గారు ఈ ఉదయం చిన్న కుమారునితో కలిసి వచ్చారు. వారు వారి అభిప్రాయములో స్థానిక ప్రభువులు, జమిందారులు అనుభవం చాలని ఇంగ్లీషు వారి కంటె ఆంగ్లో ఇండియనులే నయమని నాతో అన్నారు. వారు బొబ్బిలి చరిత్ర గురించి తెలుగులో ఒక గ్రంథాన్ని ప్రచురించారని నాతో చెప్పారు. అయన నాకు ఏమని చెప్పారంటే కీర్తిశేషులైన శ్రీరామమూర్తి పంతులుగారు వెలమ కులము గురించి రాసినది మొదటి భాగము, రెండోది బొబ్బిలి చరిత్ర గురించి రాసిన దానికి అనువాదం.

☆

*** 10-3-1902 ***

ఎ.జి. కలెక్టరుగారు ఎర్విన్ మద్రాసు చేరారు. ఇక్కడకు వచ్చారు. నా ఆప్టే ఇంగ్లీషు, సంస్కృత నిఘంటువు ప్రతి పైని మహారాజులుంగారి వారి దిగువ వ్యాఖ్యను నేను రాసిపెట్టాను. (కీర్తిశేషులైన విజయనగరం మహారాజులుం గారు) 'మహోన్నతుడైన బానిస. ఈ బానిసత్వం తనకు తాను విధించుకున్నది.'

10 × 10 గ్రాముల ప్రిస్కృిప్షన్ నాకు రాసి ఇవ్వబడింది.

9 వ తేదీ సాయంత్రం శ్రీ కృష్ణ భాగవతుల హరికథా కాలక్షేపమునకు వెళ్ళాము. అయన తంజావూరు వారు. మంచి గాయకుడు, చాలా వివేకశీలి కూడ. రుక్మిణీ కల్యాణము కథను అయన తమిళంలో చెప్పారు. అయన ఉపాఖ్యానాలు కూడ ఆసక్తి పుట్టించాయి వినే వారందరికి, పాటలు వివిధ భాషల్లో ఉన్నాయి. తెలుగు, సంస్కృతం, కన్నడం, మళయాలం, సంస్కృత గీతాలు మహా భాగవతంలోనివి. కథాగమనంలో అయన చెప్పిన చిన్న చిన్న ఉదంతాలు అయన విజయానికి కారణాలు.

☆

*** 12-3-1902 ***

డవేజరు మహారాణివారు, మహారాజా కుమారికా, మైనరు మహారాజా వారు గవర్నరు గార్ని గవర్నమెంట్ భవనంలో దర్శించారు. మిస్టర్ ఇర్విన్, కలెక్టరు, గార్డియన్.

☆

* *17-3-1902* *

గవర్నరు గారి భార్యామణి అంప్‌హిల్ చెల్లెళ్ళతో పాటు మహారాణులను దర్శించారు. ఉదయం 10 గంటలనుండి మధ్యాహ్నం 1గంటవరకు మహారాణులు చాల సంతోషం పొందారు.

☆

* *22-3-1902* *

మిస్టర్ థామ్సన్.... ఉదయం పూట మర్యాద పూర్వకంగా తిరిగి దర్శించారు.
థామ్సన్:– మిస్టర్ ఫెలిప్స్ మీకు నచ్చారా!
మహా:– ఆయన చాలా నచ్చినారు.
థామ్సన్:– ఆయన పెళ్ళి చేసుకొని తిరిగి వస్తారని ఆశిస్తున్నాను.
మహా:– నాకు తెలియదు. వారు అది నాకు చెప్పలేదు. రెండు నెలలుగా నాతో ఏమీ చెప్పలేదు.
థామ్సన్:– మహారాజులుంగార్ని చూడాలని నాకు చాల కోరికగా ఉంది. ఆయనకి ఆరోగ్యంగా లేదని విన్నాను. తరువాత మిస్టర్ వింటర్ బాటమ్ మధ్యాహ్నం 12 గంటలకు చూడ వచ్చారు.

బర్‌గెస్ అమ్‌రోటి, జగ్గయ్యపేట. పుట.13, ధరణికోట ప్రాచీన చరిత్రలోని ధరణికోటక, రాజధాని మహేంద్ర.

☆

* *22-3-1902* *

పడమర 18 మైళ్ళు
బెజ్ నక్కవరదిమ్మ
నాగార్జున దిబ్బ పుట. 18 పాలీభాష గురించి బెయిలర్ అజ్ఞానం. చాలా కాలంగా సరియైన అర్థజ్ఞానం లేదు. అవసరంగా అనిపించిన శాసనాలు ఇవ్వబడ్డాయి.

☆

* *12-7-1902* *

డవేజరు మహారాణి వారు రాత్రి 1.45 నిమిషాలకు మరణించారు.

☆

* *27-8-1902* *

మైనర్ మహారాజులుంగారికి కొడుకు పుట్టారు.

☆

# 1903

* *3-3-1903* *

హస్తబలు యాజమాన్యం తీసుకున్నాను.

* 7-4-1903 *

మద్రాసుకు విజయనగరం నుండి బయలుదేరాను.

☆

* 8-4-1903 *

మద్రాసులో

☆

* 10-4-1903 *

సర్. భాష్యంఅయ్యంగార్ చూడవచ్చారు.

☆

* 11-4-1903 *

కూనూరు.

☆

* 14-4-1903 *

ఒక రోజు ఉదకమండలంలో

☆

* 18-4-1903 *

మహారాజా వారికి బాలయ్యనాయుడు నమస్కరించడానికి వచ్చారు.

☆

* 6-5-1903 *

మహారాజులుం గారు ఉదకమండలానికి బయలుదేరారు.

☆

* 15-5-1903 *

గౌరవనీయులైన గవర్నరు గారు మహారాజులుంగారిని చూడవచ్చారు.

☆

* 16-5-1903 *

మిష్టర్ థామ్సన్ గారి రాక.

☆

* 18-5-1903 *

మిస్టర్ వింటర్ బోతమ్స్ గారి రాక

☆

*** 21-5-1903 ***

మిస్టర్ వియర్‌ను మిస్టర్ విలియమ్స్ పనిలో పెట్టుకున్నారు.

☆

*** 8-6-1903 ***

గవర్నర్ సతీమణి హామ్‌ఫిల్‌ను మహారాజులుం గారు దర్శించారు.

☆

*** 11-6-1903 ***

ఉదకమండలం నుండి ప్రయాణం.

☆

*** 14-6-1903 ***

మద్రాసులో

☆

*** 20-6-1903 ***

మద్రాసు నుండి విజయనగరానికి

*** 13-7-1903 ***

శర్మ గారు విశాఖపట్నంలో చనిపోయారు. సంస్థానమునకు వ్యతిరేకంగా దావా.

*** 26-12-1903 ***

పిఠాపురం రాణులలో ఒకరు మహారాణివార్ని దర్శించారు.

## 1904

*** 27-4-1904 ***

ఉదకమండలానికి విజయనగరం నుండి బయలు దేరాను. రాజు గారు మహారాజా వారిని దర్శించారు. వారి వెంట వారి సోదరుల కుమారులున్నారు. బసివిరెడ్డి, చిరంజీవి నిడుదవోలులో రైలు ఎక్కారు.

*** 28-4-1904 ***

మా అమ్మాయి జబ్బుతో ఉందని టెలిగ్రాం వచ్చింది. మద్రాసు చేరాను.

*** 29-4-1904 ***

నాన్నమ్మ బాగుందని వార్త వచ్చింది.

*** 30-4-1904 ***

రంగాచారిగారు వచ్చారు.

*31-4-1904*

సర్. భాష్యంఅయ్యంగార్ వచ్చారు. నేను కూనూరుకు బయలుదేరాను.

☆

*1-5-1904*

కూనూరు చేరాను.

*9-5-1904*

ఉదకమండలం చేరాను.

*11-5-1904*

మిస్టర్ గిల్మన్ వచ్చారు. మహారాణివారిని మిస్టర్ గిల్మన్ దర్శించారు.

*16-5-1904*

మిస్టర్ లార్మో (?) వచ్చారు.

*23-5-1904*

గౌరవనీయురాలైన ప్రిన్స్ వచ్చారు.

*30-5-1904*

గౌరవనీయులైన మిస్టర్ స్టోక్స్ వచ్చారు. పత్రాలపైన సంతకాలు జరిగాయి.

*7-7-1904*

ప్రభుత్వ భవనంలో గౌరవనీయురాలు కుమారి థామ్సన్ మహారాణివార్ని దర్శించారు. తాతాచార్యులుగారు కూనూరు వెళ్ళారు.

*21-6-1904*

గౌరవనీయురాలైన కుమారి థామ్సన్‌ను మహారాజులుం గారు దర్శించారు.

☆

*6-7-1904*

శ్రీ శ్రీమతి డురెల్ (Durell) స్వదేశానికి (ఇంగ్లండ్) బయలుదేరారు.

## 1905

*17-4-1905*

మహారాజులుం గారు ఉదకమండలానికి బయలుదేరారు.

☆

*18-4-1905*

మద్రాసు చేరాను.

☆

*24-4-1905*

విజయనగరానికి బయలుదేరాను. మా నాన్నగారు చనిపోయారు.

☆

* 7-5-1905 *

ఉదకమండలానికి బయలుదేరాను.

☆

* 8-5-1905 *

మద్రాసులో

☆

* 10-5-1905 *

మద్రాసు నుండి బయలుదేరాను.

☆

* 11-5-1905 *

ఉదకమండలం చేరాను. మిస్టర్ లార్మర్, శాస్త్రి (?) నాతో పాటు ఉన్న ప్రయాణికులు. నేను అక్కడికి చేరేసరికి మిస్టర్ థామ్సన్ అక్కడకు వచ్చారు. మిస్టర్ గిల్మన్ శుక్రవారం వచ్చారు.

☆

* 24-5-1905 *

మిస్టర్ లార్మర్ బయలుదేరారు.

☆

* 29-5-1905 *

ప్రభుత్వ భవనంలో గౌరవనీయులైన గవర్నరుగారి సతీమణిని మహారాజులుంగారు దర్శించారు.

☆

* 5-6-1905 *

గౌరవనీయురాలైన గవర్నరు సతీమణి ఆమ్థిల్ మర్యాద పూర్వకంగా బదులు సందర్శన చేశారు.

## 1906

ఖజానా అధికారి ఈ దినచర్య పుస్తకం ఈవేళ నాకు పంపారు. ఈ రోజు చేయవలసిన పనులు

తాళపత్ర గ్రంథములు
గ్రాంట్స్ ముద్రణ
వెబ్స్టర్ నిఘంటువు
సోమయాజులకు చూపాలి.

వి. రాజుకు (?)
జయంతి పంపాలి.
మద్రాసునుండి తిరిగివచ్చాక బొబ్బిలి సిద్ధాంతిగారిని పిలిపించాలి.

☆

*16-1-1906*

శ్రీరామమూర్తిగారి పుస్తకం రెండో సంపుటం నమోదు చేయాలి. గోదావరి జిల్లాకు చెందిన భూములు వశపర్చుకున్నవారిని సబ్ కోర్టులోని రికార్డులను కూడ పేర్కొనాలి. పెద్దాపురం మునసబు కోర్టునుండి కూడ పేర్కొనాలి.

☆

*17-1-1906*

గ్రంధాల గురించి, ఎం. గురించి చిరంజీవితో పరిష్కరించుకోవాలి.

☆

*18-1-1906*

వెలగాడ గ్రామమునకు రోడ్డు. ధర్మోదకం ఏ క్రమంలో ఇస్తారో ఇవ్వబడింది.

☆

*19-1-1906*

గోపీనాథకు టెలిగ్రామ్
x రంగూన్‌కు మనం పంపాలి.

☆

*20-1-1906*

1. గంగరాజు 2. వైజాగ్ 3. శ్రీరామమూర్తి సెలవు శ్రీకాకుళం.

☆

*21-1-1906*

మెయిల్లో గోపీనాథ్ వచ్చాడు.
మామగారి కొడుకు, భోగాపురం కుర్రవాడు కాకర్లపూడి వెంకట నరసరాజు, జగన్నాధరాజు బాటి బావాజీ సుఖదేవ్.

☆

*22-1-1906*

స్థానిక రైలులో:
1. మూడవ క్లాసు 1 రూ.
2. రెండో తరగతి రానూపోను 2–12–0
3. ఇంటర్ క్లాసు (?)
బంట్రోతును తిరిగి పంపించి వేశాను. జట్కా బండి అద్దె 0–8–0.

☆

* *23-1-1906* *

కలకత్తాకు,

వెంకట రమణయ్య, సైదాపురం లైన్ ఇన్స్పెక్టర్, గూడూరు మీదుగా

☆

* *24-1-1906* *

తుని రైలు పెట్టె

☆

* *27-1-1906* *

పరదా విందులో వేల్స్ రాజకుమారిని మహారాణివారు చూశారు.

☆

* *30-1-1906* *

మహారాణివారు ఆంప్థిల్ ప్రభువు సతీమణిని సందర్శించారు. ప్రతాప రుద్రదాయ భాగాన్ని పరీక్షించాను.

☆

* *31-1-1906* *

పేపర్స్.

☆

* *2-1-1906* *

తునిరాజు గారు వెళ్ళడం గురించి, మధ్యాహ్నం 12.30 కి మహారాణిగారిని గవర్నరు గారి సతీమణి దర్శించారు.

☆

* *3-2-1906* *

దక్షిణ వల్లూర్ రాణిగారు వచ్చారు.

దివాన్ బహదూర్. బి. నారాయణ పంతులు గారు వచ్చారు.

ఓరియంటల్ గ్రంధాలయం రాత పత్రాల జాబితా

వెంకయ్యగారి పైవిలాసం

శ్రీరామనాధ అయ్యర్ బి.ఏ.

రెవరెండ్....మైలాపూర్.

బి. సూర్యనారాయణ 37 లింగిచెట్టి వీధి.

☆

# 1911

** 12-1-1911 **

వీరేశలింగం పండితులు నిశ్చయముగా మహాపురుషుడు. సాహిత్యంలో ఒక శాఖను ప్రారంభించి, సంఘములో పురోభివృద్ధి పంథా లేవదీసిన మాన్యుడు, ఇది చాల కష్టతరమైన పని. తెలుగు దేశపు సేనాధిపతులైన వంశపురుషుల రక్తము ఆయనలో ప్రహించుచున్నది. కనుకనే వారిలో సాహసము, నిశ్చలత్వము కనబడుతాయి.

# 1913

** 1-1-1913 **

ఏనుగు రాజుగార్ని ఎన్నుకుంటుంది. (?) ఆయన పేరు సర్ జాన్ ఎట్కిన్సన్ అతను చాల మంచి వాడుగా కనిపించాడు. పబ్లిక్ సర్వీస్ కమీషన్ సెలవలు తరువాత నేను ఆయన్ని మళ్ళీ చూడవలసి వుంది. రామమూర్తికి రావు సాహెబ్ బిరుదు వచ్చినందుకు చాల సంతోషపడవలసిన వార్త. గౌరవనీయులైన రామచంద్ర గారు కాస్మాపాలిటన్ క్లబ్బు నుండి ఫోను చేశారు. అది మా ఆశయానికి విజయమని అన్నారు.

** 2-1-1913 **

వారసత్వపు దావా వాదోపవాదాలు 15వ తేదీ తరువాత కోర్టులో విచారణకు వస్తాయి....దీర్ఘకాలం వాయిదా. ఫిర్యాదు చేసిన వారు కోరితే తప్ప, శ్రీనివాస అయ్యంగారు అంగీకరిస్తే తప్ప ఇది జరుగుతుంది. మేము దీనిని వ్యతిరేకిస్తాము. జడ్జీ పి.ఆర్. సుందరం అయ్యంగారు.

తెలుగు భాషా అధ్యయనం గురించి రాసి యిమ్మని ఆయన కోరారు. 10వ తేదీని ఒక సమావేశం జరుగుతుంది. శేషయ్యఅయ్యర్ గారిని కూడ చూశాను. ఏట్సు, హంటర్, శేషగిరిరావుగార్లకు ఉత్తరాలు రాశాను. మహారాణీగారికి టెలిగ్రాం ఇచ్చాను.

** 3-1-1913 **

వీలునామా సందర్భంగా విజయనగరం వెళ్ళమని మిస్టర్ ఫౌలర్‌కు టెలిగ్రాం వచ్చింది. తదనుగుణంగా బహుశా మార్పు చేసుకోవలసి వుంటుంది.

** 4-1-1913 **

మద్రాసు నుండి ప్రయాణం మహారాజులుంగారికి ఒకటి. తెలుగు గురించి 2.ఎ. పౌర అధికారుల కోసం లేదా, బి. విచారణ, తెలుగు గురించి ఉత్తరం రాశాను.

** 5-1-1913 **

సకాలంలో విజయనగరం చేరాను. రాజమండ్రిలో తెలుగు నాటకాల ప్రదర్శన గురించి గున్నేశ్వరరావు నన్ను అడిగారు.

* 6-1-1913 *

మిస్టర్ పౌలర్, శర్మగార్లను చూశాను. మహారాజులుంగారి వీలునామా విషయాల గురించి చర్చించాను.

* 9-1-1913 *

విజయనగరం నుండి మద్రాసుకు బయలుదేరాను.

* 13-1-1913 *

మిస్టర్ హంటర్‌గార్ని, మిస్టర్ గిల్‌మన్‌గార్ని చూశాను. శివస్వామిఅయ్యరుగారి ఇంటిలో విందు.

* 14-1-1913 *

ఎమ్.కె.జి. నటేశంగారి ఇంట్లో సాయంత్రం 5.30కు విందు.

* 16-1-1913 *

ప్రభుత్వాధికార లాంఛనంగా రాక బదులుగా పోవడం జరిగింది.

* 12-2-1913 *

| | |
|---|---|
| నగరం భవనాలు | 3536 |
| కోట | 6463 |
| | 9999 |

* 13-2-1913 *

1. టాకర్ కొరకు తోటమాలి.
2. సంతకం
3. కీర్తిశేషులైన మహారాజులుంగారి ఛాయాచిత్రం

* 22-2-1913 *

ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయం సమాచార గ్రంథం పంచాపకేశ అయ్యర్

* 1-3-1913 *

ఎస్.కె. వ్యాకరణం కోసం డబ్బు పంపటం జరిగింది.

* 27-3-1913 *

గొడవర్తి రామదాసుగారి పుస్తకాలు ఎన్.వి.యన్.కాలేజీ పుస్తకాలు.

* 31-3-1913 *

సీమా క్లబ్బు పైకం

* 1-4-1913 *

1. కోడూరు సుబ్రహ్మణ్యశాస్త్రి – రామేశ్వరం
2. రంగమన్నార్ – ఎమ్.ఎన్.
3. ఎల్లై
4. విజ్ఞాన చంద్రిక
5. వేదం వెంకటరాయశాస్త్రి

* 2-4-1913 *

చిత్రప్రభానామ శబ్దరత్న వ్యాఖ్యా హరిశాస్త్రిణాకృత పండిత ఆర్. నారాయణశాస్త్రి

టి.కళాశాల, తంజావూరు.

* 3-4-1913 *

నెం.51, ఆజీసాహెబ్ పేట రోడ్డుకు తూర్పు!

నెం.42, రోడ్డుకు పడమర వైపు,

నెం.41, 39- పీర్ జస్.

* 7-4-1913 *

విజయనగరంనుండి బయలుదేరాను. వీరేశలింగం పంతులుగారు రాజమండ్రి నుండి నా తోటి ప్రయాణికుడు.

* 8-4-1913 *

మద్రాసు చేరాము.

* 9-4-1913 *

పరీక్షకుల సమావేశం.

* 13-4-1913 *

డా. విల్ దొర గురించి మద్రాసులో ఛోగట్టా చేయాలి.

* 14-4-1913 *

విజయనగరంనుండి ప్రయాణం

మోడరన్ రివ్యూ పత్రిక.

* 15-4-1913 *

మద్రాసు చేరాను. వెంకటాచలానికి ఫ్రెంచి పుస్తకం కోసం, ఆ హైదరాబాదు ఆయనకు ఉత్తరం రాయాలి.

* 16-4-1913 *

ఆకెళ్ళ

కె. సూర్యనారాయణ

8, ఈశ్వరలాల్ సందు, ట్రిప్లికేన్.

* 18-4-1913 *

వి.ఎఫ్. కొత్తది.

* 23-4-1913 *

పి.ఆర్. సుందరంఅయ్యర్ న్యాయాధిపతిని చూడాలి.

రామేశంగారి పుస్తకం.

రామకృష్ణకవి గారికి ఉత్తరం రాయాలి.

వెంకటాచలం గురువారం వస్తారు.

** 24-4-1913 **

ప్రభుత్వం పరీక్షాధికారులకు ఉత్తరాలు రాయాలి.

** 26-4-1913 **

సింహాచలం శాసనము
తిమ్మరసుమీది గ్రంథం
విన్నకోట పెద్దన - వ్యాకరణం
దంతులూరి.

** 1-5-1913 **

నీలగిరికి మద్రాసు నుండి బయలుదేరాను. మిస్టర్ సల్‌కండ్ పాఠ్యగ్రంథ కమిటీ కార్యదర్శి నా రైలుపెట్టెలో ఉన్నారు. చాలా మర్యాదస్తుడు, మొహమాటస్థుడు. తెలుగు గురించి చర్చించాము. మిస్టర్ సల్‌కండ్ చాలా దయాశీలి కూడ. ఆయన నాకు కిటికీకి చేరువగా స్థలం ఇచ్చారు.

** 2-5-1913 **

మిస్టర్ మిడిల్ మార్టును ట్రెయిన్లో చూశాను. కాని, ఆయనతో మాట్లాడటం జరిగింది కాదు. ఆయన కూనూరు స్టేషన్‌లో అదృశ్యమయ్యారు. మేము మెయిల్ బండిలో ఎక్కాము. మూడు రూపాయిలు చెల్లించాము. హైలాండ్స్ చేరాము. మహారాణి సాహెబా డ్రాయింగు రూము చూపారు. పూలతోట వైపుగా అది ఉంది. పల్లం, బయళ్ళు దిగువ ఉన్నాయి. దానిని వారు ఒక కల అన్నారు. వస్తువుల అమరిక చక్కగా ఉంది. చందాబిల్లు 6 రూపాయలు. వేదం వారికి ఉత్తరం రాశాను.

కూనూరు తొమ్మిది పదేళ్ళ నుండి నేను ఇక్కడకు వస్తున్నాను. మహారాణి వారు ఎంత దయకలవారు. ఊటీలో కంటె వాతావరణం బాగుంది. చలి తక్కువ. దానిలో నేను, రామచంద్ర గారు ఉంటున్నాము. ఆయన చాలా మంచి వారు. మహారాణి గారికి దేవుని దీవెనలు.

** 2-5-1913 **

నీలపు రంగు పూల తీగెలు చాలా ఆప్యాయంగా స్వాగతం చెబుతున్నట్టుగా ఉంది. సీత అక్షింతలు మందహాసం, అడివి ప్రాంతపు గుసగుసలు జరుగుతున్నాయి.

** 9-5-1913 **

మహారాజులంగారి కోసం పుస్తకాలు తీసుకున్నాము. టాల్‌స్టాయ్ మరణానంతరం ముద్రించిన నోటు పుస్తకాలు.

** 10-5-1913 **

ఊటి వెళ్ళాను. శ్రీరాములునుండి అడ్వాన్స్‌గా 5 రూ. పుచ్చుకున్నాను. తిరుగు ప్రయాణానికి 1-2-0.

* *12-5-1913* *

రూ౦ఓలు (?) నెం.1374
వర్షం ఖర్చులు 22 తేదీ వరకు 48-11-0

* *14-5-1913* *

మహారాణిగారి కోసం కొన్నవి.

| | |
|---|---|
| షేక్స్పియర్ | 1-12-0 |
| టైమ్స్ ఆఫ్ ఇండియా | 0-4-0 |
| | 2-0-0 |

* *15-5-1913* *

ఉదకమండలం వెళ్ళాను మహారాజులుం గారు, మహారాణి వారు ఆజ్ఞానుసారంగా. బండి అద్దె ఒక రూపాయి.

* *16-5-1913* *

కృష్ణారావు అన్నదమ్ములు, హయగ్రీవరావు, వడ్డాది.

* *23-5-1913* *

గురువులుకు నాలుగు రూపాయలిచ్చాను.

* *24-5-1913* *

ఉదకమండలం.

* *26-5-1913* *

ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలకు, రిజిస్ట్రార్‌కు, కార్యదర్శికి బిల్లులు పంపాను.

| | |
|---|---|
| ప్రయాణం | 132-8-0 |
| విశ్వవిద్యాలయం | 400-12-0 |
| ఎస్.ఎస్.ఎల్.సి | 115-1-6 |
| | *743-5-6 |

(* మూలంలో వున్నట్లుగా వుంచాము.)

* *27-5-1913* *

మహారాణివారు నా చేతికి ఇచ్చిన సొమ్ము 150-0-0 చందా నిమిత్తం 'ఆంధ్రభారతి'కి ఉత్తరం రాశాను. గత ఏడాదికి, ఈ ఏడాదికి మనియార్డరు పంపాను. నిలువ 50 రూ.

* *9-6-1913* *

పండిత త్రియంబక్ మహారాణివారి అకౌంట్ నుండి 50 రూ యివ్వడం జరిగింది. నారాయణశాస్త్రికి 100రూ ఇచ్చాము.

* *12-6-1913* *

కెనమెరా లైబ్రరీకి ఒక కాపీ కొనడానికి వెళ్ళాను.

1. అనంతపురం సమాచార గ్రంధం
2. బళ్ళారి జిల్లా మాన్యువల్
3. మద్రాసు సారస్వత సంఘం పత్రికలు.
వీటితో వ్యాసాల పట్టిక తయారు చేశాను.

మూల వ్రాత ప్రతి, గ్రంథాలయం:

1. ఒక జర్మన్ రచన నుండి దండి వ్యాసం, (విశ్వవిద్యాలయం నోటు పుస్తకం చూడు)
2. శాసనాల పుస్తకం, దత్త మండలాలు.
3. అనంతపురం గ్రంథం
4. ... లైబ్రరీ చూడు, విల్సన్, లేదా టెయిలర్.

*15-6-1913*

అప్పా గురించి హంటర్‌ను చూడాలి.
మిస్టర్ ఫౌలర్‌తో మాట్లాడాను. ముందుగా చూడాలని కోరాను.

*17-7-1913*

క్రింది అంతస్థు కోసం దూలాలు $8 \times 17 \times 10 \times 12 = 113.5$
మీది అంతస్థు కోసం దూలాలు $8 \times 16 \times 9 \times 11 = 88$
మొత్తం 201/1/3
సుమారు 200 సేట్టీ.

*20-7-1913*

సీతారామచంద్రరావు $4\frac{1}{2}$ ఎఫ్.ఆర్, పూసపాటి సూర్యనారాయణరాజు $12\frac{1}{2}$, ఆనందరాజ్ ఫస్ట్ ఎఫ్.ఆర్.ఎమ్.

*25-7-1913*

హింద్ VI & VII

*26-7-1913*

మెంటాడ పతకం గురించి సమాచారం

*8-8-1913*

కె. లింగమూర్తిగారు (కార్యదర్శి)
వీరేశలింగం పబ్లిక్ గ్రంథాలయం

*11-8-1913*

కెన్వాస్ హెడ్ మాస్టర్స్
'శశిలేఖ'
కన్నడ భాషలో కాంపోజిషన్ పుస్తకాల్ని చూడమని భట్టుకి చెప్పండి.

*12-8-1913*

ఆర్. నరసింహాచార్యులు ఎమ్.ఎ బెంగుళూరు.

* 14-8-1913 *

స్వామిగారి రామాయణము
చిలకమర్తి పద్మనాభము
గున్నేశ్వరరావు
పగటి వేషగాళ్ళు

* 15-9-1913 *

పౌరగ్రంథాలయంలో ప్రస్తావనలు ఎంచుకోడానికి మిస్టర్ డ్యూ్యారల్‌కు రాయాలి. ఇంపీరియల్ గ్రంథాలయాధికారికి రాయాలి. విశ్వవిద్యాలయం, గ్రంథాలయం చరిత్ర ప్రొఫెసర్‌కు కూడ రాయాలి.

డూప్లేబోర్ డర్నాయిస్, కౌంట్ ఓ లాలీ గురించి ఫ్రెంచి పుస్తకం లేదా చరిత్ర గురించి ఒక నోటు పుస్తకం పెట్టుకోవాలి. పుస్తకాల జాబితా ఉపయోగపడే సారస్వత విభాగం గురించి అడగాలి.

1. విల్లింగ్టన్ స్క్వేర్, కలకత్తా
2. రామమూర్తి చెట్టి.

* 17-10-1913 *

ఇండియా బర్మాదేశం చిన్న ప్రమాణంలో థాకర్ సర్వేమ్యాప్. ఇంగ్లీషు నవల. సెయింట్స్ బరీస్ సెనేటు సమావేశము.

* 18-10-1913 *

సెనేటు సమావేశము.

* 19-10-1913 *

ద్రావిడ అధ్యయనాల సంఘం సమావేశం.

* 20-10-1913 *

ఇంటర్ మీడియట్ తెలుగు కాంపొజిషన్ సబ్‌కమిటీ సమావేశము.

* 23-10-1913 *

రాజమండ్రి మెయిల్‌ను తప్పక పట్టుకోవాలి.

* 16-11-1913 *

కాజీ సాహెబ్, బర్క్
'సులభ రూపంలో స్పెల్లింగ్'కు చందా.

* 17-11-1913 *

గురజాడ రామచంద్రయ్య
గురజాడ, ఉయ్యూరు పోస్టు,
కృష్ణాజిల్లా.

* 19-11-1913 *

గోషాసుపత్రికి నీటి సరఫరా గురించి మున్సిపల్ చైర్మన్‌కు దరఖాస్తు.

* 4-12-1913 *

స్వాగతం పెండాల్‌లో సాయంత్రం 3.45కు రమ్మని ఆహ్వానం, ఎల్.టి.హారిస్.

* 5-12-1913 *

సాయంత్రం 4.15 గంటలకు శంకు స్థాపన ఉత్తరంతో (ఆంధ్రదేశ కార్యదర్శి) మహారాజవారికి.

# 1914

* 16-1-1914 *

కలకత్తా చేరాను.

* 17-1-1914 *

మధ్యాహ్నం 12 గంటలకు సర్. ముర్రె చూడ వచ్చారు.

* 18-1-1914 *

సాహిత్య పరిషత్తు వార్షిక సమావేశానికి వెళ్ళాను. పండిట్ హరప్రసాదశాస్త్రి అధ్యక్షుడు. పాళీ భాష అందరికీ నచ్చినది. కారణం అది సులభమైనది. కాబట్టి పాసు కావడం సులభం. శివశంకర్ ఓజా హాజరయ్యారు. రవీంద్రుని కవిత్వం జనరంజకం కాదని హరిప్రసాద్ భావం. ఎందుచేతనంటే ఆయన బెంగాలీ భాష ఇంగ్లీషు పదబంధంలో ఉంటుంది.

* 20-1-1914 *

హెచ్. సర్కార్
22, కాళిదాస్ సెంగీ సందు,
రాజా బజార్.

* 22-1-1914 *

కిద్దర్‌పూర్ వెళ్ళాను. కొత్త అంగడి

* 23-1-1914 *

సామేంద్ర మోహన్‌దాస్,
30, బాహిర్ మీర్జాపూర్ రోడ్డు,
కలకత్తా.

* 24-1-1914 *

కార్న్‌వాలీస్ వీధి, మధ్యాహ్నం 1 గంటకు బ్రహ్మ సమాజం సమావేశం, కలకత్తా విశ్వవిద్యాలయం సంస్థ సాయంత్రం 5.30 గంటలు. స్టార్ నాటకశాల సాయంత్రం 8.30 గంటలు, మధ్యాహ్నం 3 గంటలు.

సర్ గురుదాసుగార్ని చూశాను. ఆయన పేదవానిలా కనిపించారు. తన వయసు 70 అని చెప్పారు. ఆయన చేసిన ప్రత్యేక అధ్యయనాలు విశ్వవిద్యాలయంలో సంతృప్తికరంగా లేవన్నారు. విద్యార్థులు చాలా ఎక్కువ పుస్తకాలు చదవాలి.

వాళ్ళకి విసుగు పుట్టి చదువు మానుకుంటున్నారు. చిన్న పాఠాలు, లోతైన పాఠాలు ఆయనకిష్టం. వాటి కోసం పోరాడమని నాతో అన్నారు. చిన్న చిన్న పాఠాలు అందరికీ ఇష్టంగా ఉంటుందని పునాది దిట్టంగా ఉంటుందని అన్నారు. 'సూర్యదేవచరిత'కు నేను రాసిన పీఠికను తాను చదివానని చెప్పారు. ఆ పద్య కావ్యాన్ని ఆయన ప్రశంసించారు. సంస్కృత పాఠాలు గురించి ఆయన, అసుతోష్‌బాబు పోరాడుతున్నారు.

*** 26-1-1914 ***

అభ్యర్థులు జవాబులు రాసిన తెలుగు కాంపోజిషను IIIc, రెండవ పేపర్‌లో శిక్షణలో ఉన్న లోపాలు స్పష్టమే. ఇంగ్లీషు కాంపోజిషన్ ఉపాధ్యాయుడు తెలుగు కాంపోజిషన్ చెప్పవలెనని అనుకుంటున్నారు.

రెండవ పత్రానికి జవాబు రాసేటప్పుడు, మూడవ విభాగంలో అభ్యర్థులు సాహిత్యపరంగాను లేదా కవిత్వపరంగాను తప్పక రాయాలి. ఒక విషయం దృష్టిలో ఉంచుకోవాలనుకుంటున్నాను. అదేమిటంటే ఈ పత్రం లక్ష్యం అభ్యర్థి సాహిత్యపరంగా రచన చేయాలి. పోతే, నిర్బంధంగా రాయవలసిన కాంపోజిషను సాధారణంగా ఆధునిక లేదా మాతృభాష రూపంలో ఉండాలి. చివర పరీక్షల్లో కాలేజీ తరగతిలో తెలుగు కాంపోజిషను పూర్వపు దానికి కొనసాగింపేనని అనుకుంటున్నాను.

| | |
|---|---|
| వీధిగడి | 18-0-0 |
| అబ్దికంనాడు | 10-0-0 |
| 5స్టాంపులు | 2-0-0 |
| 2డజ్ (Doz) | 1-4-0 |
| 2పేడ్‌లాక్స్ | 0-8-0 |
| రాక్‌సాల్టు | 0-4-0 |
| బండి లైసెన్స్ | 3-8-0 |

*** 10-2-1914 ***

సింహాచలం నుండి తిరిగి వచ్చాను. బండార్కర్‌ను మద్రాసు తీసుకువెళ్ళాను.

*** 11-2-1914 ***

మృచ్ఛకటిక నాటకం కావాలని బొంబాయికి టెలిగ్రామ్ ఇవ్వాలి. అప్పల నరసయ్య నుండి నాణేలు తీసుకోవాలి. బరంపురం, దొండబడ్డ పాత నుయ్యి లోతుగా తవ్వించాలి. కొత్త నుయ్యి తవ్వించాలి. అనకాపల్లిలో ఇటుకలు అడపాక భూమి.

*** 12-2-1914 ***

వేములకొండ గోపాల స్వామి పంతులు అల్లుడు.

*** 14-2-1914 ***

ఎన్.మునుస్వామి పుస్తకాలు.

* *14-3-1914* *

జ్ఞాపకం పెట్టుకోవాల్సిన విషయాలు.
పోపు తిరువాచకము
తమిళ అనువాదము
సర్వే నిర్ణయము – కలకత్తా గృహము
జి. నరసింహానికి – అందరు అన్నదమ్ములకు ఉత్తరాలు
రామస్వామి శాస్త్రికి వివరాలు పంపాలి.
గోపీనాథ్ ధాకర్ పుస్తకం – ప్రభాకర సొమ్ము
ఇంటర్ మీడియట్ తెలుగు కాంపోజిషన్ ఆలస్యమవుతూంది.
నాకు పంపబడిన పుస్తకాలను పంపివేయడం ఇక సబబు కాదని అనుకున్నాను.

* *17-3-1914* *

మద్రాసు చేరాను.
పాఠ్య గ్రంథాల ఉపసంఘం

* *20-3-1914* *

సెనెటు సమావేశం
ద్రాక్షపళ్ళు, దానిమ్మ పండ్లు
సెషన్స్ జడ్జీగారికి ఉత్తరం రాశాను.

* *21-3-1914* *

సెనెట్ సమావేశం కాలేజీకి వెళ్ళాలి. మిస్టర్ హంటర్‌ని చూడాలి.

* *31-3-1914* *

వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్ వారికి టెలిగ్రాం. వేటూరి ప్రభాకరశాస్త్రి.

* *6-4-1914* *

పరీక్షకుల సమావేశం

* *24-4-1914* *

సెనెటు

* *30-4-1914* *

మిస్టర్ వాలెస్‌కు ఉత్తరం రాయాలి.

* *4-5-1914* *

ఇంటర్ మీడియట్
నీలగిరులకు ప్రయాణం
పరీక్షకుల సమావేశం

* *5-5-1914* *

కూనూరు.

* *7-5-1914* *

సోమయ్యగారికి ఉత్తరం రాయాలి.
'శశిలేఖ' (పత్రిక)కు ఉత్తరం

* 13-5-1914 *

మాసయ్య రాక, గడ్డి, విషయాలు

1. చరిత్ర 2. తెలుగు 3. పోర్టు స్వయం మేలు 4. సిండికేటు, రాము ఉత్తరం.

* 25-5-1914 *

ఊటీకి వెళ్ళాను.

* 26-5-1914 *

హజూరితో మనవి చేయవలసిన సంగతులు. మునుస్వామి.

1. మా యింటి దగ్గర వాచ్ మెన్
2. పోస్టు
3. శేషాద్రిరావు
4. బి.ఎ.ఆనర్స్.

* 3-6-1914 *

ధాకర్ గురించి, మున్సిపల్ ఎన్నికల గురించి జి.బాపయ్య గారికి జ్ఞాపకం చేయాలి.

* 17-6-1914 *

ఊటి వెళ్ళాను. అదే రోజు తిరిగివచ్చాను.

* 24-6-1914 *

కూనూరు నుండి ప్రయాణం.

* 25-6-1914 *

పుట్టపాలెం నుండి బయలుదేరాను.

* 26-6-1914 *

మద్రాసు చేరాను.

* 1-8-1914 *

పాఠ్య గ్రంథాలు గురించి రిపోర్టు పంపించాను.

* 2-8-1914 *

మద్రాసు విశ్వవిద్యాలయం రిజిస్ట్రార్‌కు టైపు చేసిన ఉత్తరం. గోవింద రాఘవయ్యర్. ఎల్.ఎ.కు ఉత్తరం.

* 3-8-1914 *

రిజిస్ట్రార్‌కు రాసిన ఉత్తరం తరువాయి పంపించాను.

1. వి. హనుమంతరావు
2. స్టోన్.
3. మిడిల్ మార్టు
4. స్పిండర్.

* 16-8-1914 *

మహారాజులుంగారిని, ఇన్‌స్పెక్టరుగారిని దర్శించాలని ఉంది.

* 28-8-1914 *

ఆంధ్రా అడ్వకేట్, వాల్యూ పే బిల్.

* 1-9-1914 *

1. కమలాపళ్ళ గురించి పాలకొల్లుకు
2. మామిడిపళ్ళ ఎగుమతి గురించి
3. శ్రీ స్వామిఅయ్యర్‌కు తెలుగు ఓల్లణ గురించి,
4. సర్. హారాల్డు స్టూవర్ట్.

* 6-9-1914 *

దాస్‌కు ఉత్తరం రాయాలి.

* 7-9-1914 *

నారాయణ – నల్లజీడి

అచ్చువేసిన నోటీసులు – తెలుగు సంఘం.

* 8-10-1914 *

1. జగన్నాథాన్ని పిలిపించాలి. కంసాలికి సొమ్ము చెల్లింపు గురించి పరిష్కారం చేయాలి.
2. రామమూర్తి బి.ఎ.ఎల్.టి. ట్రయినింగ్ స్కూల్, విశాఖపట్నం.
3. శ్రీ పరవస్తు భట్టనాదస్వామి అయ్యవారలంగారు, గవర్నమెంట్ కాలేజ్. కుంభకోణం.
4. ఎన్.ఎన్.వి.బి. రామలింగం బి.ఎ.ఎల్.టి. కల్లికోట కాలేజీ, బరంపురం.
5. జి.వి. సీతాపతి బి.ఎ.ఎల్.టి. లెక్చరర్ రాజాస్ కాలేజి, పర్లాకిమిడి.
6. సి.హెచ్. నారాయణరావు బి.ఎ. మున్సిపల్ హైస్కూల్, చికాకోల్.
7. వి. రామచంద్రరావు. బి.ఎ, అసిస్టెంట్ మహారాజా కాలేజి, విజయనగరం.
8. సుదర్శనరావు బి.ఎ.ఎల్.టి. హెడ్‌మాస్టర్, గవర్నమెంట్ ట్రైనింగ్ స్కూల్, రాజమండ్రి.
9. ఎమ్. సూర్యనారాయణరావు బి.ఎ.ఎల్.టి., ఎ.ఇ.ఎల్.ఎమ్. కాలేజ్, గుంటూరు.
10. ఐ.వి.ఎల్. నరసింహాచారి ఎమ్.ఎ.ఎల్.టి. లెక్చరర్. నోబుల్ కాలేజ్ మచిలీపట్నం (?)

* 26-10-1914 *

వి.వి.ఎల్. నరసింహారావు, తెలుగు పండిట్ ఎమ్.సి. లారెన్, హైస్కూల్, కాకినాడ.

* 2-11-1914 *

1. యర్ర సింహాచలం
2. తమ్ముడు భగవాన్లు
3. బావమరిది, అల్లుడు
4. గొర్రె పెద్దినాయుడు, హక్కుదార్లు,

ధాన్యం రెండు

మెట్ట రెండు గరిసెలు

మెట్ట ఎనిమిది ఎకరాలు

పల్లం ఐదు ఎకరాలు

** 24-11-1914 **

పులుసు తగిలితే కడుపులో ఒక మోస్తరు పాడిగా ఉన్నట్లుంటుంది. మొన్న దూమెరుగుగా పులుసు కలుపుకొని అన్నం తిన్నాను. ఈ వేళ పులుసులో అనాసముక్కలు తిన్నాను. ఉదయం అరిటికాయ పెరుగు కూరగాని, పెరుగు అంటే అంటడం.

ఉదయం విశ్రాంతి తీసుకున్నట్లయితే, బయటకు కదలకుండా వుంటే ఆరోజు టెంపరేచర్ తక్కువగా ఉంటుంది. ఈవేళ వరకు నేను ఇంట్లోనే ఉంటున్నాను. సాధారణంగా నాకు జ్వరం రాకుండా ఉంటే చాలా కాలం జీవిస్తానని చెప్పారు. నాకు ఎండ తగలకుండా ఉండాలని ఆయన సలహా యిచ్చారు. నేను ఉదకమండలంలో మకాం చేస్తూండటం వల్ల, యీ వాతావరణం నాకు సరిపడ లేదు.

** 16-11-1914 **

*చంద్రశేఖర్ బెనర్జీ, వకీలు, హైకోర్టు,*
*నెం.8. ఎలియట్ తోరా వీధి, కలకత్తా.*

** 18-11-1914 **

కరివేపాకు మొక్కలు, భాగవతుల వారి యింట బాదం మొక్కలు గున్నేశ్వరరావు గారి యింట కొబ్బరి మొక్కలు పంపుతున్నాము.

ఒంట్లో నలతగా ఉన్నప్పుడు తోటకు వెళ్ళాను.

** 19-11-1914 **

అప్పయ్య పంతులు తోట నుండి అరటి మొలకలు. కోటకు వెళ్ళాను. వేడి తగిలింది. రాత్రి ఉష్ణం వచ్చింది. ఒంట్లో వేడి కొంత ఎక్కువగానే ఉంది. వంకాయలు కొనడానికి బజారుకు వెళ్ళాను.

** 20-11-1914 **

మునసబును చూశాను. శ్రీనివాసమూర్తి పంతులుకు కబురు పెట్టాను.
సాయంత్రం జ్వరం వచ్చింది:–99.6
తరువాత:–99.4

** 21-11-1914 **

| | |
|---|---|
| ఉదయం పూట జ్వరం | 98.4 |
| ఉదయం పది గంటలకు | 98.5 |
| మధ్యాహ్నం 2 గంటలకు | 99.2 |
| మధ్యాహ్నం 3.45కు | 99.6 |
| సాయంత్రం 6.20కి | 98.6 |

బండిలో తోటపాలెం తోటకు వెళ్ళిన తరువాత రాత్రి 9.10 నిమిషాలకు 98.6

భోజనం చేసిన తరువాత, వికారంగా ఉంది. రాత్రి కడుపులో కలచివేసినట్లుంది. విరోచనం, కొన్నాళ్ళుగా అజీర్ణం.

*** 22-11-1914 ***

ఉదయం 5.35 కు 98.4
ఉదయం 11.12 మధ్య 98.00
నార్మల్‌కు దిగువ
రాత్రి 7 గంటలకు 99.00
రైల్వే స్టేషన్‌కు వెళ్ళాను.
రాత్రి 9 గంటలకు 99.00

నిద్ర బాగా పట్టింది. ఒకసారి బయటకు వెళ్ళాను.

*** 23-11-1914 ***

ఉదయం ఆరు గంటలకు 98.00 కొద్దిగా జలుబు, చర్మం బిగుసుకు పోయినట్టుంది.
9.35 నిమిషాలకు 98.6
11 గంటలకు 98.4
సుమారు ఒంటి గంటకు అల్పాహారం
రాత్రి ఏడు గంటలకు 98.4

పెద్ద పూల తోటకు మధ్యాహ్నం 3,4 మధ్యకాలంలో వెళ్ళి తిరిగి వచ్చాను.
రాత్రి 10 గంటలకు 98.8

ఉన్నికోటు వేసుకుని పడుకున్నాను. తరువాత విప్పి వేసాను. పెద్ద దుప్పటి కప్పుకున్నాను. పల్చని మేజోళ్ళకు బదులు, దట్టమైన మేజోళ్ళు వేసుకున్నాను.

*** 24-11-1914 ***

ఉదయం 5.40 నిమిషాలకు 98.4
మలబద్ధకం, కొద్దిగా మంట,
ఉదయం 8.30 నిమిషాలకు 98.8

బండిలో బయటకు వెళ్ళాను, రామానుజాచారి యింటికి. తరువాత తోటకు వెళ్ళాను. ఒంట్లో జ్వరం వచ్చినట్లుగా ఉంది.
12.30 నిమిషాలకు 100.0
భోజనానంతరం
మధ్యాహ్నం 1.30 ని.కు 100.0
కాస్త కునుకు తీశాక
3.45 నిమిషాలకు 96.6
నిద్రపోయిన తరువాత

రాత్రి పల్చటి దుస్తులు వేసుకున్నందువల్ల, విశ్రాంతి లేకుండా బయటకు వెళ్ళినందుకు ఈ జ్వరం వచ్చింది.
3.45 ని.కు 99.6
నిద్రానంతరం
5.15 ని.కు 99.7
6.45 ని.కు 99.4

విస్తళ్ళు కుదుతుండగా
రాత్రి 10 గంటలకు 99.2

*25-11-1914*

ఉదయం 7 గంటలకు 97.8
పక్క మీది నండి లేచాను.
9.40 ని.కు 97.8
థర్మామీటరు నోటిలో పెట్టుకున్నాక 98.6
నోట్లో థర్మామీటరు చాలాసేపు ఉంచుకున్నాక 97.9, 98.4, 98.6

మెల్లగా జ్వరం పెరుగుతూ ఉంది. 9.10 గంటలకు, ఈవేళ పెద్దగా ఎక్కువ తక్కువలు లేవు. విశ్రాంతి తీసుకోవాలనిపిస్తుంది. బహుశా నిద్ర పట్టినందువల్లనేమో మధ్యాహ్నం 99.0

*26-11-1914*

ఉదయం 8 గంటలకు 98.6
ఉదయం 12 గంటలకు 98.6

ఎక్కువగా కడుపు నొప్పిగా ఉంది. రాత్రి వెలక్కాయ పచ్చడి, బీరకాయ, నారదబ్బకాయ, బాగా ఉడికించిన వంకాయలు.

మధ్యాహ్నం 3 గంటలకు 100.4
రాత్రి 10 గంటలకు 100.1

రాత్రి తీవ్రంగా కడుపునొప్పి, పెప్పరమెంట్ మొదలైనవి వేసుకున్నాను. ఏమీ తగ్గలేదు. కడుపులో వాయువు. నల్లమందు, చారు, పెద్దమాత్రల వల్ల అరగంటలో కొంత తగ్గింది.

*27-11-1914*

ఉదయం 4 గంటలకు 101
ఉదయం 5 గంటలకు ఆముదం
విరోచనాలకు మందు.
సాయంత్రం ఏడుగంటలకు 99.5
స్థిరంగా ఉంది.

*28-11-1914*

6.15 నిమిషాలకు 98.00

విరోచనం బాగా కాలేదు. బహుశా ఉదయం 8 గంటలకు ఆముదం తాగినందువల్లనేమో.

రాత్రి 3.45 ని.కు 98.00
రాత్రి 10 గంటలకు, ప్రొద్దుట 4 గంటలకు నిద్ర నుండి లేచాను.

*29-11-1914*

ఉదయం 4 గంటలకు 98.00

ఒళ్ళు వెచ్చగా ఉంది. జ్వరం ఉన్నట్టుగా అనిపించింది.

| | |
|---|---|
| 6 గంటలకు | 98.00 |
| 9.15 ని.కు | 98.01 |
| 1.14 ని.కు | 98.0 |

నిద్ర లేచాక

* 30-11-1914 *

ఎనిమిది గంటలకు పడుకున్నాను. 9 గంటలకు నిద్ర పట్టింది.

| | |
|---|---|
| ఉదయం 5.30 ని.కు | 97.9 |
| 9.15 ని.కు | 98.3 |
| 1.10 ని.కు | 99.1 |

నిద్రానంతరం ఒళ్ళు వెచ్చగా ఉంది. ఫ్లానలు కోటు వేసుకున్నాను. కొద్దిగా చికాకుగా ఉంది. నీరసంగాను ఉంది. ప్రొద్దుట 9 గంటలకు ప్రక్కమీద పడుకున్నాను. అనేకసార్లు మెలకువ వచ్చింది.

* 1-12-1914 *

| | |
|---|---|
| ఉదయం 6.15 కు | 98.2 |
| ఉదయం 9 గంటలకు | 98.3 |
| ఉదయం 11.30 కు | 99.0 |

స్నానాంతరం మంచి అల్పాహారం తీసుకున్నాను. మధ్యాహ్నం రెండు గంటలకు 98.4 బాగా నిద్రపోయాక, సాయంత్రం నడక, ఫాదర్ డోమన్‌ఏతో కబుర్లు, హాయిగా ఉంది. రాత్రి వాన.

* 2-12-1914 *

| | |
|---|---|
| ఉదయం 6 గంటలకు | 97.6 |
| ఎనిమిదింపావుకు | 98 |
| మధ్యాహ్నం 3 గంటలకు | 100 |

ఈ రోజు బాగా పనిలో ఉన్నాను. గంజితో కాఫీ, పేగులు కదలడం లేదు.

| | |
|---|---|
| రాత్రి | 99 |
| భోజనానంతరం | 99.4 |

ఆకాశంలో మేఘాలు.

* 3-12-1914 *

| | |
|---|---|
| ఉదయం 5.15 కు | 98.9 |
| ఉదయం 6.45 కు | 98.4 |

ఉదయం పూట చికాకుగా ఉంది. ఈ రోజు మళ్ళా పని తొందర మహారాణివారితో సుమారు 12 గంటల వరకు పని. బలం వచ్చినట్టుగా అనిపించింది. బహుశా గంజి కలిపిన కాఫీ తాగినందువల్లనేమో, అల్పాహారం తరువాత నిద్ర లేదు. మద్యాహ్నం 3 గంటలప్పుడు అప్పయ్యగారి తోటకు వెళ్ళాను. చాల దూరం నడిచాను. పూర్వపు రోజుల్లాగే బలంగా ఉన్నాననిపించింది. ఎందుచేతనంటే మంచి విశ్రాంతి, నిద్ర.

5.45 ని.కు 99.4
8.15 ని.కు 98.8
5 గంటలకు 98.3
6.30 ని.కు 98.4
విశ్రాంతి తీసుకున్నాను.

** 5-12-1914 **

ఉదయం 6 గంటలకు 98.0

** 6-12-1914 **

ఉదయం 8.40 ని.లకు 99.6
కడుపునొప్పి, ఆముదం తాగాను.
ఉదయం ఆముదం 3 గ్రాములు.
3 చుక్కలు నల్లమందు

గమనిక:- అప్పారావు గారు తన అనారోగ్య పరిస్థితిని తగ్గించుకోడానికి, ఆరోగ్యవంతుడు కాడానికి ఎంతగా ప్రయత్నాలు చేస్తున్నది పాఠకులు గమనించారు. ప్రతి రోజూ ఎన్నిసార్లు టెంపరేచర్ చూసుకున్నదీ, తన ఆహారం, ఇతర కార్యకలాపాలు వివరంగా రాస్తూ వచ్చారు. ఈ తరువాత కూడ ఇటువంటివే ఎన్నో వివరాలు రాసి పెట్టారు. వీటిని బాగా క్లుప్తీకరించడం అవసరం. ఎందుచేతనంటే ఇంత వరకు రాసిపెట్టుకున్న తన దైనందిన కార్యకలాపాలు గమనించాక, పాఠకులు కొత్తగా తెలుసుకోవలసింది ఏమీ ఉండదు. ఫలానా రోజున ఫలాన సమయాన తన దేహస్థితి ఎలాగున్నదీ, ఏదైనా కాస్త నయమైనట్టయితే ఆ విషయమూ రాశారు. ఆయన అనారోగ్యం ఒక మహనీయుని అకాల మరణానికి దారి తీసింది. తెలుగు భాషా సాహిత్యాలకు మానవతా స్థాపనకు ఆయన ఎన్ని విధాలుగా ప్రయత్నిస్తూ ఉన్నదీ మనకు అవగతమౌతుంది.

ఇంత అనారోగ్య పరిస్థితులలోను ఆయన భాషా సాహిత్యాల గురించి చెప్పదలచుకున్న దానిని స్పష్టంగా చెప్పక మానలేదు.

అక్కిరాజు ఉమాకాన్తమ్
ఆన్ధ్రవాఙ్మయ సమితి
52, ఆఫీసు, వేఙ్కటాచల మొదలివీధి తిరువెళ్ళికేణి.

☆

# సంతాప సభలు

ఆశయాల కనుగుణంగా రచించే నేర్పు ఆయనకు కలదు. తమ ఆదర్శాలేమో, వాటిని సాధించడానికి ఏం చేయాలో తెలిసిన ఆత్మశక్తి, చైతన్యమూ గల రచయిత.

*గాడిచర్ల హరిసర్వోత్తమరావు*

అప్పారావుగారు నాయకత్వం వహించిన వ్యావహారిక భాషా వాదమునకు తాము వ్యతిరేకులమే అయినా, ఆయనలోగల ఉత్కృష్ట గుణములు, ఆయన శత్రువులు సైతము మెచ్చుకోక తప్పదు. 'గొప్ప గొప్ప పండితులను సైతం, తమ వాదమును నచ్చ జెప్పి, తమకనుగుణంగా మార్చుకునే శక్తి అప్పారావుగారికి ఉంది. తమ వాదానికి తామే ఆదర్శముగ నిలబడి, కావ్యరచన సాగించటమనే ఉత్కృష్ట ఆశయాన్ని ఆయన సాధించారు.

'మరికొన్ని సంవత్సరాలు ఆయన జీవించి, తాము అవలంబించిన రీతులలో రచనలను అధిక సంఖ్యాకంగా సృష్టించి వుంటే, ఈసరికి ఆయన తెలుగు దేశానికి రవీంద్రులయేవారు.'

☆

**అధ్యక్షుడు**

వక్తలు చెప్పిన వాటిలో, అతిశయోక్తులు లేవని చెబుతూ అధ్యక్షత వహించిన శ్రీనివాసయ్యంగారు 'అప్పారావుగారు సునిశిత విమర్శకులు. ఇతరుల రచనలనే కాదు, తమ రచనలను సైతం వారు విమర్శించుకునేవారు. కావ్య వస్తువులోనూ, రీతిలోనూ ఆయన ఆదర్శాలు, పరిపూర్ణతను సాధించారు.'

తమకు, అప్పారావుగారికి గల స్నేహాన్ని ముచ్చటిస్తూ కొన్ని మధురస్మృతులను చెప్పారు. 'సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషా సాహిత్యాలలో, శాసన పరిశోధనలో, పురావస్తుతత్వశాస్త్రంలో ఆయనకు గల జ్ఞానం అపారం. ఆయనతో కొన్నినిమిషాలు ప్రసంగిస్తే చాలు. ఆయన నఖశిఖపర్యంతమూ మహాపండితుడనీ, గొప్ప మేధావి అనీ మనకు బోధ పడుతుంది. విజయనగర రాజకుటుంబీకులు ఆయనకెంతో ఋణపడ్డారని చెప్పవచ్చును. మానవునిగా ఆయనలోగల లోపములకంటె, సుగుణములనే మనం దర్శించగలం.'

అధ్యక్షుని ఉపన్యాసానంతరం, మద్రాసు యూనివర్సిటీ రీడరు బుర్రా శేషగిరి రావుగారు సభవారుకావించిన సంతాప తీర్మానమును అప్పారావుగారి కుటుంబమునకు అందచేయవలసినదిగా సూచించారు.

☆

*మిస్టర్ మార్క్ హంటర్*

*ఆండర్సన్ హౌస్,*
*నుంగంబాకం, మద్రాసు,*
*9-12-1915.*

*రామదాసుగారికి,*

నా మిత్రుడు అప్పారావు మరణవార్త విని క్రుంగిపోయాను. ఆయన సాధించినది

ఉన్నతమైనది. దక్షిణ భారతదేశములో గల మేధావులలో, పండితులలో ప్రధమ శ్రేణికి చెందిన వ్యక్తి. తన రచనలతో తెలుగు భాషా సారస్వతములకు యెనలేని సేవచేసిన రచయిత. ద్రావిడ భాషలకు వాఙ్మయమునకు ఆయన మరణం వలన తీరని నష్టము వాటిల్లినది.

☆

కట్టమంచి రామలింగారెడ్డి

గురజాడ అప్పారావు పంతులుగారు సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషలలో నిష్ణాతులు. ఆయన సృష్టించిన పాత్రలు మానవత్వంతో నిండినట్టివి. ప్రాణమున్న ప్రతి వాక్కరిలోనూ అవి జీవించి, జీవితాన్ని ఉత్సాహవంతం చేస్తాయి. మానవత్వంతోనూ, జీవితంతోనూ పరిపూర్ణమైన రచన కన్యాశుల్కం.

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

అప్పారావు కవి ఆంధ్రవాఙ్మయానికి ఒక సరిహద్దు. ఈయనతో నవ్యసారస్వత యుగం మొదలైంది. స్వాతంత్ర్యపుటూర్పు పోసిన పరమేష్టి. దేశభక్తి అంటే ఏమిటో మొదట తెలియజెప్పిన మహానుభావుడితడే.

దేవులపల్లి కృష్ణశాస్త్రి

*గుత్తునాయని జాతిముత్యముల్*
*గుచ్చినాడే మేలిసరముల*
*ఇత్తునాయని తెలుగుదల్లికి*
*ఇచ్చినాడే భక్తితో!*

రంగవల్లిక మాయమయ్యేను.
చండతేజము మాసిపోయెను
సందెకెంపులు సాగిపోయెను
వెదుకుచున్నారా!

*గిడుగు రామమూర్తి:*

పర్లాకిమిడి
** 5-12-1915 **

ప్రియమైన రామదాసు,

ఎంత విషాదాంతము! అతను గతించినాడు. ప్రియమైన ఆత్మ! నీవలెనే, నాకూ దుఃఖం పొంగుకు వస్తున్నది. నీ విచారములో నేనూ భాగమును పంచుకుంటున్నాను. నా అత్యంత ప్రియ స్నేహితుడు పరమపదించినాడు. ఎలా వున్నదో చూసివద్దామని విశాఖపట్టణం వెళ్ళాను. అదే ఆఖరుసారి అతనిని చూడడం. నేను అతన్ని చూడడానికి వెళ్ళినపుడు డాక్టరు (మంగయ్యనాయుడు–సం) నాకిలా సలహా యిచ్చారు. 'మీరు ఎదుట కనిపించేసరికి ఆయన వుద్రేకం పట్టలేకపోతున్నారు.

అదే పనిగా, జబ్బుమాట మరచి మీతో సాహిత్య గోష్ఠి చేస్తున్నారు. చారిత్రక విషయాలను గురించీ, సారస్వతాన్ని గురించి చర్చలు జరుపుతున్నారు. విపరీతమైన అలసట కలుగుతున్నా లెక్క చేయడం లేదు. ఇలా అయితే ఆయన ఆరోగ్యం మరీ పాడవుతుంది కదా!'

డాక్టరు, అతనికి ఉత్తరాలు వ్రాయవద్దని నాకు చెప్పాడు. నాటి నుండి అతనికి ఉత్తరాలు వ్రాయడం మానుకున్నాను. జబ్బు నిమ్మళిస్తుంది కదా, ఆరోగ్యం తిన్నబడుతుంది కదా అని ఆశిస్తూ వుంటిని. కాని ఇంత త్వరలో మరణం ముంచుకు వస్తుందనుకోలేదు.

నీదస్తూరి ఉన్న అతని ఉత్తరం ఇరవైతొమ్మిదో తేదీన కాలోలు పోస్టు చేశావు. అది అతను చెప్పగా నువ్వు వ్రాసిన ఉత్తరం కదా! అదే కట్ట కడపటి ఉత్తరం.

అతని మరణంతో ఒక గొప్ప వ్యక్తిని, ఒక పరోపకార పరాయణుని, మహాపండితుని మన దేశం పోగొట్టుకొన్నది.

మీ నాయనమ్మను తలుచుకున్నప్పుడంతా నా హృదయం ద్రవించి పోతున్నది. గుండె చెరవవుతున్నది. పాపం, ముసలితనంలో యెంత విపత్తు! ఏమని చెప్పి ఆమె దుఃఖాన్ని నివారించగలం! దుఃఖమును ఆపుకొనేశక్తిని భగవంతుడు ఆమెకు ప్రసాదించుగాక, మీ తల్లిగారిని, నాన్నమ్మను, అక్కచెల్లెళ్ళనూ ఓదార్చి, నువ్వు ధైర్యముతో నుండవలెను.

మా నాన్నగారు పోయేసరికి నాకు పధ్నాలుగేళ్ళు మాత్రమే. దుఃఖం పట్టలేకపోయాను. అవును నాకింకా జ్ఞాపకం ఉంది. దుఃఖిస్తోన్న నన్ను చూసి దుఃఖం పట్టలేక అప్పారావు భోరున దుఃఖించసాగాడు. అదే నన్ను ఉపశమనం చేసింది.

తెలుగు ప్రజల స్మృతి పథంలో అప్పారావు సదా జీవిస్తాడు. చనిపోయినప్పటికీ అతను జీవిస్తున్నాడు. అతన్ని తలచుకోవడమంటే మన జీవితములోని అత్యంత ఆనందమయ సంఘటనలను మన స్మరణకు తెచ్చుకోవడమే.

☆

మిస్టర్. జె.ఎ. ఏట్సు

*4, సౌత్ పెరేడ్,*
*బెంగుళూరు,*
*24-12-'15.*

ప్రియమైన రామదాసు గారూ,

మీ తండ్రిగారి మరణవార్త వినగానే నా ప్రగాఢ సానుభూతిని మీకు అందజేయమని రావుసాహెబ్ గిడుగు రామమూర్తిగారిని కోరితిని. మీ నాన్నగారి ఆప్తమిత్రులు, బంధువులు శ్రీరామ మూర్తిగారు తప్ప, నాకు మరెవ్వరూ తెలియదు.

ఈ విషాద వార్తను నేను ముందు నమ్మలేకపోయాను. ఇది నిజం కాదనుకున్నాను. ఎందుకంటే, ఇలాంటి దురదృష్టకర సంఘటన జరుగకూడదనీ,

జరుగదనీ నా మనసు ఊహించడమే. నేనీ వార్తను నమ్మలేకపోవడానికి కారణం, మొన్న మొన్ననే ఆయన నాకు లేఖ వ్రాశారు. తరువాత తెలుగు వ్యావహారిక భాష మీద ఆయన వ్రాసిన మెమోరాండము పన్నెండు కాపీలు పంపారు. తెలుగు భాషా సంస్కరణకు నడుముకట్టి అహోరాత్రులు కృషి చేసిన మహాపండితుడు పరమపదించడం తీరని లోటు. అంతటి హాస్యరస ప్రధానమైన గొప్ప నాటకాన్ని రచించి సంస్కరణోద్యమాన్ని శక్తివంతమైన దానినిగా చేసిన ప్రతిభాశాలి ఆయన. ఆయనకు బదులుగా ఆయన రచనలు యెల్లకాలమూ జీవిస్తాయి. మహత్తరమైన ప్రయోజనమును సాధించి, ఉదాత్త ఆశయముల కోసం ఆయన మరణించారు. ఆ ఆశయములు నెరవేరెనవి. కనుక ఆయన లేరనే దిగులు పడనక్కరలేదు. భవిష్యత్తులో ఒక్కొక్క యేడాదీ పై బడుతున్న కొద్దీ మానవులు గతం వెనుక కొకసారి తిరిగి చూసుకుని నమ్రతతో, గౌరవముతో మీ నాయనగారికి జోహారులర్పిస్తారు. రచయితగా, పండితునిగా, దేశభాషా సంస్కరణోద్యమ ఆద్యులుగా లోకము ఆయనకు హారతులు పడుతుంది.

ఆయనతో నాకు పరిచయం లభించడం ఎంత అదృష్టం! తెలుగు భాషా సాహిత్యములను గురించి యెన్నో విషయములను తెలుపుతూ ఆయన నాకు లేఖలు వ్రాసేవారు.

☆

*వంగదేశీయ ఆంధ్ర సమితి*

డిసెంబరు పన్నెండవ తేదీన వంగదేశీయ ఆంధ్ర సమితి, సంతాపసభను ఏర్పాటు చేశారు. కీర్తిశేషులగు గురజాడ అప్పారావు గారు ఆంధ్రదేశమునకు చేసిన మేలు మరువలేదని, ఆంధ్రదేశము ఒక మహోజ్వల వ్యక్తిని కోల్పోయిందని కొద్ది నిమిషాలు నిలిచి శ్రద్ధాంజలి ఘటించారు.

☆

కన్యాశుల్కంలోని ప్రతి ఒక్క పాత్ర (రంగం మీదికి రాని పాత్రలు సైతం) అప్పారావుగారి పరకాయ ప్రవేశాలు. అవి ఎన్ని తరహాలవో లెక్కగట్టడం శక్యంకాని పని.

ఒక చిత్రం ఏమిటంటే, ప్రసిద్ధ రచయిత రాచకొండ విశ్వనాథ శాస్త్రి 1956 వరకు తాను కన్యాశుల్కాన్ని చదవలేదని అన్నారు. ఆ నాటకం ఆయనకు మనిషి రాసిందిగా కన్పించలేదట. అది దేవుడు రాసిందనిపించిందట. అటువంటిది మనిషి రాయలేడట.

గురజాడ రచనల సంపుటాలలో చివరిది "జాబులు – జవాబులు", "దినచర్యలు".

★ ★ ★